# పెరిగే పాపాయిలకు

కావాలి ఒక ప్రత్యేకమైన ఘన ఆహారం...

# ఫారెక్స్



**ఎందుకంటే ఫారెక్స్ పాపాయిల సత్వరమైన మరియు సంపూర్ణమైన పెరుగుదల కోసం అధిక పుష్టికరమైన ఘన ఆహారం**

**1** మీ పాపాయి పెరుగుదలకు అత్యావశ్యకమైన ప్రొటీన్‌తో సమృద్ధమైనది ఫారెక్స్

**2** మీ పాపాయిని రక్తహీనత నుండి సంరక్షించడానికి పాపాయి యొక్క రోగ-ప్రతిరోధక శక్తిని ఎక్కువ చేయడానికి మరియు ఆరోగ్యవంతమైన రక్తం సమకూర్చడానికోసం బ్రాండ్ చేయబడిన మరే ఇతర ఘన ఆహారం కన్నా అధిక ఐరన్ కలిగి వున్నది ఫారెక్స్

**3** మీ పాపాయికి గట్టి పళ్లు మరియు ఆరోగ్యవంతమైన ఎముకలు ఏర్పడటానికి అవసరమైన కాల్షియం మరియు ఫాస్ఫరస్‌ను ఆదర్శవంతమైన నిష్పత్తిలో కలిగిన ఏకైక బ్రాండ్ చేయబడిన ఘన ఆహారం ఫారెక్స్

**4** మీ పాపాయి సున్నితమై జీర్ణశక్తికి అనువుగా ప్రత్యేక ముందుగానే పచనం చేయబడినది కనుక ఎంతో సులభ జీర్ణమవుతుంది ఫారెక్స్




డాక్టర్లు సిఫార్సు చేస్తారు

**ఫారెక్స్®**

గ్లాక్సో నుండి

CASGLF 42 18

స్థాపకుడు

వి వి రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్

లీలావతి రాఘవయ్య

సంపుటి 21 జనవరి 84 సంచిక 12

# ఇలోపలి పలుకు...



ఈ నెల నవలానుబంధం

## చీకటి కాల్చిన వెన్నెల

తల్లావఝ్ఝుల సుందరం

జ్యోతి భాగ్యలక్ష్మి నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన నవల

జ్యోతి పి బి నెం 1824, హైదరాబాద్-20 ఫోన్ 61180

ముఖచిత్రం శ్రీదేవి కమలహాసన్, అమితాబ్ బచ్చన్

# ఆనాడూ ఈ నాడూ కొందరి చర్మ సౌందర్యం ఒక్కటే!





పియర్స్ అసలైన ఇంగ్లండ్ సబ్బు

మీ చర్మానికి ఆ మృదువైన సంరక్షణ ఇవ్వండి— పియర్స్‌తో. సబ్బు తయారు చెయ్యడంలో ఓ శతాబ్దపు అనుభవం స్ఫటికం లాంటి ఆ ప్రతి సబ్బు బిళ్లలోనూ ఇమిడి వుంది పియర్స్ ఎంతో సున్నితమైనది మరెంతో శుద్ధమైనది— దానిలోంచి మీరు చూడగలంతగా।

**పియర్స్ మీ చర్మాన్ని యవ్వనంగా, సుకుమారంగా ఉంచుతుంది**

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS PS 56 (R) 1810 TL



జ్యోతి దీపావళి ప్రత్యేక సంచికను ప్రశంసిస్తూ అనేక మంది పాఠకుల లేఖలు మాకుచేరాయి. ముఖ్యంగా రాజకీయ దీపావళి ముఖచిత్రం, నిర్వచనాలు, గొలుసు నవల, కార్టూన్లు– ఇవన్నీ ఎంతో బావున్నాయన్న అభిప్రాయం వెలిబుచ్చారందరూ.

ప్రత్యేక సంచిక విషయంలో తన ప్రత్యేకతను నిలబెట్టుకోడానికి జ్యోతి ఎప్పుడూ కృషిచేస్తూనే ఉంటుందని వాగ్దానం చేస్తున్నాం. అలాగే 'జ్యోతి'ని ఎప్పటికప్పుడు మీ అభిరుచికి తగ్గ శీర్షికలతో ప్రయోగాలతో మరింత ఆకర్షణీయంగా మీకందించాలనే మా ప్రయత్నం.

ఈ సంచికలో ప్రారంభమవుతున్న "పొలిట్రిక్స్" శీర్షిక ఆ ప్రయత్నంలో భాగమే! మనచుట్టూ జరిగే వివిధ రంగాల్లోని అవకతవకలకు హాస్య, వ్యంగ్య రూపకల్పనే ఈ శీర్షిక! తప్పక మీ అందరి [illegible] పొందుతుందని మా నమ్మకం.

ఇటీవల అసంఖ్యాకంగా తమ అభిప్రాయాలు, విమర్శలు, సూచనలు అందజేస్తున్న పాఠకులందరికీ మా కృతజ్ఞతలు!

సం॥

ఆర్యా,

డిసెంబరు "జ్యోతి" లోని- చంద్ర గారి కార్టూన్లు అద్భుతంగా ఉన్నాయి వారికి నా అభినందనలు

బి శ్రీనాథ్, సామర్లకోట

చంద్రగారు వేసిన ముఖచిత్రంతో వెలువడిన మా (మీ) దీపావళి సంచిక చాలా బాగుంది అందులో ప్రచురించిన "సిగ్గు సిగ్గు" అనే కథ చాలా బాగుంది అంత చక్కటి కథను ప్రచురించిన మీకు, రచయిత్రికి నా హృదయపూర్వక అభినందనలు ఇటువంటి కథలను భవిష్యత్తులో ప్రచురిస్తారని ఆశిస్తాను,–

పి నాగేంద్రబాబు, బాలానగర్

నవంబరు మాసం జ్యోతి నవలాను బంధం శ్రీ చెల్లూరి సీతా రాజేశ్వరరావు రాసిన నవల ఏమీ బాగులేదు ఎందుకంటే,

అందులో తండ్రీ, కొడుకూ ఇద్దరూ కలిసి బారుకి వెళ్ళడం రాసేరు ఇలాంటిది పాశ్చాత్య దేశాల్లో బహుశా ఉండవచ్చునేమో కాని మన దేశంలో ఎంత జులాయి తిరుగుళ్ళు తిరిగేవారైనా మన దేశంలో మాత్రం ఇలాంటిది జరగదు మధ్యతరగతి కుటుంబాల్లో

పోతే ఆ నవలలో 49వ పేజీలో "పెళ్ళాన్ని వంచలేని నువ్వేం మగాడివయ్యా" అని కొడుకు తండ్రిని తిట్టేలాగా తన తల్లిని దండించమని కవ్వింపుగా అనడం మన సంస్కృతిలో




ఎక్కడా లేదు తండ్రి తల్లిని దండిస్తూ వుంటే చూసి తండ్రిని ఎదిరించే పిల్లలే ఇంతవరకూ మనదేశంలో వున్నారుగాని నాగరికత వెర్రితలలు వేస్తే ఇకమీదట పుడతారేమో !

అలాగే 52వ పుటలో "నాన్నారూ ! అమ్మ వైకుంఠాన్ని వెనక వేసుకొని వస్తోంది వైకుంఠంతో రహస్య సంబంధం ఏదైనా ఉందేమో" అని కొడుకు చేత తల్లిపట్ల డైలాగు అనిపించడం సభ్యతేనా?? చివరికి పతితకి పుట్టిన కొడుకు కూడా తన తల్లి శీలంగురించి మాట్లాడేవాళ్ళు మనదేశంలో ఎక్కడా లేరు ఇటువంటి అంశాలు గాని, డైలాగులు గాని రాయకూడదు సరికదా, కలలో కూడా వూహించకూడని అంశాలు, అటువంటిది ఇంత ఘోరాన్ని రచయిత వూహించడం విడ్డూరంగావుంది రచనలు వ్యక్తుల సభ్యత సంస్కారాన్ని ప్రతిబింబిస్తాయన్న సత్యాన్ని రచయిత గుర్తించుకొని పరిణతి గల రచనలు చేస్తే బాగుంటుంది

శాంతి, హైదరాబాదు-44

'రాధ' ముఖ చిత్రంతో వెలువడిన "జ్యోతి"లో ద్విభాష్యం రాజేశ్వరరావు గారు 'భూ త ం' కథకు కొంత వాస్త వాన్ని జతచేసి మొత్తంమీద పాఠకుల మన్నలను పొందారు. శ ం డి ల గారి 'మొగ్గలోముల్లు' కూడా బాగానే ఉంది ఆణిముత్యాలాంటి మంచి మంచి కథలు, సీరియల్స్ ఇకమీదట కూడా పాఠక లోకానికి అందించగలరని ఆశిస్తాను

శ్రీపతి ప్రభాకరశర్మ, కాకినాడ

డిసెంబరు నెల 'జ్యోతి' ముఖచిత్రం చూడముచ్చటగా వుంది. ముఖ్యంగా ఈ సారి ప్రచురించిన కథలలో ద్విభాష్యం రాజేశ్వరరావుగారి "భూ త ం" కథ చక్కని రచనాశైలితో వుండి విలువైన ఇతివృత్తాన్ని కలిగివుంది, మిగతాకథలు కూడా చాలా బావున్నాయి. బల్లాదేవిగారి "కల్లోలగౌతమి" సీరియల్ చాలాఇంట్రె స్టింగ్‌గా సాగిపోతుంది. కార్టూన్స్ కేవ లం ఒకరివే కాకుండా వివిధ కార్టూనిస్ట్ ల కార్టూన్లు ప్రచురిస్తే బావుంటుంది. ముఖ్యంగా నూతన కార్టూనిస్ట్‌లకు అవకా శంఇస్తే బావుంటుందని నాఅభిప్రాయం.

కొమ్మినేని ప్రసాద్, గుంటూరు-1

ఎడిటర్ గార్కి...

దీపావళి జ్యోతికి బంగారు గొలుసు చక్కగా అమరించి చేయించిన మీకు, చేసిన రచయితలకు కృతజ్ఞతలు,

స్త్రీ జీవితంలోని అదర్ సైడ్‌ని రచ యితలు ఈ గొలుసు నవలలో చూపిం చారు. ఇందులో ముఖ్యంగా చివరి చంద్రగారి పీస్... గొలుసుకి పన్నెను తెచ్చింది

స్త్రీమ స్తిష్కంలోకి జొరబడి, తడిమి చీకటి కుహరాల్లో మిణుకు మిణుకుమం టున్న కాంతికే బైర్లుకమ్మి... కనీ కన బడని కనురెప్పల సందుల్లోంచి , మసక మసగా కనిపించిన కొద్దిపాటి స్త్రీ ఇన్నర్ సెల్ఫ్‌ని చవిమాపించారు,

ముఖ్యంగా ఇందులో చైతన్య స్రవంతి– స్ట్రీమ్ ఆఫ్ కాన్షియస్‌నెస్ టెక్నిక్‌ను సులభతరం చేయడం జరి గింది

ఏమైనప్పటికి సాటి స్త్రీ జీవితాన్ని రచయిత్రులు అర్థం చేసుకోడానికి... ఎంతంత దూరమో కాదు... ఎంతో దూరం.–

గౌస్, సికింద్రాబాదు.

మీరు ఈ నెల ప్రచురించిన కథలలో 'కాలేపు శివశేఖర్'గారి 'భ్రమణం' తప్ప మరేదీ మమ్మల్ని అలరించలేకపో యింది ముఖచిత్రంపై తీసుకుంటున్న శ్రద్ధకు ధన్యవాదాలు. పి. సత్యవతిగారి 'మధ్యతరగతి మందహాసం' చాలా బాగుంది. రచయిత్రిగారికి ధన్యవాదాలు తెలుపండి "హ్యామరాంజీ" 'టూ మచ్'గా ఉంది.

శలపాక రవి, పెద్దాపురం

మీ (మా) 'జ్యోతి' పత్రిక కొనగానే నేమొట్టమొదలు చదివే శీర్షిక యర్రంశెట్టి శాయిగారి 'హ్యూమరాలజీ' కానీ ఎప్పుడూ ఉత్తరం రాయలేదు. ఈనెల (డిశెంబర్) 'జ్యోతి'లోని హ్యూమరాలజీ-11' చది వాక ఈ లెటర్ రాయకుండా వుండలేక పోతున్నాను. ప్రస్తుత పరిస్థితులలో పత్రికలు ఎలా నిర్వహింప బడుతున్నాయో, వాటిలో గల లోటుపాట్లు ఏమిటో సునిశితమైన హాస్యంతో వివరించారు. శాయిగారు వాస్తవానికి దర్పణంలా "పత్రికోపాఖ్యానం" అంశాన్ని మలచిన శాయి గారు అభినందనీయులు. ఈ వ్యంగ్య రచనద్వారా కొంతమంది పత్రికాధిపతులైన తమ తీరుతెన్నుల గురించి ఒక్కసారి అవలోకించుకుంటే, భవిష్యత్తులో ఇటువంటి వ్యంగ్యరచనలు చేయటానికి శాయిగారికి అవకాశం రాకపోవచ్చు యండమూరి గారి సీరియల్ కోసం అత్యంత ఆసక్తితో ఎదురుచూస్తున్నాను. ఆకర్షణీయమైన శీర్షికలతో జ్యోతిని మాపొందిస్తున్న సంపాదక వర్గానికి అభినందనలు.

పెలిశెట్టి ఉదయభాస్కరరావు,
దుగ్గిరాల

## శాంతి

చీకట్లో నిద్రిస్తున్న
చిన్నారి పువ్వు ఎదలో
దాక్కున్న పరిమళం శాంతి!
గానం లో ఘనీభవించి
కనిపించక, వినిపించే
కన్నీటి చుక్క శాంతి!
అనంత శూన్య సముద్రంలో
రాత్రి విసిరిన
చీకటి చుక్కల వల శాంతి!
తీక్షణ సూర్య తాపాన్ని
వడగట్టి వెన్నెల సారాన్ని
భూమికిచ్చే
చంద్రుడు శాంతి!

సౌభాగ్య

# యండమూరి వీరేంద్రనాథ్



## అందించనున్న
## కొత్త సీరియల్ త్వరలో
## ఆరంభమవుతుంది

# వార్తలు - విశేషాలు



శ్రీ టి. కె. కె. భగవత్ వైశ్యా బాంక్ ఛైర్మన్ పదవిని ఉన్నతంగా నిర్వహించి ప్రస్తుతం "ఇంటర్నేషనల్ మానిటరీ ఫండ్" బాంక్ ఆఫ్ యుగాండా, కంపాలాకు సలహాదారుగా కొత్త హోదా స్వీకరించారు. 26 స॥ బాంక్ సేవగాక దేశంలో వివిధ కమిటీలలో ముఖ్య అధికారిగా అత్యున్నత సేవచేశారు. జ్యోతి ఆయనకి శుభాకాంక్షలు అందజేస్తోంది,

పాఠకులనుంచీ "మేము కూడా జోక్స్ రాసి పంపించ వచ్చా" అని అడుగుతూ అనేక పుత్తరాలు చేరాయి. అలాగే తప్పకుండా జోక్స్ క్లుప్తంగా రాసి పంపండి. బాగున్నవి ప్రచురిత మవుతాయి. వాటికి పారితోషికం కూడా వుంటుంది

॥సంపాదకులు॥



## (బాల) శివతాండవం

ఆంధ్ర శిల్ప సంస్కృతీ నాట్యసౌందర్యావలోకంతో, కూర్చిన పేరిణి శివ తాండవ శిక్షణను శ్రీ నటరాజ రామకృష్ణ గారు ఎందరో యువకులకి నేర్పిన మహామహులు. వారి శిక్షణలో చిరంజీవి భవానీ శంకర్ రంగప్రవేశంలో పేరిణి శివతాండవం చక్కగా చేశాడు. శ్రీ జె వి. సోమయాజులు, శ్రీ ఆదివిష్ణుల సమక్షంలో, సభని ఆనందింపచేసిన ఈ చిరంజీవి రచయిత్రి శ్రీమతి గంటి (శిఖా) వెంకటరమణ పుత్రుడు వీరికి జ్యోతి అభినందనలు



శ్రీమతి జయా నాగరాజ్ వైజ్ఞానిక ప్రపంచ యాత్ర ముగించి వచ్చిన సందర్భంలో విశ్వసాహితీవారు కృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయం, హైదరాబాద్‌లో సన్మాన సభ ఏర్పరచిన ఆ సందర్భంలో .. డా॥ రాజ్యలక్ష్మి, వాసిరెడ్డి సీతాదేవి... సన్మానం స్వీకరిస్తున్న శ్రీమతి జయా నాగరాజ్...

## రాజాలక్ష్మి 'అవార్డ్' ప్రదానం

వివిధ సాంస్కృతిక రంగాల్లో నిష్ణాతులకి ప్రతి యేటా సత్కరించి ఇచ్చే రాజాలక్ష్మి అవార్డ్ ఈ సంవత్సరం డా॥ మొలవర్తి నాయుడమ్మగారికి ఇవ్వడం జరిగింది దేశ, విదేశాలలో వివిధ వైజ్ఞానిక రంగాలలో అత్యున్నత శాఖల నలంకరించి ఎనలేని కృషి చేస్తున్న శ్రీ నాయుడమ్మకి జరిగిన ఈ సత్కారము తెలుగువారంతా ఆనందించవలసి నది నవంబర్ 19వ తేదీన రవీంద్ర భారతి, హైదరాబాద్‌లో శ్రీ ఆవుల సాంబశివరావు, శ్రీ జనరల్ కె. వి. కృష్ణారావు, శ్రీ కె జి కె మూర్తి, డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారల సమక్షంలో ఘనసత్కారం జరిగింది చిట్టిబాబు వీణానాదతరంగాలతో సభ ఘనంగా జరిగింది

# కళాసాగర్ అవార్డులు 82

కళాసాగర్ పదకొండవ వార్షికోత్సవ కార్యక్రమం ఘనంగా జరుపుకుంది ముఖ్యఅతిథిగా తమిళనాడు గవర్నరు శ్రీ ఎస్ ఎల్ ఖురానా విచ్చేశారు వరద బాధితుల సహాయార్థం తెలుగు సినీనటుల సమాఖ్య "స్టార్‌నైట్'' అత్యంత వేడుకగా జరిగింది అందులో శ్రీయుతులు దాసరినారాయణరావు, ఇంకా అనేక నటనటులు పాల్గొన్నారు ఉత్తమచిత్రంగా 'మేఘసందేశం' ఉత్తమ దర్శకుడిగా దాసరి, ఉత్తమ నటుడిగా అక్కినేని, స్పెషల్ కమెండేషన్ బహుమతి చిరంజీవి, ఉత్తమ నటిగా జయసుధ, స్పెషల్ కమెండేషన్ బహుమతికి సరిత, ఉత్తమ సహాయ నటుడిగా గొల్లపూడి, ఉత్తమ సహాయనటిగా అన్నపూర్ణ, ఉత్తమ హాస్యనటుడిగా వేలు, ఉత్తమ కథకి కె విశ్వనాథ్ ఉత్తమ సంభాషణకి జంధ్యాల, ఉత్తమ గీతానికి మల్లెపూలు, ఉత్తమ గాయకుడిగా జేసుదాస్, ఉత్తమ గాయనిగా పి సుశీల, ఉత్తమ సంగీత దర్శకుడిగా రమేష్ నాయుడు బహుమతులందుకొన్నారు సభ యూనివర్సిటీ సెంటినరీ ఆడిటోరియం మద్రాస్‌లో జయప్రదంగా జరిగింది.



ప్రముఖ రచయిత్రి డాక్టర్ కె వి కృష్ణకుమారిని సాహిత్యరంగలో కృషికి సందర్భంగా సత్కరిస్తున్న ప్రముఖ నటులు డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు

# పాఠకులకి

తెలుగు నవలలూ, కథలూ కొన్ని చదువుతున్నపుడు మీకు పట్ట రాని కోపం వస్తుందా? రచయిత అభిప్రాయాలతో మీరు ఏకీభవిస్తారా? ఆ సంఘటనలు మీ జీవితానికి దగ్గరగా వుంటాయా? తెలుగు సాహిత్యంలో విశిష్టమైన స్థానం సంపాయించిన కొన్ని నవలల గురించి మీమీ మనోభిప్రాయాలు సేకరించే, సరికొత్త సాహిత్య గవాక్షం పైనెల నుంచీ ఆవిష్కరింప బడుతోంది

# 'మీరే మంటారు'

శీర్షిక

నిర్వహణ మాలతీ చందూర్




# పాలిట్రిక్సు 'వైస్యాస్'

## ప్రజా సేవయే మా కర్తవ్యం

ఎప్పుడూ ఏదొక అవాంతరం ముంచుకు రావడం, మన తెలుగు ప్రజల్ని నానా ఇబ్బందులూ పెట్టటం మనందరం చూస్తూనే ఉన్నాం.

అంచేత న్యూస్‌పేపర్ రాగానే 'ఈనాటి సరికొత్త ఇబ్బంది' శీర్షిక కోసం చూశాను. ఆర్టీసీ వారు దూరప్రాంత ప్రయాణీకుల కోసం కొత్తగా ఏర్పాటు చేసిన సౌకర్యాల ప్రకటన కనిపించింది.

సంగతేమిటో తెలుసుకుందామని ఆర్టీసీలో చాలా ముఖ్యమయిన పదవిలో ఉన్న నా స్నేహితుడిని కలుసుకున్నాను.

"కొంచెంసేపాగు! టూరిస్ట్ బస్ పాసింజెర్స్ అసోసియేషన్ ప్రెసిడెంట్ రంగారెడ్డిగారితో చర్చలు ఏర్పాటు చేశాం! నువ్వూ చర్చల్లో పాల్గొందువుగాని" అన్నాడతను.

మరి కాసేపట్లో రంగారెడ్డి రావటం, చర్చలు ప్రారంభమవడం జరిగిపోయాయ్.

"దూరప్రాంత ఆర్టీసీ బస్సులను ఇప్పుడు సంజీవరెడ్డి నగర్, అమీర్‌పేటల మీదుగా నడుపుతున్నాం. కనుక మీ ప్రయాణీకులందరూ ఇకనుంచీ ప్రైవేట్ బస్‌లు ఎక్కటం మానేసి ఆర్టీసీబస్‌లనే




వాడతారని ఆశిస్తున్నాను—" అన్నాడు మా ఫ్రెండ్.

"మేము వాడం" అన్నాడు రంగా రెడ్డి మొండిగా.

"అదేమిటి? ఎందుకని ఆర్టీసీబస్సులు వాడరు? మేము కూడా మీఇళ్ళ దగ్గర నుంచే స్టార్ట్ చేస్తున్నాము కదా!"

"మా ఇల్లు లాలాగూడాలో ఉంది!" అన్నాడతను.

వెంటనే మా ఫ్రెండ్ తన శెక్రటరీ వేపు తిరిగి "దూరప్రాంత ఆర్టీసీబస్‌లు లాలాగూడా మీదుగా కూడా నడపడానికి వీలుంటుందా?" అనడిగాడు.

"నడపవచ్చండీ! కాపోతే ఇంకో నాలుగులీటర్ల డీసెల్ ఆయిల్, మరో అరగంట ప్రయాణ సమయం పెరుగుతాయ్."

"ఓ. కే. ఏం ఫరవాలేదు! మిస్టర్ రంగా రెడ్డీ! మీరు కోరినట్లుగా మా బస్‌లు లాలాగూడా కూడా 'టచ్' చేస్తయ్! మరి మీరు ప్రైవేట్ సర్వీస్‌లు ఎక్కమని మాటిస్తారా?"

"నో-" అన్నాడు రెడ్డి.

"అదేమిటి? మీరు కోరినట్లే మీఅందరి ఇళ్ళ దగ్గరకీ మా బస్‌లొస్తున్నాయ్ కదా?"

"మాకు ప్రైవేట్ టూరిస్ట్ బస్‌లలో వీడియో సినిమాలు చూపిస్తారు." అన్నాడు రంగారెడ్డి.

మా ఫ్రెండ్ మళ్ళీ సెక్రటరీని కన్సల్ట్ చేశాడు. శెక్రటరీ టేబుల్స్ చూశాడు.

"మన బస్సుల్లో కూడా వీడియో పెట్టవచ్చండీ! కాపోతే ఇంకో రెండు రూపాయలు ఛార్జీ పెరుగుతుంది—"

"ఓ. కే. మిస్టర్ రెడ్డీ! వీడియో సినిమాలు ఇక నుంచీ మా బస్సుల్లో కూడా ఏర్పాటు చేస్తాం! మరి మీరు మా బస్‌లు..."

"ఎక్కం!" అన్నాడు రెడ్డి.

నాకు రెడ్డి మీద కోపం ముంచుకొచ్చింది. అవతల పాపం ఆర్టీసీ వాళ్ళు అంత హైరానపడి ఇన్ని సౌకర్యాలు ఏర్పాటు చేస్తామంటున్నా ఇంకా నీలుగుడేమిటి?

"ఇంకేమిటి మళ్ళీ?" అడిగాడు మా ఫ్రెండ్.

"మీ సూపర్‌డీలక్స్ రేట్లకంటె టూరిస్ట్ బస్‌ఛార్జీలు నాలుగయిదు రూపాయలు తక్కువ!" అన్నాడు రెడ్డి.

మా ఫ్రెండ్ మీద జాలి కలిగింది నాకు.

ఎందుకంటె ఇంత ఎక్కువ ఛార్జీలు వసూలు చేస్తుంటేనే ఆర్టీసీకి పాపం, నష్టాలు వస్తున్నాయ్. మరి ఇప్పుడు టూరిస్ట్‌బస్‌లతో పోటీగా ఛార్జీలు తగ్గించాలంటే...

మా ఫ్రెండ్ మళ్ళీ సెక్రటరీని కన్సల్ట్ చేశాడు. సెక్రటరీ పావుగంట సేపు టేబుల్స్‌తోనూ, చార్ట్‌లతోనూ కుస్తీపట్టి ఎనిమిది సార్లు ఎకౌంట్స్ డిపార్ట్‌మెంటుకి ఫోన్లుకొట్టి చివరకు ఛార్జీ తగ్గించవచ్చని చెప్పాడు. అయితే దానికి బదులుగా ఇంకేవో ఛార్జీలు పెంచాల్సి ఉంటుందని సూచించాడు.

"ఓ. కే. మిస్టర్ రెడ్డీ! ఛార్జీ కూడా టూరిస్ట్‌బస్‌లతో సమానంగా చేస్తున్నాం" అన్నాడు మా ఫ్రెండ్.

ఇక రెడ్డి ఒప్పుకుంటాడనీ, కథ సుఖాంత మవుతుందనీ అనుకున్నాను. కానీ





"అయినా సరే! టూరిస్ట్‌బస్ ప్రయాణమే సుఖం!" అన్నాడు రెడ్డి. ఈసారి నేను కల్పించుకున్నాను.

"ఇదన్యాయం! అవతలవాళ్ళు టూరిస్ట్ బస్ ప్రయాణం వల్ల మీకు కలిగే లాభాలన్నీ ఆర్టీసీ బస్‌లో కూడా ఏర్పాటుచేస్తామంటూన్నారు! ఇంకా మీరు టూరిస్ట్ బస్‌లు వదలననడం బావుండ లేదు-"

"వీటన్నింటిని మించిన సౌకర్యం ఒకటి టూరిస్ట్ బస్ వాళ్లు ఏర్పాటు చేస్తున్నారు! మరి మీరుకూడా అదిఫాలో అయితే..." అన్నాడు రెడ్డి.

"ఏమిటది"

"టైమ్‌ఫాక్టర్! టూరిస్ట్ హైద్రాబాద్ లో బయలుదేరితే విజయవాడవరకు నాన్ స్టాప్‌జర్నీ చేస్తుంది. అంటే ఐదున్నర గంటల్లో విజయవాడ చేరుకోవచ్చు. కానీ మరి ఆర్టీసీబస్‌లు కనబడ్డ ప్రతిడిపో లోనూ ఇష్టమొచ్చినంత సేపు ఆగిపోవడం, డ్రయివర్లు మారడం!

స్టాఫ్ భోజనాలు, కాఫీలకు ఆగడం- మొత్తం ఆరున్నర నుంచీ ఏడు గంటల ప్రయాణం- కనుక ఆర్టీసీ బస్‌లో ప్రయాణంచేసి రెండు గంటల టైము వృథాచేయడం మావల్లకాదు. టైమ్‌ఎంత విలువైనదో మీకు తెలుసుకదా! టైమ్ ఈజ్ మనీ!"

నేను మా ఫ్రెండ్ వంక చూసాను. మా ఫ్రెండ్ శెక్రటరీ వేపు చూశాడు. శెక్రటరీ మళ్ళీ చార్ట్‌లు, టేబుల్స్, మ్యాప్‌లు అన్నీతీశాడు. ఎక్కడెక్కడికో ఫోన్లు చేశాడు.

"ఊహు లాభం లేదుసార్! ప్రతి డిపో దగ్గర అరగంట సేపు ఆగకుండానూ, ప్రతి క్యాంటీన్ దగ్గర టీ తాగకుండానూ మనస్టాఫ్ ఉండలేరు. ఆర్టీసీ పుట్టిన దగ్గరనుంచీ వస్తున్న ఆన వాయితీ ఇది!

వెంకట్రావ్ చిరాకుగా లేచి నిల బడ్డాడు. "సారీ! మీకూ మాకూకుదరదు అనేసి వెళ్ళి పోయాడు బయటకి

మా ఫ్రెండ్ కోపంగా బల్లేగుద్దాడు చేసేదేమీ లేక.

"ఆల్‌రైట్! వీళ్ళందరూ మాఆర్టీసీ బస్‌లలోనే ప్రయాణం చేసేలాచేస్తాను!" అన్నాడు మండిపడుతూ

"అంటే మీ బస్ జర్నీటైమ్ కూడా తగ్గిస్తావా?"

"ఊహ! అదికాదు!"

"ఈ టూరిస్ట్‌బస్ లన్నింటినీ నానా తిప్పలూ పెడతాము. మా ప్రభుత్వంతో చెప్పి! చెకింగ్‌లు చేయించి, వాళ్ళకు పర్మిట్లుఉన్నా,నిష్కారణంగాఆపి, ఆల స్యంచేసి- వాటి ప్రయాణకాలం కూడా ఏడుగంటలయేలా చేస్తాము. అప్పుడు వీళ్లుమాబస్‌లు ఎలా ఎక్కరో చూస్తాను"

"వొండర్‌ఫుల్ అయిడియా! అంతే కాదు! ఆటూరిస్ట్ సర్వీసులు ఎక్కేవాళ్ళ నుకూడా నానా తిప్పలూ పెట్టాలి. బయటకులాగి, కొరడాలతో కొట్టి, ఏనుగులతో తొక్కించి..."

మా ఫ్రెండ్ నావేపు కోపంగా చూసి "స్టాపిట్" అనేసి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. *

# చేతులెత్తిన ప్రజాస్వామ్యం

## వాసిరెడ్డి నారాయణరావు

శ్రీమాన్ పరంధామయ్యగారు పంచాయతీ బోర్డు ప్రెసిడెంటుగిరీకి పోటీ చేయబోతున్నారన్న వార్త గుప్పుమనగానే ఉల్లిపాలెంలో అణువుబాంబు పేలినంత పనయింది!

పార్లమెంటుకు పోటీ చేసిన (డిపాజిట్టు వచ్చిందా రాలేదాన్న విషయం వేరు!) పరంధామయ్యగారు "అవ్వ!" పంచాయతీ బోర్డుకు నుంచోట మేమిటని జనం ముక్కుమీద వేలేసుకొని గుడ్లు మిటకరించారు! అందులో నారాయణ ముఠా వాళ్ళకు ముక్కు మీదగాదు మూతిమీదే కొట్టినట్టయింది!!

పార్లమెంటు ఎలక్షన్లనాటి దగ్గర్నుంచీ నారాయణకు పంచాయతీ బోర్డు ప్రెసిడెంటు ఆశచూపి, పరంధామయ్య తన పబ్బం గడిపేస్తూ వచ్చాడు నిన్నగాక మొన్న పార్టీ కమిటీ ఎన్నికల్లో గూడా నారాయణ మన కాబోయే ప్రెసిడెంటని వుబకేశాడు కాని యీ నిర్ణయం నారాయణ్ని వెనక్కు తిరగమని నడ్డివిరగొట్టినట్టయింది

షావుకారు పరంధామయ్య అండతో యీ సారి పంచాయతీ బోర్డు ప్రెసిడెంటు తప్పక అవుతాననుకొన్న నారాయణ అప్పుడే ప్రెసిడెంటు అయిపోయినట్టు నడ్డి విరుచుకొని - అదే లేండి - రొమ్ము విరుచుకొని తిరగడం మొదలు పెట్టాడు మొదట్లో "ఏం పెసరట్టూ!" అని ఎగతాళీగా పిలిచిన జనం, యిప్పుడు "ఏం ప్రెసిడెంటూ?" అనీ పిలిస్తేనేగాని వినపడకుండా పోయింది నారాయణకు, ఐతే పరంధామయ్య ప్రెసిడెంటు పదవికి తనే నుంచునే ప్రయత్నంలో వున్నాడనే సరికి నారాయణకి నడుములు జారిపోయినై పిచ్చెత్తిన కుక్కలా నారాయణ బజార్నపడ్డాడు పరంధామయ్యను పేరు వరసలు పెట్టితిట్టూ,

పరంధామయ్య మనుషులు నారాయణ నోటిమీద కొట్టేదాకా వచ్చేసరికి, చప్పున తగ్గి నారాయణ సందుదోవన పడ్డాడు కులం వాళ్ళ వోట్లు అడుక్కుంటూ

పరంధామయ్య అలా అకస్మాత్తుగా తన నిర్ణయాన్ని మార్చుకోటానికూడా చాలా పెద్ద కారణాలే వున్నట్టు ఆయన మనుషులు అంటారు

"ఈ నడుముల్లేని నారాయణ్ని నమ్మి కూర్చుంటే, యల్లమందయ్య కూలీ సంఘం వాళ్ళ తోడ్పాటుతో పీట కాస్తా ఎక్కేస్తాడు యల్లమందయ్య కుర్చీ ఎక్కి కూర్చుంటే వూళ్ళో రైతులు తలలెత్తుకు తిరగటానికేనా? కూలి గింజలు

కొచ్చుకొనే యల్లమందయ్యగాడు పెసి కొయిలుయితే గ్రామంలో ప్రజ మాహా మొత్తుకు. తిరగడానికేనా?

—ఇదీ పరంధామయ్య మనుషుల ప్రచారధోరణి

ఎలక్షన్‌రోజు ముందు పడుతూన్న కొద్దీ మూడు పార్టీల ప్రచారం ముమ్మరంగా సాగిపోతూంది

యల్లమందయ్య పల్లెలో తనవాళ్ళల్లో ప్రచారం చేసుకొంటున్నాడు కూలోడికి కూలోళ్లు వోట్లిచ్చుకోకపోతే ఎవరిస్తారు? మన కూలి సంఘం వాళ్లు వోట్లన్నీ యల్లమందయ్యకే అన్నాయి పెద్ద తలకాయ లన్నీ కూడపలుక్కుని పల్లెలో

పోతే నారాయణ పోయినచోటల్లా "కులంవోడ్ని వదులుకుంటామా నారాయణా? నీకా భయమెందుకు" ఏస్తాం పొమ్మన్నార సాటికులపోళ్లు

ఇహ పరంధామయ్యగారి మనుషులు పోయినచోట ప్రొహిబిషన్ లేకుండా పోయిందంటే నమ్మండి రెండు చేతుల్తోనూ డబ్బు విరజిమ్మబడింది ప్రామిసరీ నోట్లు చెల్లుబడులూ, ట్రాన్స్ఫరులూ పొలాలు కౌలు కివ్వడంలాంటి తతంగాలు అంతులేకుండా జరిగిపోతున్నాయి

ఆ ఎలక్షన్ రోజు రానే వచ్చింది ఆ క్రితం రాత్రి ఎలక్షన్ జరిపించటానికి వచ్చిన ఆఫీసరుగారి బసకూ పరంధామయ్య గారింటికీ ట్రంక్‌రోడ్డు ట్రాఫిక్ అయిపోయింది

ఆ రాత్రి పరంధామయ్య గారింట్లో మెడకాయలు తెగిపోయినకోళ్ళూ, తల తెగిపోయిన మేకపోతులూ, తపతపా కిందపడి మెలికలు తిరిగి పోయినై! సీసాల బిరడాలు టప్‌టప్‌న లేచిపోయినై ఇనప్పెట్టెల్లోంచి రూపాయలు సుల్లుమన్నయ్!!

ఉదయం పదిగంట లయేసరికి గ్రామ చావిట్లోకి వోటర్లంతా చేరుకొన్నారు ఎవరిమనుషుల్ని వారు వెంటేసుకొని మురాలు ముఠాలుగా వచ్చి చేదారు

పల్లెనుంచి వచ్చిన వోటర్ల నందర్నీ ఒకచోట పోగుచేసి యల్లమందయ్యకు కుడిభుజంలాంటి వాడైన ఏసోబు ఎట్లా వోటు వేయాల్సిందీనూ చెప్పాడు

"యల్లమందయ్య పేరు చెప్పగానే మనోళ్ళంతా చేతులెత్తాలి తెలిసిందా?"

తెలిసినా, తెలియకపోయినా అంతా తలలు మాత్రం వూపారు అప్పుడే కొందరు చేతులు పైకెత్తికూడా చూసుకొన్నారు!

"ఒరేయ్! ఎర్రోడా నీకెగా! తెల్సిందీ?" ఏసోబు అడిగాడు

"అదంతా నాకెందుకస! ఎర్రపెట్టికే నా వోటంటూనస!" కండవా తలకుచుట్టుకొంటూ అన్నాడు యర్రోడు

"వోరి నీ! మవ్వు వొట్టి శావెనా మలివిరా? ఎర్రపెట్టె యాడుందిరా యిక్కడ?" ఎంకటేసుగాడు విదిలించేశాడు

"ఒరేయ్! ఎర్రోడా! ఎర్రపెట్టె గాదురా ఎల్లమందయ్య అన్నపుడు చెయ్యెత్తాలిరా?" ఏసోబు మళ్ళీచెప్పాడు

"అదంతా నాకుతెల్దస! మీరంతా ఎప్పుడెత్తితే నేనప్పుడే నాదికూడా ఎత్తు

తానహే!" అన్నాడు ఎర్రోడు అమాయకంగా

"ఒరేయ్ ఎర్రోడా? అదంతా గాదు గానీ నేనోరి కెత్తితే ఆరికెత్తరా! నువ్వు నా పక్కనే కూకో" అని చిన్నోడు ఎర్రోణ్ణి పక్కన కూర్చో పెట్టుకొన్నాడు

"నీం ఏసోబయ్యోవ్! కర్రో కి కూడా కూత్తె సెప్పండి! ఆడసలు ఎర్రిసన్నోసి!" అన్నాడు నల్లోడు ఎంగిలి చుట్ట చెవుల్లోంచి తీసుకుంటూ

"ఒరేయ్ కర్రోడాయ్! యల్లమందయ్య పేరు లెగవగానే చెయ్యెత్తాలి! తెలిసిందా?" చెప్పాడు ఏసోబు

"ఓస్ అదేంది! వందచార్లెత్తమన్నా ఎత్తుతా" అనేశాడు కర్రోడు.

"ఓరి శాదినాయలా వొక్కసారె ఎత్తాలిరా? యింకోసారి పేరొచ్చినా ఎత్త కూడదు!" వివరించి చెప్పాడు ఏసోబు

"ఏందియ్యా! నువ్వు చెప్పేదీ? మన యల్లమందయ్యకు ఎత్తమనే కదయ్యా" కర్రోడు అంతా తెలిసినట్టుగా అన్నాడు.

"ఆఁ అద్దదే! అంతే!"

"ఓసి యింతేగా?" అంటూ కర్రోడు రెండు చేతులూ ఎత్తి తెలివిగా చూశాడు

"ఓరి పిచ్చినాయాలా !" అంటూ నెత్తిమీద వొక్కటివేశాడు పక్కనున్న పోలాయి.

"అమ్మ కొడ్తావేంటిరా ?అట్టయితే నేనోరికీ ఎత్తను!"

"అదికాదస్! రెండుచేతులూ ఎత్తుతావెందుకు?" నిగ్గదీసి అడిగాడు పోలాయి, ఇంతలో పిల్లసుబ్బుడికి ఏదో ధర్మసందేహం వచ్చినట్టుంది ఏసోబు నడిగాడు.

"ఒక చెయ్యెత్తితే ఒక వోటుగందా? మరా లెక్కన రెండు చేతులెత్తితే రెండు వోట్లు రావద్దంటయ్యా మరి!"

"ఒరే పిల్లసుబ్బాయ్! రెండుచేతులున్నా మనిషికి ఒకే వోటురా!"

"అయితే వొంటిచెయ్యి మడిసికో?" కుంటిరాముడు జనంలోంచి కేకేశాడు జనం అంతా గొల్లుమన్నారు

ఏసోబుకు చెప్పలేక తలతిరిగిపోతోంది జనాన్నంతా కలయజూశాడు అందులో వొకడు చెయ్యి పైకెత్తుకు కూర్చొని వున్నాడు

"అదేందిరా ఎంకటిగా ? యిప్పుడే చెయ్యెత్తుకూర్చున్నావేం?"

"ఆ గొడవంతా నీకు తెల్దు ఏసోబయ్యా! నా యాల్ది ఎట్టబోయి ఎట్టొత్తదోనని ముందే ఎత్తేసే!"

"వోరెర్రి నాయాల యిప్పుడు గాదురా యల్లమందయ్య పేరు లెగిసినప్పు డెత్తాలిరా !" ఎంకటిగాడి డొక్కలో ఒక్కపోటుపొడిచి చెప్పాడు పక్కనున్న ఎర్రిగాడు

రభసంతా చూసేసరికి ఎల్లమందయ్యకు మతిపోయినట్టయి ఏసోబు వంక చూశాడు ఏసోబు గొంతు సవరించుకొని "కూలీల సంఘం ప్రతినిధికేమా వోట్లు!" గట్టిగా వొక్క కేక వేశాడు జనం అంతా ముక్తకంఠంతో 'యల్లమందయ్యకే మా వోటు' అంది

పల్లెనుంచి వచ్చిన వాళ్ళంతా గ్రామ చావిట్లోకి పోయి వో మూల చదిగి కూర్చున్నారు




అంతలోకి ఎలక్షన్ ఆఫీసరుగారు తన సిబ్బందితో వచ్చి కూర్చున్నారు. ఆవెనకే పరంధామయ్యగారు ఆయన మనుషులు వచ్చారు.

నారాయణ, కోటయ్య రామయ్య, పుల్లయ్య మొదలుగా గల తన మనుషుల్ని హెచ్చరించాడు.

ఆఫీసరుగారు సావిట్లో కూర్చున్న జనాన్ని ఓసారి కలియజూచి అభ్యర్థుల పేర్లు చదివాడు.

జనంలో కలకలం బయలుదేరింది.

"ఒరేయ్! ఎర్రాదోయ్! సల్లోడోయ్! యెకటిగా! మన యల్లమందయ్య పేరు లేచినప్పుడు..."

"ఓయ్ కోటయ్యా! పుల్లయ్యా మనోల్లంతా ఎక్కడ?" కేకలు సావిటికప్పు దూసుకుపోతున్నాయి.

"సైలెన్సు! ఎవరూ మాట్లాడకూడదు!' ఆఫీసరు జనాన్ని అదమాయించాడు.

ఆఫీసరు పరంధామయ్య పేరు ముందు చదివాడు. జనంలోంచి వొహడు లేచి "అయ్యా ముందు యల్లమందయ్య పేరు రావాల్సింది!" అన్నాడు.

పరంధామయ్య లేచి ఆఫీసరు కూర్చొన్న బల్లదగ్గరికొచ్చి ఆయన చెవిలో గుసగుసలాడాడు.

ఆఫీసరుగారు లేచి "పరంధామయ్యగారికి వోటు యిచ్చేవారంతా చేతులెత్తండి!" అన్నారు.

వో మూలనుంచి ముందు పదిచేతులు లేచినై. ఆఫీసరు మళ్ళీ గట్టిగాఅన్నాడు "పరంధామయ్యగారి కిచ్చే వోటర్లంతా చేతులెత్తాలి!"

పరంధామయ్య మీసందువ్వుకుంటూ జనంమధ్యలోవున్న రామయ్య, పుల్లయ్యకేసి చూశాడు. రామయ్య పుల్లయ్యలూ మొహమొహాలు చూసుకొన్నారు ముందు

పుల్లయ్య చెయ్యెత్తాడు పటకరగా, వెంటనే రామయ్యా చెయ్యి సాగదీసి ఎత్తేశాడు. తర్వాత ముప్ఫై నలభై చేతులు జనం మధ్యనుంచి లేచినై.

నారాయణ దేవయ్య ముహంవేసి కోటయ్యకేసి చూశాడు.

పరంధామయ్యగారు సకిలించి పెదగా కూర్చొన్న పల్లెజనంవైపు కోరచూపులు చూశారు. అలా పర్వతంలా నుంచొన్న పరంధామయ్యగారి కోరచూపులు ఎవరికి మట్టుకువాళ్ళకు తమమీదే పడ్డట్టయింది!

ముందు ఎంకటిగాడు చెయ్యి ఎత్తేశాడు. తర్వాత పిల్లసుబ్బడూ, ఎర్రోడూ, నల్లోడూ, కర్రోడూ చేతులెత్తారు దాంతో యాభై, అరవై చేతులు గలిబిలిలా లేచినై.

ఆఫీసరుగారు మొత్తం లెక్కేసి "రెండువందల యిరవై మూడు" అని రాసుకొన్నాడు.

ఏసోబు పళ్ళు కొరుక్కుంటూ పల్లె జనంవైపు చూశాడు. ఎల్లమందయ్య అయోమయంగా పరంధామయ్యకేసీ, ఆఫీసరుకేసి, జనాన్ని పూరికే చూస్తూ వుండిపోయాడు. నూటయిరవై వోట్లు మెజారిటీతో పరంధామయ్యగారు ఉల్లిపాలెం పంచాయితీ బోర్డు ప్రెసిడెంటుగా ఎన్నుకోబడ్డారు

గ్రామ చావిట్లోంచి జనంకదిలి వెళ్ళిపోతున్నారు. నారాయణ దోవలో తన కులంవాళ్ళను చూసి అడిగాడు.

"అట్లా చేశారేం పుల్లయ్య మామా!"

"ఏం చేస్తానోయ్ నారాయణా! పరంధామయ్య పల్లపుచేను ఈ యేడు నేనేనా చేస్తుంది.

"రామయ్య బావోయ్! పెద్దోడివి నువ్వుకూడా పుట్టిముంచావ్ కదే!"

"అట్లా వచ్చిందిరా అబ్బాయ్! ఈ మధ్య ఆయనతో ఓ లిటిగేషన్‌లో ఇరుక్కోవాల్సివచ్చింది! ఆ ఫోర్జరీ దస్తావేజు సంగతి నీకు తెలియందేముంది?" అన్నాడు రామయ్య నారాయణ్ని సముదాయించుతూన్నట్టుగా.

పరంధామయ్యకు చేను తాకట్టుపెట్టిన రామస్వామీ, కాడిగట్టు వెంకయ్య, ఇంకా నారాయణ కులంవాళ్ళల్లోనూ, అప్పుల్లోనూ, పరంధామయ్యగారితో ఏదోరకంగా లావాదేవీలున్నవాళ్ళు; అంతో యింతో సంజీనవాళ్ళు నారాయణకు ముఖం చూపించకుండానే యిల్లుదూరారు.

ఊళ్ళనుంచి పల్లెకుపోతూన్న జనాన్ని పెద్ద కాలవకట్టమీద నిలేసి అడిగాడు ఏసోబు

"అదేందిరా దొంగనాయాల్లారాఅట్టా చేశారు?"

"ఏం చేయమంటావ్ ఏసోబయ్యా ఆసామి అపజాన ఎలుగొడ్డల్లే నుంచొని సూత్తంటే!" అన్నాడు ఎంకటిగాడు

"అవును ఎల్లమందయ్య! తెల్లారిలేత్తే బతికేది ఆరి కాళ్ళముంగరకదంట హె!" అన్నాడు నల్లోడు.

"అవునెస్! నా పెద్దోడు ఆరింట్లో జీతాని కుండాడు! ఎట్టా శయ్యత్తకుండ వుంటానశ!" అన్నాడు చింతడు. పరసగా ఒక్కొక్కళ్ళే బయటపడ్డారు—

"ఆరి పొగతోటకి నీళ్ళుపోసేది నేన గదశా?"




"మా ఆడది ఆరి బీళ్లోనే గందా గడ్డి గీకుద్ది?"

"నా ఎండిమురుగులు తాకట్టుపెట్టింది ఆరిదగ్గరే"

"ఆరి ఇటికాంకి కాపలా నేనేగదం టయ్యా!"

"ఆ సామి సున్నం గానుగ తోలేది ఎప్పుడన్!"

"నేను గుడిశేసుకోంటే ఆరి సోట్లో గాదంటయ్యా ఏసోబయ్యా!"

"తప్పుడు నా యాల్లారా! నోరు మూసుకోండశ!" గదమాయించాడు ఏసోబు కోపంగా.

"అదిగాదయ్యా ఏసోబయ్యా! మనోళ్ళంతా ఎత్తేసరికి నేసుకూడా నాది ఎత్తేశానశ!" అన్నాడు ఎఱ్ఱిగాడు.

"ఓసెల్‌ యవ్వారం గలిబిలి అయిపోయిందిలే!" అన్నాడు ఎఱ్ఱోడు.

"ఎల్లమందయ్యోయ్! యీళ్లమాటలు సమ్మబాకయ్యోయ్! దొంగనాయాళ్ళు! ఎంకటిగాడు ఆరింటికాడ యాటమాంసం తినొచ్చాడయ్యా నిన్న" చెప్పాడు చినోడు.

"వట్టిదేలేవయ్యా! పిల్లసుబ్బడు పాతికరూపాయలు తీసుకొన్నాడు ఆ సామిగారిదగ్గిర" అన్నాడు ఎంకటిగాడు సుబ్బడిని దొంగచూపులు చూస్తూ.

"వోరు తీసుకోలేదయ్యా? అందరూ తీసుకొన్నోళ్ళే! ఆకాడికొత్తే నారాయణయ్యగారి మనుసులు కూడా తీసుకొన్నోళ్ళే!"

"ఏడిశార్లే ఎదవముండానాయాళ్లు!" కసిరాడు ఏసోబు. జనంకా సేపుమాట్లాడకుండా నడిచారు.

"ఎల్లమందయ్యా! నువ్వన్నా సెప్పలేదేమయ్యా? సెయ్యొత్తేప్పుడు పరందా

మయ్యగారొచ్చి సూత్తారని?" అన్నాడు ఎంకటిగాడు మెల్లిగా.

"అవునస! ఆర్ని సూత్రంతో దే బెదు ర్లోసిపోయింది!" ఎర్రోడన్నాడు.

"అది సరేగాని ఏసోబయ్యా! పెద్ద ఎలచ్చను మాదిరిగా అయితేనే యీలుగా వుండేదియ్యా!"

"ఆఁ! అట్టయితే ఆరికో వోటుపోయే దంట్యా! అన్నీ మన ఎల్లమందయ్యకి పడేయి కావూ!"

"ఇప్పుడీ శేతులెత్తటంవోరు పెట్టినట్టు ఏసొబూ?"

అంతలో కాలపకట్ట తుమ్మచెట్లచాటు నుండి కేకలు వినపడి ఏసోబువాళ్ళంతా వెనక్కుచూశారు. కాలవదాటి నలుగురు వ్యక్తులు చావుబతుకుల్తో వచ్చి ఏసోబు వాళ్ళను కలుసుకొన్నారు. ఆ నలుగురికీ తలమీదా బుజాలమీదా గాయాలున్నాయ్! మొహంమీదా గుడ్డలమీదా రక్తం మర కలు యింకా ఆరిపోలేదు. ఆ నలుగురూ ఎల్లమందయ్యకు వోటు చేసినవాళ్ళు. వూళ్ళోకిపోయి వెనక దిక్కునవస్తూందగా పరంధామయ్య మనుషులు అడ్డం తగి లారు.

"ఏం జరిగిందిరా?" ఎల్లమందయ్య ఆదుర్దాగా అడిగాడు.

"ఆడి మనసులు! తుమ్మబీట్లోకొచ్చే సరికి కర్రలు తీసుకొని మీదబడ్డారు. వోడికిరా మీరు చేతులెత్తిందని!"

"నాయాళ్ళని పీణంతీసేద్దుం! చేతిలో ఏం లేకపోయిందిగాని!" అన్నాడు వొకడు మొహం మీదకు కారుతున్న రక్తం తుడుచుకుంటూ.

పుల్లడి తలమీద తగిలిన గాయం నుంచి కారుతూన్న రక్తానికి చెయ్యి నొక్కిపెట్టి ఎల్లమంద పారిపోతూన్న పరంధామయ్య మనుష్యులకేసి చూశాడు-

—పల్లెజనం తెలియని బాధాసిగ్గుతో కుంగిపోయారు. వాళ్ళ హృదయాల్లో తీరని అశాంతీ ప్రతీకారేచ్ఛా రేకెత్తింది. అంతా మౌనంగా గాయపడ్డ మనుష్యుల్ని దీసుకొని పల్లెవైపు నడిచిపోయారు.

ఎలక్షన్ అయిపోయాక ఆఫీసర్ను విడిదిలో దిగబెట్టిరావటానికి బయలు దేరాడు పరంధామయ్య.

దారిలో ఆఫీసరు అన్నాడు.

"చూడండీ పరంధామయ్యగారూ! పోయిన పార్లమెంట్ ఎన్నికల్లో మీకు మీవూళ్ళో ముప్ఫై వోట్లుకూడా రాలేదే? మరి యిప్పుడు మూడు వందలదాకా వచ్చినయ్యే?"

"ఏదో తమదయ! ఇంకో సంగతి అప్పుడంతా 'మీకే ఇస్తాం మీకేఇస్తాం' అని తిన్న విశ్వాసంకూడా లేకుండా మోసం చేశారు"

"ఓహో అలాగా?"

"అవునండయ్యా! ఎవు డెవరికేసిందీ తెలియకుండా వచ్చింది. అదేమంటే.




దారోయ్! మీకే ఏశాం అనేవాళ్ళు. అప్పుడంతా సీక్రెట్ బాలెట్ అయిపోయే! మనుషుల్లో నిజాయితీ పోయింది!"

"అయితే చేతులెత్తటం పద్ధతే మంచిదంటారా పరంధామయ్యగారూ?"

"మెల్లిగా అంటారేమండీ? మంచిదా మరీ మంచిదా? చూశారూ! మనుషుల్లో నిజాయితీ పెరుగుతుంది. మనదగ్గరయింతో అంతో గతికిన గాడిదెవడూ మళ్ళీ తప్పుడుపని చెయ్యటానికి వీలుండదు చూడండీ!"

"మహా బాగా చెప్పాడు."

"ఎసంబ్లీ ఎలక్షన్లల్లోకూడా చేతులెత్తేపద్ధతే బాగుంటుదేమో?"

"ఒక ఎసంబ్లీఏమిటి పరంధామయ్యగారూ? నన్నడిగితే పార్లమెంటూ, ప్రసిడెంటు ఎన్నికకుకూడా చేతులెత్తే పద్ధతే మంచిదంటాను ప్రజాస్వామ్యంలో యిన్నిరకాల ఎలక్షన్లేమిటి?"

"అవునండయ్యా అన్నిటికీ చేతులెత్తే పద్ధతి పెట్టేస్తే పోతుంది."

"ఆమాటకొస్తే హైకోర్టుకూడా చేతులెత్తటం ప్రజాస్వామ్యానికి విరుద్ధంకాదని తీర్పు యిచ్చింది గాదుటండీ!"

"అవునండిసార్! ప్రజాస్వామ్యం అంటే ప్రజలు సౌఖ్యులుగా వుండాలని కదండీ తాత్పర్యం!"

"ఆహాహా. పరంధామయ్యగారూ! ముడికొస్తా విప్పేశారు. ప్రజాస్వామ్య తత్వం అంటే ప్రజలు సౌఖ్యులుగా నడవడం! ఓహోహో-మరి రేప్రొద్దున బండికే పోతా! రాత్రికకనిపిస్తావుగదూ?" *

# ఎ ట్రైన్ ఫ్రమ్ మసులా!




యర్రంశెట్టి శాయి హ్యూమరాలజీ-12

**నాకు హైదరాబాదు నుంచి బెజవాడకు ట్రాన్స్‌ఫర్ అయింది**

బెజవాడ ఆఫీసులో నా పాత మిత్రుడు భగవాన్ కనిపించాడు.

“ఇల్లెక్కడ తీసుకున్నావ్?” అడిగాడు భగవాను.

“ఎక్కడా తక్కువ అద్దెలో దొరకట్లేదు!” అన్నాను దిగులుగా.

“అన్నట్లు నీకు బందర్లో ఓ ఇల్లుంది కదూ?”

“అవును! ఉంటే ఏంలాభం!”

"అక్కడే వుండి రోజు బెజవాడకు ట్రెయిన్లో వచ్చి సాయంత్రం వెళ్ళిపోవడం బెస్ట్! చాలా మంది అదేపని చేస్తుంటారు—"

నాకు అ అయిడియా నచ్చింది. వెంటనే బందర్లో సెటిలయిపోయి రైల్వే స్టేషన్ కెళ్ళి సీజన్ టికెట్ తీసుకున్నాను

మొదటిరోజు పొద్దున్నే స్టేషన్ చేరుకుని రైలెక్కి కూర్చున్నాను. తొమ్మిదిన్నరకల్లా బెజవాడ వెళ్ళిపోవచ్చు! మళ్ళీ సాయంత్రం ఎనిమిదింటి కల్లా బందరు చేరుకోవచ్చు! రైల్వే ఇంత అభివృద్ధి చెందటం నాకెంతో ఆనందం కలిగించింది. నాచిన్నప్పుడు బందరు బెజవాడ రైలు విజయవాడ చేరటానికి ఆరుగంటలు పట్టేది. ఇప్పుడు కేవలం మూడే గంటలట! భగవాన్ చెప్పాడు.

రైలు కదిలేవేళయే సరికి కారేజ్‌లో సగం వరకూ జనం నిండిపోయారు

నిజంగా బస్ ప్రయాణం కంటె రైలు ప్రయాణం ఎంతో సరదాగా ఉంటుంది. అనేక ఊళ్ళ వాళ్ళు కలుసు కోవడం, మాట్లాడు కోవడం-

రైలు బందరు స్టేషన్ వదలగానే ప్రయాణీకులు అర్జంటుగా రాజకీయాలు మాట్లాడేసుకోసాగారు.

"ఎన్టీఆర్ మనకు చేసిందేమిటీ అని నేను కొశ్చెన్ చేస్తున్నాను! తెలుగు ప్రజల ఆత్మగౌరవం తగలడిపోతోందహో అని కన్నీరు కార్చాడు. మరి మద్రాస్‌నుంచి ఓ తమిళుడిని తీసుకొచ్చి తనకు కార్యదర్శిగా నియమించుకున్నప్పుడు తెలుగు వాళ్ళ ఆ ఆత్మగౌరవం ఏమయింది! అన్నేను కొశ్చెన్ చేస్తున్నాను. అంతె కాదు! కిలో రెండురూపాయల బియ్యం ఏవి? ఎవరికిస్తున్నారు అనికూడా నేను నేను కొశ్చెన్ చేస్తున్నాను."

ఆ గురుడి ఉపన్యాసం ఎంతవరకూ కొనసాగేదోగాని ఈలోగా ఆ కారేజిలోకి ఓ వర్తకశిఖామణి వచ్చి వేలం పాట ప్రారంభించేసరికి అతను చప్పబడిపోయాడు.

"ఈ అద్భుతమైన సూపర్‌డీలక్స్ స్టీలుగిన్నె, ఈ వంతపు దువ్వెనా కలసి కేవలం అర్ధరూపాయ్ మాత్రమేనండీ! ఒకటోసారి. రెండోసారి-

డెభ్భయ్ఆరు రూపాయల స్టీలు గిన్నె, పధ్నాలుగు రూపాయల దువ్వెన కలసి కేవలం అర్ధరూపాయ మాత్రమేనండీ!"

అంతకు ముందే కారేజిలోకి వచ్చి కూర్చున్న అతని అసిస్టెంటే వాటిని, వాటిని బాగా పరీక్షించి 'అయిదురూపాయలు' అన్నాడు.

సరే ఈతతంగం తెలిసిందేకాబట్టినేను నవల తెరిచి చదువుకోసాగాను.

కాసేపటి తర్వాత చూస్తేరైలు ఏదో స్టేషన్లో ఆగిపోయి ఉంది. క్రాసింగట! అరగంట తర్వాత బయల్దేరింది మళ్ళీ. రెండో స్టేషన్లో మళ్ళీ ఆగిపోయి కదల్లేదు

"ఎందుకిక్కడ ఆగిపోయింది మన బండి" పక్కనున్నతన్ని అడిగాను.

"స్టేషన్‌లో పాలవాళ్ళ షాలు తక్కువ పోయాయట! గొడవ జరుగుతోంది" అన్నాడు తాపీగా.

అదేమిటో చూద్దామని రైలుదిగి

గొడవ జరుగుతున్న చోట కెళ్ళాను

టికెట్ కలెక్టర్ కాబోలు పాలకాన్ల దగ్గర నిలబడ్డాడు

"అదికాదండీ! మొన్న తక్కువ పోశారు! పోన్లెమ్మని ఊరుకున్నాను—నిన్న తక్కువ పోశారు సరేనన్జెప్పి; పట్టించుకోలేదు! చూడండి! ఇవాళకూడా ఈ గిన్నెలో సగానికి పోశారు ఇది కావాలని చేయటం కాదంటారా?"

కోపంగా అన్నాడతను మరో పాలు అమ్మే పెద్దమనిషితో

పెద్దమనిషి పక్కకు తిరిగి తక్కువపాలు పోసిన ఇద్దరినీ తగులుకున్నాడు

"ఎందుకొచ్చిన గొడవ రావుడూ! లెక్కప్రకారం స్టేషనోళ్ళకీ పొసేయకూడదూ?"

రావుడు తిరగబడ్డాడు

"గొడ్లు రెండు ఎండిపోయినయ్! అందుకని తగ్గించాను! అయినా గాని ఊరికే బేవార్స్‌గా వచ్చేపాలు- కొంచెం తగ్గితేనేం!" పౌరుషంగా అన్నాడు రావుడు

"ఏటి? బేవార్స్‌గా పోస్తున్నావా?" కోపంగా అడిగాడు టి సి

"అవును! మేసంవత్సరం బేవార్సుగా పోయకపోతే మీరైలోళ్లు ఏ రోజయినా డబ్బెట్టి కొన్నారా?"

"ఎవడికోసం పోస్తావయ్యా! మీరు పదిరూపాయిలు పాలు ఊరికే పోసి, వందరూపాయలు లాభం మాదగ్గర్నుంచీ దొబ్బుతున్నారు!"

"మీలాటోళ్లంటే లాబాలు గాడిద గుద్దొస్తయ్—"

గుంపుని నెట్టుకుంటూ స్టేషన్‌మాస్టర్ లోపలకు జొరబడ్డాడు

"ఏమిటయ్యా గొడవ! బండికి ఆలస్యం అయిపోతోంది" అన్నాడాయన మందలింపుగా

"ఆ టికెట్ కలెక్టర్ని పాలడబ్బాలు వదలమనండి! వెళ్ళిపోతాం! మాదేం ఆలస్యం ఉంది" అన్నాడు రావుడు,

"వదిలేయవయ్యా ఎందుకొచ్చిన గొడవ!" విసుక్కున్నాడు స్టేషన్‌మాస్టర్

"మీకోటా పాలు మీకొచ్చేశాయ్ గనుక మీరు వదలమంటారండీ! అనకేం జేస్తారు" కోపంగా అన్నాడు టి సి

ఆ మాటతో స్టేషన్‌మాస్టర్ కింకేమనాలో తెలీలేదు

"సరే- ఈ రోజుకిపోనీ! రేపుసంగతి చూద్దాం!" అన్నాడు రాజీ ధోరణిలో

"ఎలా పోనిస్తానండీ! మా చంటిదానికి పాలు పట్టించాలా? మా పెద్దడికి పాలివ్వాలా, పెరుగుతో డెయ్యాలా మా ఆవిడా, నేనూ తాగాలా? ఎట్టసరిపోతయ్ ఇంత మందికీ పాలు? మీకు తెలుసో తెలీదో రెండ్రోజుల్నుంచీ మాయితో డబ్బెట్టి పావు లీటరుపాలు కొంటున్నాను నా సర్వీస్‌లో ఎప్పుడూ కొన్లేదు- ఈ స్టేషన్లో మొట్ట మొదటిసారి కొన్నానంటే! కాష్ పెట్టి పాలు కొన్నాను! ఛూ! వెధవస్టేషన్!" కన్నీళ్ళ పర్యంతం అయిందా టిసికి, డబ్బుసంగతి తల్చుకోగానే

ఈలోగా గార్డూ, డ్రయివరూ కూడా వచ్చి చేరారక్కడ

"ఏమయింది!" అడిగాడు గార్డు

స్టేషను మాస్టరు కథంతా చెప్పాడు గార్డుకి.

"అయితే వీళ్ళ గొడవ మూలాన బండి ఎంతసేపు ఆపుతాం? స్టార్ట్ చేసేస్తాను" అన్నాడు గార్డు.

"ఎట్టా స్టార్ట్ చేస్తావయ్యా! నీ జగ్గలో పాలు పోయించుకోలేదా?"

అడిగాడు పాలతను కోపంగా.

"పోయించుకుంటే గంటసేపు ఆపమంటే ఎలా? ఏదో ఓ అరగంటంటే ఫర్లేదుగానీ! అవతల మా ఆఫీసర్లు కూడా మమ్మల్ని అడుగుతారు కదా?" అన్నాడు డ్రైవరు గార్డుని సపోర్ట్ చేస్తూ.

దాంతో పాలతను మరి రెచ్చిపోయాడు.

"ఏటి? మీ ఆఫీసరా? ఏం? మొన్న మీ ఆఫీసరుగారమ్మాయ్ పెళ్ళికి మా పాల వాళ్ళంచరం కలసి ఫ్రీగా పాలుపోయలేదూ? బెజవాడలో ఏ ఆఫీసరింట్లో ఏం జరిగినా మాకేగా నష్టం? మరింకా ఏ మొఖం పెట్టుకుని బెదిరిస్తారయ్యా మమ్మల్ని?"

ఆ జవాబుతో అందరూ నిశ్శబ్దం అయిపోయారు.

నేను టైము చూసుకున్నాను. అరగంటయి పోయింది అప్పటికి. ఇక లాభం లేదని నేనే కలుగ జేసుకున్నాను.

"ఇదిగో చూడండి టి. సి. గారూ! అయిందేదో అయింది! ఇంక రైలుని వదిలేస్తే మేము బెజవాడలో ఆఫీసు కెళ్ళాలి!" అన్నాను బ్రతిమాలుతూ.

"ముందు మీటికెట్ చూపించండి!" అన్నాడు టి. సి. కోపంగా.

నేను సీజన్ టికెట్ తీసి చూపించాను.

"ఫోటోవంక-నా వంక రెండునిముషాలు పరీక్షగా చూసి టికెట్ నాకిచ్చేశాడు మళ్ళీ,

మొత్తం రైల్లోని జనం అంతా వచ్చి చేరారప్పటికి!

"ఇదిగో చూడు బాబూ! నువ్వన్నా ఆయనకొంచెం పాలుపోయనయ్యా! మాకు టైమవుతోంది!" అన్నాడు మరో ప్రయాణీకుడు పాలతనిని బ్రతిమాల్తూ.

"ఎందుకు పోయాలండీ! అతని గేదెలు రెండు ఎండిపోయాయట!"

"ఎలా పోస్తాడు?" ఇంకో పాలతను రావుడిని సమర్థిస్తూ మాట్లాడాడు,

ప్రయాణీకులు అందరూ కలిసి పాలతనినీ, టి.సి.నీ బ్రతిమాలి రైలు స్టార్ట్ చేయడానికి వప్పించారు,

అందరం 'హమ్మయ్య' అనుకుని రైలెక్కాం. బిచ్చగాడు, ఓ చిన్నపిల్లా పాట అందుకున్నారు, ప్రయాణీకులు "శ్రోతలు కోరిన రికార్డులు" పాడిస్తున్నారు, వరుసగా! రైలు మళ్ళీ బయలుదేరింది,

పాత కోటు, ఖజాన పెట్టెతగిలించుకున్న వ్యక్తి మా కారేజ్‌లోకొచ్చాడు,

"పట్నంలో పళ్ళడాక్టర్లకి ఇరవైలు, ముప్ఫయ్‌లు ఇవ్వకండి సార్! డబ్బు వృధాచేయకండి! కేవలం రెండు రూపాయల అరవై పైసలకే మీ పళ్ళు పీకించుకోండి! నాలుగు పళ్లు పీకించుకున్నవారికి కన్సెషన్! గొప్ప దీపావళి బంపర్ ఆఫర్! నాలుగు పళ్ళూ — కేవలం ఏడు

రూపాయలే! ఆరు పళ్లు పీకించుకున్న వారికి దువ్వెన ఉచితం! గొప్ప దీపావళీ బంపర్ ఆఫర్ సార్! ఎవరికండీ పన్ను పీకాలి! మాష్టారూ! ఈ అద్భుతమయిన అవకాశం జారవిడుచుకోకండి! నేను మళ్ళీ నెలరోజులవరకూ ఈ లైన్‌మీదకు రానండీ! వైజాగ్ లైన్ కెళ్ళిపోతు న్నాను-" కారేజంతా నాలుగు రౌండ్లు కొట్టాక మా పక్క కంపార్ట్‌మెంట్‌లోనే ఓ కేస్ బుక్‌చేశాడతను

"ఏ పన్నండీ బాబూ?"

"ఇదిగో ఇది..."

"ఆహాహా! పూర్తిగా చెడిపోయిందండీ! పాపం మీరు ఎంత బాధపడు తున్నారో—"

"అవును - తెగబాధగా ఉందనుకో!"

"మరి దాని పక్కదాని మాటేమిటి? అదీ పాడయిపోయింది కదా?"

"అబ్బే! దాని బాధేం లేదు!"

"లేపోయినా ఇప్పుడే లాగివేయడం మంచిదండీ! నేను మళ్ళీ నెలరోజులదాకా రానిటు! రేటుకూడా కొంచెంతగ్గిస్తాను-"

"వద్దయ్యా! దాన్నేం చేయకు."

"సరే! ఆ మాష్టారూ! మీ నలుగురూ ఇతనిని గట్టిగా కదలకుండా పట్టుకోండి సార్! ఈ రోగిని కదలకుండా పట్టుకుని మాధవసేవ చేయండి బాబూ! ఎంతసేపో అక్కర్లేదు. అయిదు నిమిషాలు చాలు. ఆపరేషన్ చేసేస్తాను-"

ఆ చుట్టుపక్కలున్నాళ్ళందరూ కలిసి ఆ వ్యక్తిని గట్టిగా పట్టుకున్నారు. మరో క్షణంలో ఆపరేషన్ ప్రారంభమయింది.

"అబ్బా- బాబోయ్- నాయనోయ్- నన్నువదలండ్రోయ్- వ్వావ్వావ్వావ్వావ్వా-" ప్రాణం పోతున్నట్లు కేకలు వేస్తున్నాడా రోగి.

"ఇంకో నలుగురు పుణ్యాత్ములు వచ్చి ఇంకా గట్టిగా పట్టుకోండిసార్! మానవసేవే, మాధవసేవసార్! కేవలం రెండూ అరవై కే పన్ను ఎందుకు పీకు తున్నాను? మాధవసేవసార్! మాష్టారూ"

నాపక్కనున్న మరో నలుగురయిదు గురు కూడా వెళ్ళి ఆ వ్యక్తిమీద పడి శరీరం, నోరు, తలా కదలకుండా నొక్కి పట్టారు.

మళ్ళీఆపరేషన్ రెండోమధ్యం ప్రారంభమయింది.

మళ్ళీకేకలు

"వావోయ్— వావోయ్- వ్వా-వ్వా- వ్వా- అవ్వా- అవ్వా-"

"అబ్బ! రక్తం చిమ్ముతోంది-" అందో గొంతు.

"ఏవయ్యో— ఏమిటిది, రక్తం పిచి కారీ కొట్టినట్లు కొడుతోంది—"

"పన్నులో చేవ ఎక్కువుందన్న మాటండీ! అంటే వీళ్ళవంశమంతా బాగా చేవవున్న మనుషులన్న మాటండీ! మా గట్టి దంతంవరుస- నాసర్వీసులో ఇంత జబర్దస్తీ దంతం పీకటం ఇది మూడో సారిమాత్రమే-" రైలు ఆగింది స్టేషన్లో!

"నాపన్ను పీకద్దుబాబోయ్- నన్నిలా వదిలేయ్ దేవుడోయ్—"

అంటూ అరుపులు.

"మధ్యలో ఎలా వదుల్తానయ్యా— నన్ను పన్నుపీకటం చేతకాని వాడను కొంటారందరు—"

నేనీస్టేషన్లోనే దిగాలయ్యా బాబూ! నన్నొదిలేయండి!" తనను పట్టుకుని మీదెక్కి కూర్చున్న వారిని బ్రతిమాల సాగాడతను

"ఏం ఫరవాలేదయ్యా! గొడవ చేయకు! ఇంకొక్క జెర్క్ ఇచ్చానంటే రకీమని ఊడిపోతుంది!"

"రైలు బయల్దేరుతుందయ్యాబాబూ! దిగిపోతాను-"

పళ్లుపీకే వ్యక్తి ఓక్షణం ఆలోచించాడు

"సరే- నేనిప్పుడే వెళ్ళి ఓపావుగంట బండి ఆపమని గార్డుగారితో చెప్పి వస్తానుండు"

నేనూ నాపక్కనున్న వాళ్లు అదిరి పడ్డాం

"ఏమిటి గార్డుగారితో బండి ఆపమని చెప్తావా?"

"అవునండీ! ఏం ఫరవాలేదు! నేను చెప్తే ఆపేస్తారులేండి! ఒకసారి ఆయన కుక్కకి నేనే పన్ను పీకేశాను! ఒక్క పైసాకూడా తీసుకోలేదు!"

"కుక్కకా?" ఒకాయన ఆశ్చర్యంగా అడిగాడు

"అవును! సాధారణంగా కుక్కపళ్లు పీకను లేం! అయితే ఏదయినా పెద్ద రికమండేషనుంటే పీకేస్తాను! జంతు సేవే మాధవ సేవ"

అతను గార్డుదగ్గరకెళ్ళి వెంటనే తిరిగొచ్చాడు

రైలు ఆగిపోయింది

మళ్ళీ ఆపరేషన్ మూడో ఘట్టం (అంతిమ ఘట్టం) ప్రారంభమయింది

"ఈసారి ఇంకా కొంచెం గట్టిగా పట్టుకోండిసార్! మనం కొడిమెడ ఎలా పట్టుకుంటాం? అలా నొక్కిపట్టుకోండి! ఒకేఒక్క జర్క్‌తో ఊడిపడాల్సిందే!"

అందరూ అతనిని బలవంతంగా పట్టుకొని నొక్కిపట్టారు

ఒక్కసారిగా అతను పిచ్చికేక వేశాడు

అతనిని పట్టుకున్న వాళ్ళిద్దరు ఎగిరి పడ్డారు దూరంగా

"హమ్మయ్యా! వచ్చేసింది!" అన్నాడు పళ్ళుపీకే అతను తన చేతిలో కటింగ్ ప్లేర్ మధ్యనున్న పంటిని అందరికీ ఉచిత ప్రదర్శన ఇస్తూ

కింద పడున్నవ్యక్తి మూలుగుతూ లేచి తనపంచీ తీసుకుని కిందకుదిగాడు పళ్ళుపీకే వ్యక్తికూడా ప్లాట్‌ఫారం మీద దిగి గార్డుకి చేయిఊపగానే బండి మళ్ళీ స్టార్టయింది

అయితే మళ్ళీ పక్క స్టేషన్లో ఆగిపోయింది

'మళ్ళీ ఏమిటి?' అన్నాడు ఒకతను బయటకు చూస్తూ

"మళ్ళీ ఇంకోరైలు క్రాసింగ్!" అరగంట తర్వాత మళ్ళీ బయల్దేరింది గానీ కొద్దిదూరం వెళ్లిఆగిపోయింది

మరుక్షణంలో అన్నిపెట్టెల్లోకీ బల బలామంటూ ఆర్ పి ఎఫ్ వాళ్ళు టి టి ఇ లు ఎక్కేశారు

"టికెట్, టికెట్-" అంటూనాలుగు వేపులున్న తలుపుల దగ్గరా అడ్డం నిలబడి అందరి టికెట్లూ చెకింగ్ చేయ సాగారు వాళ్లు




"ఇక్కడ చెకింగేమిటి?" అడిగాను పక్కనున్నతనిని,

"స్క్వాడోళ్ళు వచ్చారండీ! స్పెషల్ చెక్ అన్నమాట!"

మా కారేజ్‌లోనే సగంమందికిపైగా టికెట్‌లు లేకపోవడం చూసేసరికి నాకు ఆశ్చర్యం కలిగింది,

అందరినీ పక్కస్టేషన్లో దింపారు

పావుగంట గడిచినా రైలు మళ్ళీకదలకపోయేసరికి నేనూ మిగతా వాళ్ళూ కిందకు దిగాము

స్టేషన్‌మాస్టర్ ఆఫీసుబయట టికెట్ లేనివాళ్ళగుంపు నిలబడి ఉన్నారు వాళ్ళకెదురుగా టి టి ఇ-లు, ఆర్ పి యస్ వాళ్ళు నిలబడ్డారు

"అవునండీ! మీది స్పెషల్ చెకింగ్ స్క్వాడే! వప్పుకుంటాం! కానీ ముందు పాసింజర్లకు చెప్పకుండా ఇలా హఠాత్తుగా చెకింగ్‌కొస్తే ఎలా? ఇప్పుడు చూడండి! ఇంతమందిమి టిక్కెట్లు కొనలేదు!" అన్నాడు గుంపులోనుంచి ఒక ప్రయాణీకుడు

"మమ్మల్నేం చేయమంటారండీ? మా ఇన్‌స్పెక్టర్‌గారు 'ఎటాక్' చేయమన్నారు!" అన్నాడు ఒక టి టి ఇ

"ఆయనెప్పుడూ చెప్తారులేవయ్యా! చెప్తేచేసేయటమేనా? మాకు రెండు స్టేషన్లముందే ఇలా మధ్యలో స్పెషల్ చెకింగ్ జరుగుతుందని- తెలియజేస్తే మేము టికెట్లు కొనుక్కుంటాం అని ఎన్నిసార్లు చెప్పాలి మీకు?" ఇంకో మీసాలాయన దబాయించాడు

"మా ఇన్‌స్పెక్టర్‌తో మా ట్లాడండయ్యా! మాకేం తెలుసు! అక్కడికీ మేము చెప్తూనే ఉన్నాం! ముందు చెప్పకుండా ఇలా సడెన్ చెకింగ్‌చేస్తే పాసిం

జెర్స్ వప్పుకోరు స్టార్" అని! ఆయన వింటేనా? డి సి యస్ ప్రోగ్రాం ఆఖరి క్షణంలో ఇచ్చారు గనుక మనమ్మేం చేయలేము" అన్నారు—"అన్నాడు ఒక టి టి ఇ

"ఏదీ మీ ఇనిస్పెక్టర్‌ని పిలు! మేము మాట్లాడతాం!" అన్నాడు మీసాలరావ్

స్టేషన్‌మాస్టర్ ఆఫీసులోనుంచి ఇన్‌స్పెక్టర్ వచ్చి నిలబడ్డాడు

"ఇదిగో చూడండిబాబూ! ఈ ఒక్కసారికీ పొరబాటు జరిగిపోయింది మీకు మా స్పెషల్‌చెక్‌గురించి ముందే తెలియజేసేంతటైము కూడా లేకపోయింది!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ వినయంగా

"అదేం కుదరదండీ! మీ చెకింగ్ కాన్సిల్ చేసేసుకోండి! కావాలంటే రేపు చెక్‌చేసుకోండి!వప్పుకుంటాం"అన్నాడు ఇంకో లావుపాటి వ్యక్తి

"చెకింగ్ ఎలా కాన్సిలవుతుంది? కుదరదు కదా" అన్నాడు ఇన్‌స్పెక్టర్

"ఏం? ఎందుక్కుదరదు? పెద్దపెద్ద విజిలెన్స్ చెక్‌లే కాన్సిల్ చేయించాం! మీ చెకింగో పెద్ద లెఖ్ఖేమిటి?"

"అవును కాన్సిల్‌చేసి మీరు వెళ్ళిపోవాల్సిందే!" అన్నాడు ఇంకో కుర్రాడు

ఇన్‌స్పెక్టరూ, టి టి ఇ-లు మొఖ మొఖాలు చూచుకున్నారు

"మేము ముందేచెప్తున్నాం కద్సార్! తెల్లారిలేస్తే మొఖమొఖాలు చూచుకోవాలి చెప్పకుండా చెకింగ్ చేయడం బావుండదని!" గొణిగాడు ఒక టి టి ఇ

"సరే! పదండి! రేపు చేద్దాం చెకింగ్ ఇక్కడ!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ప్రయాణీకులంతా ఆనందంగా మళ్ళీ రైలెక్కేశారు

ఇక టి టి ఇ అందరి దగ్గరకొచ్చి గట్టిగా చెప్పసాగాడు.

"ఇదిగో! రేపు ఇదే బండికి స్పెషల్ చెక్‌చేస్తున్నాం! ఇక్కడే ఈ స్టేషన్ దగ్గరే! కనుక మళ్ళీ చెప్పలేదనకండి!"

రైలు కదిలింది కాని మళ్ళీ ప్లాట్ ఫారం దాటగానే ఆగిపోయింది బరానీల వాడు బండి ఎక్కడం మిస్ అయాడట!

"అబ్బా! ఇప్పటికే రెండుగంటలు. లేటయి పోయింది బండి!" అన్నాన్నేను దిగులుగా నాపక్కనున్న వాళ్లు నావంక ఆశ్చర్యంగా చూశారు

"లేటేమిటి?"

"అదే-ఆలస్యం-" అన్నాను

'ఈ బందరు – బెజవాడ లైన్లో అలాంటి వేమీ ఎవ్వరూ అడగరు!" అన్నాడు ఒకతను

రైలు ఎయిర్రేరి స్టేషన్ రాకుండానే ఆగిపోయింది

"మళ్ళీ ఏమయింది?" అడిగాను చిరాగ్గా

అందరూ కిటికీలోనుంచి చూశారు

కొద్ది నిమషాల తర్వాత డ్రైవర్ నడుస్తూ గార్డు పెట్టివేపు వెళ్ళసాగాడు

"ఏమయింది గురూ?" ఎవరో పాసింజెర్ అడిగాడు డ్రైవర్ని!

"ఎవరో గొలుసులాగారు-" అంటూ వెళ్ళి పదినిమిషాల• తర్వాత తిరిగి వచ్చాడు

"ఎవరులాగారు?" అడిగాడు పాసిం

జెరు మళ్ళీ

"గార్డు వాక్యూమ్ వేశాడు" అంటూనే వెళ్ళిపోసాగాడతను

"ఎందుకు?"

డ్రైవర్ జవాబు చెప్పలేదు

మరో రెండు నిమిషాల్లో బండి స్టార్ట యింది,

మరో రెండు ఫర్లాంగులు వెళ్ళిందో లేదో మళ్ళీ ఆగిపోయింది

"మళ్ళీ ఏమయింది?" అడిగాను

వళ్ళు మండిపోతూంటే అందరూ కిందకు దిగి డ్రైవర్‌తో పాటు చివరివరకూ నడిచి వెళ్ళారు

పదినిమిషాల తర్వాత తిరిగి వచ్చారు

"ఏం జరిగింది?" అడిగాను

"గార్డుమందు కొట్టేశాడు అందుకని మాట్లాడితే వాక్యూమ్ వేస్తున్నాడు" అన్నాను ఒకతను

"అదేమిటి! ఎందుకలా బడి ఆపటం?"

"ఆగార్డంతే సార్! మందు కొడితే చాలు- వాక్యూమ్ వేసేస్తుంటాడు!"

"అసలు డ్యూటీలో మందు కొట్టట మేమిటి?' ఆశ్చర్యంగా అడిగాను

"ఛఛ! ఆయన మంచాడు సార్! ఎప్పుడూ కొట్టడు ఇవాళ వాళ్ళ పండగట! అందుకని కొట్టేస్తున్నాడు-"

రైలు మళ్ళీ బయల్దేరి పక్క సేషన్లో ఆగింది,

ఓ ముసలాడు కోతితో సహా మాకారేజ్ కెదురుగా ప్లాట్‌ఫారం మీద దుకాణం పెట్టాడు

"అయ్యగార్లకు దణ్ణం పెట్టు!" అన్నాడు

కోతి సేషన్ మాస్టర్‌కీ, బఠానీల వాడికీ నమస్కారం పెట్టింది

అది చూసి ప్రయాణీకులు చాలా మంది రైలుదిగి దానిచూట్టూ మూగారు,

డ్రైవరూ, ఫైర్‌మన్ కూడా వచ్చి పక్కనే ఉన్న కాంటీన్లో 'టీ' కప్పులు తీసుకుని కోతి దగ్గరకొచ్చి నిలబడ్డారు

"డ్రైవర్ సాబ్‌కి సలాంపెట్టు!"

కోతి డ్రైవర్‌కి సలాం చేసింది

"ఆఫీసర్లు లంచం ఎలా తీసుకుంటారు?"

కోతి వీపువెనుక చేయిచాచింది

అందరూ ఘొల్లుమన్నారు

"జయమాలిని డాన్స్ చేస్తుంటే ఎలా చూస్తావ్?"

కోతి నాలుకబయట పెట్టి గుడ్లు మిటకరించింది ఎగురుతూ యాక్షన్ చేసింది

"హఠాత్తుగా మీ ఆవిడవస్తే ఎలా చూస్తావ్?"

కోతి కళ్ళుమూసుకుని నీరసంగా కూలబడింది

గార్డు తూలుతూ వచ్చాడక్కడికి

"గార్డుసాబ్‌కి సలాంపెట్టు!"

కోతి గార్డుకి సలాం చేసింది

"భార్యకు తెలీకుండా సెకండ్ షోకెళ్ళి ఇల్లు ఎలా చేరుకుంటావ్?"

కోతి దొంగలాక్కనక్కి నడిచింది

నేను స్టేషన్ మాస్టర్ దగ్గరకెళ్ళాను

"ఆకోతి ఆట అయేవరకూ రైలు కదలదాండీ?"

"ఏమోమరి! వాడు కోతిని చాలా రోజుల్తరువాత తీసుకొచ్చాడు సెక్షన్

లోకి!" అన్నాడాయన కోతిని ఆనందంగా చూస్తూ

"నేననేది రైలు సంగతి!"

"నేననేది కోతి సంగతి! వండర్‌ఫుల్ ఫీట్స్ చేస్తోంది చూశారా?"

"రైలు ఇంకా బయల్దేరదా?" కోపంగా అరిచాను

"రైలా? ఎందుకు బయల్దేర లేదు?"

"బయల్దేరుతుందని తెలుసండీ! ఏ తారీఖు?"

"ఇప్పుడే!"

"మరి కదలదేం?"

"గార్డూ, డ్రైవరూ టీ తాగి ఇప్పుడేగా వెళ్తోంది?"

నేను గార్డు డ్రవర్ల కోసం చూశాను

అప్పుడే బయల్దేరి వెళ్తున్నారు వాళ్లు

మరో అయిదు నిమిషాల తర్వాత రైలు కదిలింది

అయితే ప్లాట్ ఫారం దాటకుండానే మళ్ళీ ఆగిపోయింది నేను నాపక్కనున్న వారూ దిగి కారణమేమిటా అని చూశాము

డ్రయివరు దిగివస్తూ కనిపించాడు

"ఏమయింది మళ్ళీ?" అడిగాను డ్రయివర్ని!

"ఇంకేముంది! గార్డుమళ్ళీ వాక్యూమ్ వేశాడు"

అందరం కలసి గార్డు దగ్గరకెళ్ళాం

"అరె! వద్దంటే వాక్యూమ్ వేస్తావెందుకయ్యా?" అడిగాడు డ్రయివర్ కోపంగా

గార్డ్ నవ్వాడు

"షారీ! అయామ్ షారీ!"

"ఇదిగో గార్డుగారూ! ఇప్పటికే టోటె డాలీశెం అయిపోయిందయా! ఇంక బండి ఆపకు! పాలుపాడయిపోతాయ్!" అన్నారు పాలవాళ్లు

"నేనాపను! ఆపనన్నా ఆపను! కావాలంటే చూడండి! ఆపను!" అందరం మళ్ళీ రైలు ఎక్కాం

రైలు కదిలింది

"ఇంకెన్ని స్టేషన్లున్నాయ్" దిగులుగా అడిగాను

"ఇంకెన్నండీ! రెండే"

"అమ్మయ్యా!" అనుకున్నాను కనీసం ఆఫీసుకి మధ్యాహ్నం నుంచయినా వెళ్ళవచ్చు

కారేజ్‌లో మరో గిలకజాల జుట్టు ఎక్కింది

"ఎవరికండీ మాష్టారు! చెవిలో గుబులు లాగేస్తాం! కేవలం రెండుచెవుల్లో గుబులుకి అర్ధరూపాయ్ మాత్రమే చార్జీ అండీ!

గుబుల్ గుబుల్ గుండెలు దడగా— ఎవరికండీ మాష్టారూ గుబులూ- నలుగురు కలసి గుబులు తీయించుకుంటే కీ చైన్ ఉచితం సార్!"

అప్పటికప్పుడే రెండు కేసులు దొరికినాయ్ అతనికి వాళ్ళిదరి చుట్టూ జనం మూగిపోయారు

తీరా రైలు రెండు ఫర్లాంగులు వెళ్ళిందో లేదో మళ్ళీ ఆగిపోయింది

"సందేహం లేదు! గార్డుపనే మళ్ళీ" అన్నారు మా బోగీలో ఉన్నవారు అందరం కలిసి గార్డు దగ్గరకెళ్ళాం

"ఏమిటయ్యా గార్డుగారూ ఇది! ఆప





తల పదకొండయి పోతోంది! మాపాలు పాడయిపోతాయ్ అనే చెప్తూవుంటే వినకుండా బండి ఆపేస్తావేమిటి?"

గార్డు నవ్వాడు!

"లేపోతే ఆ వెంకట్రావ్ నాకేం ఫవర్ లేదంటాడా? రాస్కెల్! నాపవరేంటో ఇవాళ చూపిస్తా! అడుగడుక్కీ బండి ఆపుతా!"

"బాబోయ్! వద్దయ్యా! స్వామీ! నీకుదణ్ణం పెడతాం! బండి ఆపకు!"

"అయితే మరి వెంట్రావ్ ఆ కూత ఎందుకూశాడు?"

"ఆ వెంకట్రావ్ పని మేము చెప్తాం కదా! తమరు బండి ఆపకండి!"

"షరే!"

రైలు మళ్ళీ కదిలి మరికాస్త దూరం నడిచి ఆగిపోయింది.

అందరం మళ్ళా గార్డు దగ్గరకెళ్ళాం.

"మళ్ళీ ఏమొచ్చిందయ్యా? మొగుడా"

"ఆ వెంకట్రావుగాడులేడూ? ఆడు నన్ను 'బూష్' అని తిట్టాడు!" రెండు చేతుల్తో తల పట్టుకుని దిగులుగా అన్నాడు గార్డు.

"ఆడిపని మేము చూస్తాం లేవయ్యా! బండి ఆపకు!"

'నిజంగా ఆడి భరతం పడతారా?"

"పడతాం సార్!"

"మరి వాడిని కూడా 'బూష్' అని తిడతారా?"

"తప్పకుండా తిడతాం"

"ఏమని తిడతారు?"

"బూష్ అనే తిడతాం!"

"బూష్ కాదు? బూష్ అనితిట్టాలి?"

"బూష్ అనే తిడతాం లేవయ్యా బండి పోనీ! జండా చూపించు!"

"బూష్ కాదని షెప్తుంటే వినరేం?"

"మరేమని తిట్టాలి?"

"బూష్!"

"సరే! అలాగే తిడతాంలేనాయనా!"

"ఏమని తిడతారు?"

"అదే బూష్ అని చెప్పావుగా?"

"బూష్కాదు!"

"మరి"

"బూష్. బూష్-"

"బూష్‌బూష్" అన్నాడు పాలవాడు.

"బూష్ కాదహ!"

నేను కల్పించు కున్నాను.

"బ్రూట్ అని తిట్టాలి! అంతేగదా?"

"ఆ! అది! బూష్!"

"స రే తిడతాం లెండి! జెండా చూపించండి!"

"నేనుచూపించను-"

"అదేమిటి? వెంకట్రావ్‌ని మేము తిడ తావన్నాంగా?"

"వాడిని నేనే తిట్టాలి!"

ఈలోగా మీసాలాయన దిగివచ్చాడు. "ఒరేయ్ ఇలా లాభం లేదుగానీ— బరా నీల వాడిని పిలవండి!"

అన్నాడు పరిస్థితి ని కళింపు చేసుకుని.

"బరానీల వాడెందుకు?" అడిగాను ఆశ్చర్యంగా.

"వాడొక్కడికే గార్డుఉద్యోగం, ఇం జన్ డ్రైవ్‌చేయటం తెలుసు! ఇంకెవ్వ రికీ తెలీదు!"

కొంతమంది వెళ్ళి బరానీల వాడిని పట్టుకొచ్చారు.

"ఒరేయ్ సోమిగా! ఈగార్డుని మేము పక్కపెట్లోకి తీసుకెళ్తాం గానీ, కొంచెం గార్డు ఉద్యోగం చేయ్, బండి లేటయి పోతోంది!" అన్నాడు మీసాలాయన.

అందరూకలసి గార్డుని బలవంతంగా పక్కపెట్లోకి లాక్కెళ్ళిపోయారు.

బరానీలవాడు గార్డుపెట్టెక్కి, బ్రేక్ వీల్ వెనక్కుతిప్పి, వాక్యూమ్ ఎడ్జస్ట్ చేసి 'కయ్'న విజిల్‌కొట్టి పచ్చజెండా చూపించాడు.

రైలు ఈసారి హాయిగా రామవర ప్పాడువరకూ శుభ్రంగా నడిచింది.

టైము చూచుకున్నాను.

ఒంటిగంట! బండి పావుగంటయినా కదలకపోయేసరికి మళ్ళీ అందరం బరా నీలవాడిదగ్గర కెళ్ళాం!

ఇంక మధ్యాహ్నం ఆఫీస్‌కెళ్ళాలంటే సరిగ్గా అరగంట టైముంది.

"ఏమయింది?" అడిగారు వాడిని.

"ఇంజన్లో ఎవరో సేఫ్టీ ఆఫీసరొచ్చా రంట సార్! నేను జెండా చూపించకూడ దని పట్టుపడుతున్నాడు. అందరూ మళ్ళీ ఇంజన్‌దగ్గరకెళ్ళి సేఫ్టీఆఫీసర్ని డ్రైవర్ని బ్రతిమాలారు.

మళ్ళీ కదిలింది రైలు.

స్టేషన్ వచ్చేసింది.

అయిదునిమిషాలు గడిచింది. ఆ తరు వాత పదినిముషాలు, పావుగంటకూడా అయిపోయింది. బండి కదలటం లేదు.

మళ్ళీ అందరం దిగి స్టేషన్‌దగ్గరకు వెళ్ళాం.

టికెట్ కలెక్టరూ, బుకింగ్ క్లర్కూ కలిసి ఓ గుంపుతో పోట్లాడుతున్నారు.

"వీల్లేదయ్యా! బస్తాకి రెండ్రూపా యలు ఇవ్వాల్సిందే! లేపోతే మిమ్మల్ని వదిలేది లేదు—"

"బియ్యం మేమిక్కడ ఉంపటం లేదుసార్! బెజవాడ తీసుకెళ్తున్నాం! ఇంక మీకెందుకు మావూలివ్వాలి?"

"ఇంతకాలం ఇక్కడదింపి- ఇవాళ్టి

నుంచీ బెజవాడ తీసుకెళ్తారా? వీల్లేదు! ఇక్కడ దింపాల్సిందే!" పట్టుపట్టారు బుకింగ్ క్లర్కు, టి. సిలు.

"మీరు బస్తాకి రెండురూపాయలు అడుగుతోంటే ఇక్కడెందకు దించాలండీ"

"బెజవాడలో ఎంత ఇస్తున్నారు?"

"రైల్వేపోలీస్‌కి రూపాయ్ మిగతా స్టాఫ్‌కి అర్ధరూపాయ్-"

"ఓహో! అర్ధరూపాయి లాభం కొడుతున్నారన్న మాట! అందుకని మానోట్లో మొత్తానికే మన్నుకొడతారా?"

"మీరు మరి రూపాయిన్నరకు వప్పుకోపోతే మేమేం? చేయంసార్?"

మీసాలాయన మళ్ళీ కల్పించుకున్నాడు.

"ఇదిగో బాబూ! బండి ఆపేసిలావాదేవీలేమిటయ్యా? మాకు అవతల లేటవుతోంది!"

"లేకపోతే చూడండిసార్! బియ్యం బస్తాలన్నీ బెజవాడ తీసుకెల్తామంటున్నారు! రోజూ వచ్చే మామూలు మాకి దొక్కటే గద్సార్! ఇది కూడా లేపోతే మేమేం తినాలి?"

మీసాలాయన బియ్యం వాళ్ళను కోప్పడ్డాడు.

"ఇదిగో రంగనాయకులూ! నువ్వు కూడా తొందరపడితే ఎట్టా? ఆ టి.సి గారు బుకింగ్ క్లర్కుగారు పరాయి వాళ్ళేం కాదుగదా! ఏదో రెండు డబ్బులు అటూఇటయినా ఇక్కడే దించుకోండి!" ఈలోగా స్టేషన్ పోర్టర్ ఓ ముసలాడిని రెండు మేకల్ని పట్టుకొచ్చాడు.

"సార్! ఈ మేకల్ని పాసింజెర్ కంపార్ట్‌మెంట్‌లో తీసుకెళ్తున్నాడు సార్!"

"ఏరా! వాటిని బుక్ చేసి గార్డుపెట్టెలో తీసుకెళ్ళాలి కదా?" అన్నాడు బుకింగ్ క్లర్కు.

"పొరబాటయి పోయిందండీ!"

నేను ఇంక లాభంలేదని అక్కడే దిగిపోయి రిక్షాలో ఆఫీస్ చేరుకున్నాను.

"ఏమిట్రా! ఇప్పుడొచ్చావ్?" భగవాన్ అడిగాడు.

"చాలా మంది బందరు వాళ్ళు రోజూ పొద్దున్న బెజవాడకు రైల్లో వచ్చి ఉద్యోగం చేసి మళ్ళీ సాయంత్రం బందరు వెళ్ళిపోతారని చెప్పావ్ గదా! ఆ రైలు ఇప్పటికి చేర్చిందిక్కడికి!" అన్నాను కోపంగా.

"కొత్తకో ఇలాగే ఉంటుందిలే! రాన్రాను అలవాటయి పోతుంది!" అన్నాడు భగవాన్.

"కాని బస్‌లో గంటన్నర ప్రయాణం రైల్లో ఇన్ని గంటలా?"

"తప్పదుమరి! పైసా ఖర్చులేకుండా బెజవాడ రావాలంటే ఇదొక్కటే మార్గం!

"పైసా ఖర్చులేకుండానా? అదేమిటి సీజన్ టికెట్..."

"అద్గదీ! అందుకే నీకింత చిరాకనిపించింది."

నవ్వుతూ అన్నాడు భగవాన్.

"ఎంత అద్దెయినా సరే! ఇక్కడే ఓ ఇల్లు వెతికిపెట్టు!" అన్నాను చిరాకుగా

*　　*　　*

# బొమ్మలు

"అరూ ! ఇటు రా ! తాతయ్యకి చూపవే జడ!" రాణి పాపని పిలిచింది.

"జడకుట్టేరా! ఓహోహో! భేష్! ఏదీ తిరుగమ్మా! ఫష్...ట్టుగాఉంది. ఇంకేం? నాకు నచ్చింది. నేనే చేసుకుంటాను." తాతయ్య నవ్వుతూ అన్నాడు.

"నేను...చేసుకోను...ఫో..." రెండు చేతుల్తో ముఖం కప్పుకొని వేళ్ళసందు ల్లోంచి అందర్నీ చూస్తూ అంది అరుణ! నాలుగేళ్ళ పాప.

"ఏ య్ ! తా త య్య కేమయిందే? ఎందుకు చేసుకోవు?" బామ్మ అడిగింది.

"తాతయ్య...ఏమీ బావులేడు. నా కొద్దు...నే చేసుకోను..." సోఫాలోంచి హాల్లోకి ఉరికింది అరుణ.

"ఎవరు కుట్టేరే రాణీ! జడ? బాగా... చి...న్న సవరం బలేతగిలించికుట్టారు?"

"ఇంటిపక్కే ఉన్నార త్తయ్యా—సేరలు. ఆయన భార్య కుట్టింది."

"బాగా అమరింది పిచ్చిముండకి ! సరిగా చూడనివ్వవే చలాకీ ! ఏయ్ అరూ! రావే" బామ్మ కేకేసింది.

"ఒక్కోసారలా సిగ్గు! డాన్సుకూడా చేస్తుంది."

"ఆహా! డాన్సుపాపన్న మాట! అరూ! ఇలా రావే! చేసుకోకుంటే సరే లే. నేను పాట పాడతా డాన్సుచేస్తువుగానీ రా! రారారా!" తాతయ్య పిలిచాడు.

"రావే అరూ! ఏమదీ? తాతయ్య పిల వటంలేదూ? డాన్సు చూపుదురా!" రాణీ గద్దించింది.

వాకిలిచాటున నిలచిన అరుణ దొంగ చూపులు చూస్తూ, నక్కుతూ బయటికి వచ్చింది. బామ్మ రపీమని చెయ్యట్టుకు దగ్గరికి లాక్కుని ఒళ్లో ముడిచి ముద్దుల వర్షం కురిపించింది.

"చాల్లెద్దూ నీముద్దులు! దాన్ని డాన్సు చేయనీ! చేయమ్మా! ఊఁ డాన్సు పాపా! డాన్సు పాపా టడికి పోతావా? వద్దుబాబు అయ్యవారు కన్నుకొడతారు.." తాతయ్య చేతులూపుతూ పాటపాడడం మొదలు పెట్టాడు.

అందరికీ నవ్వే. అరుణ ముఖం కప్పేసుకు నవ్వుకుంది.

"పాట పాడుతూ ఆడవే అరూ! మామయ్య వస్తాడు మళ్ళీ. కానివ్వు."

అరుణ చేతులూపుతూ— "బిందావన మందది...గోయిందు గందరివాడేలే... అందరాడేలే" అంటూ ఎంతసేపూ అదే చరణం, అదే చేతులూపటం, నడుం తిప్పటం.

వేలెడెంత పాప! చూడ ముచ్చటగా అందరికీ కన్నులపండువగా కొండపల్లి బొమ్మలా ముద్దులు గురిపిస్తోంది.

ఉన్నట్లుండి గోడచాటుకి వెళ్ళి రెండు చేతుల్తో ముఖందాచుకు నిల్చుంది.

"ఏమి? ఎందుకలా ఉరికావూ?" రాణి అడిగింది.

"అదిగో వాళ్ళ సూరిమామయ్య వచ్చేశాడు. సిగ్గు. ఒరేయ్ సూరీ! నీ కోడలు వచ్చింది. జడల్లుకుంది. చూ

డసలు చూడు. పో అరూ! మామయ్యకి చూపు." బామ్మ అంది.

"ఏదీ! రావే కోడలుపిల్లా! జడచూపి కాళ్ళకి మొక్కితే పది పైసలిస్తా! రా!" సూరి ఎగతాళిగా అన్నాడు.

"బాగుందయ్యోవ్! అంతగా అలంక రించుకు వచ్చి దాని షోకు నీకు చూపి... పైగా కాళ్ళకి మొక్కితే పది పైసలా! మరీ అంత తీసేయకయ్యా నీకోడల్ని!"

"పోనీ ఎంతివ్వాలో దాన్నే చెప్ప మనక్కా ఇచ్చేస్తాగా!"

"అరూ! విన్నావా! సూరిమామయ్య ఏమంటున్నాడో? వెళ్లు. జడచూపి, నమ స్కారం చేసి డాన్సుకూడాచేసి చూపించి మరీ ఫీజు వసూలు జేయవే."

"ఓసబ్బో! డాన్సుకూడా చేస్తుందే? ఎలా? జయమాలిన్లానా. సూర్యకాంతం లానా అక్కా?" నవ్వుతూ అన్నాడు.

"నీతో యిదేరా నానీ వచ్చిన చిక్కంతా! మాటల్తో మింగేసి దాన్నసలు నిల బడకుండా చేస్తావు! చూడసలు ఎలా చేస్తుందో. రామ్మా! అరూ! డాన్సు చెయ్!"

"చెయ్యవే! పేద్ద బడాయి! నే చూ డనులే...చెయ్!"

అరుణ నెమ్మదిగా వచ్చి 'శివరంజనీ' అంటూ చేతులూ నడుమూ ఊపుతూ, మధ్యమధ్య మామయ్యను చూసి సిగ్గులు పోతూ చేతుల్తో ముఖంతిప్పేస్తు ఆడింది.

సూరి పకపక నవ్వేశాడు.

"ఫర్లేదు. బాగానే చేస్తుందక్కా!"

"ఏమనుకున్నావురా మరి నీ కోడ లంటే...



"ట్విస్టు వస్తుందాక్కా అరూకి? ఏదీ ఆరూ! రాకెన్రోల్ చెయ్యవే!"

అరుణ అలానే తలూపి, కాళ్లుచాచి, నడుంమీద చేతులుంచి మెడనిక్కించి ఏదో చేసినా, అది ట్విస్టులా లేకున్నా చూచేందుకి అందరికీ ముచ్చట గొల్పే లానే ఉంది.

"వెళ్ళి మామయ్యకి నమస్కారం చేయమ్మా అరూ!"

అరుణ మామయ్య పాదాలకి తలా నించి నమస్కారం చేసింది.

ఎంతో వినయంగా.

"లే! లే! యూ డాన్సింగ్ డాల్!" అంటూ లేపనెత్తి చేతిలో పదిరూపాయల నోటుంచాడు.

"అమ్మా! అమ్మా! మామయ్యే డబ్బి

వ్వలేదు. ఉత్తి కాగితం యిచ్చాడే. నవ్వుకున్నారందరూ!"

"ఏమే! ఏంచేస్తున్నావక్కడ? ఇంకా తెమల్లేదూ పని? వాడాఫీసుకి పోవాలనుకున్నావా? ఇంట్లో ఉండిపోవాలనుకున్నావా?"

పార్వతమ్మ గద్దించి మాట్లాడింది.

అద్దంముందు కూచొని భాస్కర్ చొక్కాగుండీలు కుడుతూ మిర్రర్ టేబుల్ మీది ప్లాస్టిక్ బొమ్మని చూడగానే గతంలో అమ్మ చెప్పిన తన బాల్యం గుర్తుకు వచ్చి దాన్నిగురించే ఆలోచనలో పడిపోయిన అరుణ అత్తయ్య గద్దింపుకి ఉలికిపడి యీ లోకంలోకి వచ్చేసింది.

"వస్తున్నానత్తయ్యా!" అంటూ గబగబా హాల్లోకి వెళ్ళింది

"ఏం పనేమీలేదనుకున్నావా?" అరుణ చేతిలోంచి షర్టు లాక్కుంటూ విసురుగా తొడుక్కున్నాడు భాస్కర్

గబగబా తలదువ్వుకొని బూట్లుతొడుక్కు బయలుదేరాడు.

"ఏమండీ! కాఫీ!" కప్పుతీసుకు ఎదురు వచ్చింది అరుణ

"ఇంకేం తెచ్చుకున్నావుగా? నువ్వే తాగు" బయటికి నడిచాడు భాస్కర్.

"భోజనానికి వస్తారా?"

"రాను. నా భాగంకూడా నువ్వే తిను." చిడిముడిలాడుతూ చిటపటలాడుతూ భాస్కర్ విసవిసావెళ్ళిపోయాడు

"ఏం పాపం చేసుకున్నానో ఏమో! పాపం! బిడ్డడు ఒక్కరోజున్నా సంతోషంగా యింట్లో నిలబడ్డ పాపానపోలేదు. మువనష్టపు శనిగ్రహం అడుగుపెట్టింది.. అంతే...ప్చ్! వాడి జీవితంలో ఆనందమే కరువైపోయింది."

పార్వతమ్మ సణుక్కుంటూ అరుణ వేపు చూచింది కోపంగా.

"ఏం? యింకా అలానిలబడకపోతే తాగేయరాదూ, కాఫీ తాగమ్మా! కడుపునిండా కాఫీతాగి... తయారౌదువు నామీదికి దండయాత్రకు వంటచేసి పెడతానుగానీ... తిని ఏ మూటినీకో వెడుదువులే అయ్యో నారాతా వాడికొక ఆటా పాటా! పాదంమోపటమూ అన్నీ హుష్కాకీ..." ధుమధుమలాడుతూ బాత్ రూంలోకి వెళ్ళిపోయింది పార్వతమ్మ.

అరుణ పొంగివస్తున్న ఏడ్పుని మునిపంట నొక్కిపెడుతూ కాళ్ళీడ్చుకుంటూ తనగదిలోకి వెళ్ళింది. అద్దంముందు నిలబడి తనని తనే చూచుకుంది ఉహూఁ! ఎంత నొక్కినా ఆగని దుఃఖం కళ్ళల్లో నీళ్ళుగా కదిలివస్తునే ఉంది చల్లారిన కాఫీని బల్లమీద పెట్టేసి సోఫామీద జేరిగిలా కూలబడింది

అద్దంముందు ఫోటో ఫ్రేంలో తనవైపే నవ్వుతూ నిలబడ్డట్టున్న సూరి మామయ్య ఫోటోని చూడగానే ఏడ్పు ఆగకుండా దూకేసింది.

సూరి మామయ్య చిన్నప్పుడు తన నెత్తుకొని వేయించుకున్న ఫోటో అది

ఎంత ప్రేమో తనంటే సూరి మామయ్యకి.

అందంగా చిలిపిగా ఇంత విశాలమైన కళ్ళతో నుదురుతో నవ్వుతూ నిలబడ్డ మామయ్యని చూస్తుంటే అమ్మ మాటలే గుర్తొచ్చాయి అరుణకి

"లేవే అరూ! బారెడు ప్రొద్దెక్కినా నిద్రలేవవా! అంతా సూరి మామయ్య అలవాట్లే... లేలే!" ముసుగు తీసేస్తు అమ్మ లేపింది

"అబ్బ! ఉండవే! మాంచి కలవస్తుం దేనూ... అమ్మా!అమ్మా! కాస్సేపు పడుకోనీవే... నిద్దరొస్తుందే..."అరుణ బ్రతిమాలింది,

"లేవే సోమరీ! అంతా సూరిచాలే అన్నీ వాడి నాటకాలే... వాడే నీవుగా పుట్టినట్లుందే మాయింటికి లే... లే .. కాలేజీకి వెళ్ళవా?"

కాలేజీ పేరు చెప్పగానే టకీమని లేచికూచుంది చెప్పా చెయ్యకుండా అన్నీ ముగించుకుని రెడీ అయి వచ్చి అమ్మ ముందు నిలబడింది

"మమ్మీ టిఫిన్ "

"కొంచెం ఉండు అయిపోయింది ఉప్మా పెడతాను"

"ఇంకాం కొంచెం సేపా? నోనో! టైయిం చూడవే! సిటీ బస్ దొరకదు మళ్ళీ .. కాఫీ యివ్వు..."

"టిఫిన్... చేసీ..."

"అమ్మా... కాఫీ!"

"అబ్బబ్బబ్బ! నీతో ఏదొచ్చినా యింతే... ఇంత సేపూ మొద్దు నిద్ర పోయింది ఎక్కడ పోయిందో ." రాణి కాఫీ కలుపుతూ అంది

"అమ్మా! మామయ్యకూడా యింతే నా!" అరుణ అర్థంతరంగా అడిగింది

"ముమ్మూర్తులా యింతేనే తల్లీ! వాడి వారసత్వం ఈయింట్లో నువుపుచ్చు కున్నావు "

"మామయ్యే మరి చాలా మంచి మామయ్య కదమ్మా! ఆయన అలవాట్లు ఒక్కరికేనా రాకుంటె యెట్లాగా?అందుకే నేను పుచ్చేసుకున్నాను." నవ్వుతూ కిల కిలా, కాఫీ తాగేసి గబగబా వెళ్ళి పోయింది

రాణి అరుణ పోయిన వేపే చూస్తు ఆలోచనలో పడిపోయింది

"పిచ్చి అరూ! కష్టం సుఖం తెలీని కలలరాణిలా మెలిగిపోతోంది ఆదాయ మేమో, బ్రతుకేమో ఆలోచనే లేదు వాళ్ళ నాన్న ఆరోగ్యం చెడిపోయినప్పటి నుంచీ వ్యాపారం తగ్గిపోతోందన్న సం గతే, అప్పులు పెరిగిపోతూనాయన్న సంగతే దానికేం పట్టిం! ఎంత సేపూ తనచదువూ, సినిమాలూ, పాటలూ! జల్సాగా కాలం గడిపేస్తుంటుంది కొంచె మైనా భవిష్యత్తు గురించి ఆలోచనే లేదు

"ఎమిటే! ప్రొద్దుటే ఆలోచనల్లో పడ్డావు!" మూర్తి పలకరిస్తే యీలోకం లోకి వచ్చింది రాణి. తన ఆలోచన చెప్పింది

"ఈ కాలం పిల్లల తత్వమే అంతే! మనం చీకూచింత లేకుండా జీవించాలి అనే తత్వం అమ్మా నాన్నా తమకోసం ఎంతగా ఎందుకు శ్రమిస్తున్నారన్న ఆలోచన అసలు దగ్గరకి రానివ్వనితరం యిది పైగా పెపకం ప్రభావం అలా జల్సాగా బ్రతకాలనుకునేందుకి నీ పెంప కమూ ఒక కారణం కాదూ!"

"బాగుందండీ! నామీదే వేశారూ నెపం?"

"కోప్పడకు రాణీ! వచ్చిన ప్రతి

సినిమా చూడాలనే తత్వంనీది రోజూ వరసగా మ్యాట్నీలూ, షోలూ చూస్తునే ఉంటమన్నా ఉంటావు టయ్‌లెట్లకి ఎంతేనా తగలేస్తావు చీరెలూ నగలూ అంటూ చిందులేస్తుంటావు.. మరి తల్లిని పట్టి పిల్లకదా! ముందు మనం కట్టబాటులో ఉంటే కదా రాణీ! పాప మన కట్టుబాట్లు పాటించడానికి?"

రాణి మళ్ళీ ఆలోచనలో పడింది

"ఏయ్! రాణీ! కాఫీ అయిందా? మళ్ళీ ఆలోచనేమిటి?"

"నిజమేనండీ! మనదీ పొరబాటే ఉండండి! ఉప్మా అయింది తిని కాఫీ త్రాగుదురు"

"టయింతేదులే. కాఫీ యివ్వు అయినా యిప్పుడే అరూని గురించెందుకే ఆ లోచనలన్నీ?"

"మన జాగ్రత్తలో మనం ఉండాలంటే! ముందేమవుతుందో" కాఫీ అందిస్తు అంది రాణి

"ఎవరికెప్పుడేమి కావాలనుంటే అదే అవుతుంది"

కాఫీ తాగి మూర్తి వెళ్ళిపోయాడు

మూర్తి వ్యాపారం పూర్తిగా మునిగిపోయింది

అరుణ కాలేజీ మానేసింది మూర్తి పెళ్ళి సంబంధాలు వెకదసాగేడు

"ఏమండీ! ఒకమాట మన సూరినడుగుదామండీ!" రాణి అడిగింది

"రాణీ! ఇపుడు మనమేమీ లేని వాళ్ళం! వాళ్ళతో మనం తూగరేం, వాడొప్పుకోడేమో!"

"నేనడిగి చూస్తానండీ!సూరి నామాట కాదనడని నా నమ్మకం"

"నీ యిష్టం!"

రాణి సూరినడిగింది మామయ్య సంతోషంగా ఒప్పుకున్నాడు

"డాన్సింగ్ డాల్ నా సొంతం అవతానంటే వద్దంటానా అక్కయ్యా!" అన్నాడెంతో సౌజన్యంగా

కానీ అరుణే మామయ్యా వద్దనింది

ఎందుకు వద్దందో తనకే అర్థం కాలేదీరోజు వరకూ అందం లేదా? హృదయం లేదా? వినయంలేదా? ప్రవర్తన బాగోలేదనే వీలేలేని మంచిమనిషి!

"నేను బాలేని మనిషినీ అంటే మా రవిమాష్టారు చెడ్డాడనేఅర్థం అక్కయ్యా ఆ మాష్టారి అభిమానశిష్యుడనై, ఆయన ప్రేమకు పాత్రుడనై నేను పనికి మాలినవాడినైతే యింకేముంది? మొదట మా మాష్టారు పిచ్చాడై పోతారు తరువాత నేనదృశ్యమై పోతాను తెలుసా"

పదేపదే సూరిమామయ్య అమ్మతో అనేవాడు తాను వినేది

నిజమే! తనకూ తెలుసు రవి మాష్టారెంతో సౌజన్య మూర్తో! సూరి మామయ్యంటే ఆయిన కెంత ప్రాణమో!

మరెందుకు తాను సూరి మామయ్యని వద్దంది! పెద్దవయస్సనా! తనకీ మామయ్యకి పదకొండేళ్ళ వ్యత్యాసం అసలంత వయసు కనబడదు మామయ్యలో మరెందుకు?

ఎందుకో ఆనాడర్థం కాలేదు ఈరోజు అర్థమవుతోంది

భాస్కర్ మీద తనకు తెలీకుండానే యేర్పడిన ఆకర్షణ! అది ప్రేమా? ఆక




ర్షణా? ప్రేమ అని తాననుకొంది. భాస్కరూ అన్నాడు.

ఈనాటికీ భాస్కరంటే తనకదే భావనే... కాని... కాని...?

భాస్కరుకు?

పోయింది, పువ్వువాడిందని... మోజుతీరిందని...

అరుణ వెక్కి-వెక్కి యేడ్చింది!

తాను ప్రేమించిన నేరానికి, తనమీది మమత కొద్దీ, అమ్మ పోరుమీదా నాన్న సరే అననైతే అన్నాడు. కాని ఎక్కడ నుంచి తేగలడంత కట్నం?

చదువుకున్న రాక్షసులు నిరంతరం కట్నంబాపతు సొమ్ము తేలేదమని వేధిస్తుంటే చదువుకున్న తన జీవితం ఏం కావాలి?

ఎవర్నడగాలి? వ్యాపారమే ఎత్తేసి సామాన్య జీవనంలోకి దిగజారి నానా యాతనలు పడుతున్న నాన్ననా?

దుబారా సుఖాలకలవాటుపడి, కోర్కెలని చంపుకోలేకా, తీర్చుకొందికి మార్గమూ దొరక్క అసంతృప్త జీవనంలో అల్లాడి పోతూన్న అమ్మనా? ఎవర్ని?

అరుణ మానసిక వేదనతో కుమిలి పోయి అలానేనిద్రలోకి వొరిగిపోయింది

o o o

ఉలికిపడి లేచింది అరుణ.

గదంతా చీకటి: తనచుట్టూచీకటి.తన హృదయంలో, మనస్సులో అంతాచీకటి.

తలనిండా ఏదో బరువైన పదార్థం దూర్చినట్లు భావన. తలమీద ఏదో బరువు మోసినంత బాధ

కళ్ళల్లో గుచ్చినట్లు నలక. తెరిచే కళ్ళని సూదులతో గుచ్చినట్లు తీపు.

లేవాలని ఆలోచన. లేవనియ్యని అలసట

"ఏమైంది నాకు? ఎందుకిలా? ఎంత టయిమయిందప్పుడు?" తనకుతానే అడుగుతోంది. జవాబులేదు.

ప్రక్కనేవో గుసగుసలు!

గాజుల గలగలలు!

నవ్వుల కిలకిలలు!

తర్వాత క్షణం నిశ్శబ్దం.

నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ వేడి నిట్టూర్పుల సవ్వడులు.

అరుణ భరించలేక పోయింది. ఒక్క ఉదుటున మంచం మీది నుంచి దూకి పరుగెత్తి తలుపులవద్దకు వెళ్ళింది. తలుపులు రాలేదు. ఆశ్చర్యం! భయం.

దబదబా బాదేసింది. చేతులకి బొబ్బలు. గాజులు చిట్లాయి.

గుచ్చుకున్నాయి. నెత్తురు చెమ్మ వళ్ళినట్లుంది. చిరుమంట- చురచురమని బాదేధైర్యంలేదు. చేతులెత్తలేకపోతోంది

"ఏమండీ! ఏమండీ! అత్తయ్యా! అత్తయ్యా" ఒకటే అరుపు. అరచి అరచి...... అలానే సొమ్మసిల్లి పడిపోయింది. కొంచెంసేపు గడిచి...

నెమ్మదిగా మెలుకువ వచ్చింది.

ఏదో స్పర్శ. తన ఒళ్ళంతా ఆవరించిన స్పర్శ. ఆస్పర్శలో సుఖం. అదో చైతన్యం. అదో అనుభూతి. తనకు తెలియని, తానంగీకరించకుండా అంగీకరించే అర్ధాంగీకార పైత్యం:

ఏమది? ఏదో తియ్యని మత్తు. ఏదో స్పృహలోనే ఉన్నా మత్తులోకి జార్చే గమ్మత్తు.

కలా? నిజామా?

నిజమే! నిజంగానే తనకేదో అవబోతున్నది?

తానెక్కడుంది?

కళ్ళు తెరచి చూచింది.

అంతా చీకటి.

కంటి రెప్పలు మూతలు పడ్డాయి· అహఁ ఎవరివో వేడి అధరాలు మూసేశాయి.,

"అ...త్..." అత్తయ్యని కేకేయబోయింది.

'ష్...ఆతవక! నేను...' పెదవులు మూతలు పడ్డాయి.

'భాస్కరా! తన భాస్కరు.' స్వాప్నిక జగత్తులోంచి వాస్తవంలోకి వచ్చి నిజాన్ని గ్రహించి సంతోషంస్వీకరించి హాయిగా తృప్తిగా నిద్రలోకి పోయింది.

అద్దంలో తనను తాను చూచుకొంది అరుణ

○ ○ ○

'ఏమిటిది? ఒళ్ళంతా వాతలు. ముఖాన కాట్లు. విరిగిన ఎముకలు, రాత్రేం జరిగింది? అది కలా? ఉహుఁ కాదు...కల కాదు...నిజం! రాత్రి భాస్కరూ తనూ... ఔను...నిజమే... మరిదేమి? ఇది అబద్ధమా? కానేకాదు; ఏది నిజం? ఏది కల? భగవాన్!'

"ఏం చాల్లేదా? సాయంత్రం నేను వచ్చేవరకల్లా నిర్ణయం తీసుకు ఉండు. వెళ్ళిపోతావో? ఉండి...ఆఁ?"

భాస్కర్ విసురున వెళ్ళిపోయాడు.

అరుణ ఆలోచల్లోకి వెళ్ళింది. పిచ్చిగా నవ్వుకుంది.

'హుం! ఆ వచ్చేదానికి నేనీ యింటి పనిమనిషినని చెప్పుకోవాలట! ఆయన గదిలోకీ, అత్తగదిలోకీ వెళ్ళరాదట... లేకుంటే...'

అరుణ ఓ నిర్ణయం తీసుకుంది. సరాసరి పోలీస్ స్టేషన్‌కి వెళ్ళింది.

స్టేషన్‌ఆఫీసర్ అరుణవేపు ఎగాదిగా చూచాడు. ఆమె చెప్పిందంతా సావధానంగా విన్నాడు. ఏదో వ్రాసుకున్నాడు.

"సరే నువ్వెళ్ళు. సాయంత్రం వచ్చెయ్! ఏ సంగతీతేల్చిపడేస్తాను" అన్నాడు.

"మరచిపోకండి సార్! నా కాపరం నిలబెట్టితే నాకంతే చాలు."

"తప్పకుండా...నువ్వెళ్ళు సాయంత్రం రా."

అరుణ వెళ్ళిపోయింది.

సాయంకాలమూ వచ్చింది. అది చీకటిగా మారిపోయింది.

అరుణ మళ్ళీ యింటిముఖం చూడలేదు.

భాస్కరు సంతోషానికి అవధులు లేవు.

రాణి మూర్తి యిల్లువదలి బయటికి బయటికి అడుగు పెట్టే స్థితిలో లేరు.

శోకం గుసగుసలాడుకుంది.

తెలియనట్లే నటించింది సమాజం!

o o o

రాత్రి దాదాపు పన్నెండు గంటలు కావస్తోంది.

విశాలమైన రాజధానీ నగర వీధుల్లో అడపాదడపా వాహనాల శబ్దాలూ, ఎక్కడో కుక్కల మొరుగులు తప్ప మరేమీ వినరావటం లేదు. జినజినమని వానకురుస్తోంది.

'హోటల్ ఆశా' లో ఓగది. టక్ టక్‌మంటూ సవ్వడి.

అంతవరకూ కథలపోటీకని వ్రాసిన ఓకథని ఫెయిర్‌చేస్తూ కూచొ అప్పుడే నడుం వాల్చిన ఆవ్యక్తి ఎ రబ్బా అనుకుంటూ వచ్చి తలుపుతీశాడు మేలిముసుగు ముందుకు జార్చిన యువతి గబగబ లోపలికివచ్చి తలుపుల మూసింది. లైటు తీసింది.

''ఎవరు? ఎవరునువ్వు! ఏం కావాలి' కాస్త హెచ్చుస్థాయిలోనే ఆ రచయి అడిగాడు గద్దిస్తు.

''ష్... అరవక! ఈ హోటల్‌కి మామూలే... ఆడదాన్నెందుకు వస్తాను అర్ధరాత్రి?''

''ఎవరు నువ్వు? నీ గొంతెక్కడో విన్నట్లుందే...'' అతను లైటు వేశాడు ఆవిడ ముసుగుయింకా ముందరికి జార్చు కుంది.

''ఏం మగాడివి! ఛ! పనికిమాలి బేరం! లైటు తియ్! వెళతాలే... ఉ పిరికివి...'' వెళ్ళబోయిందావిడ.

''ఆగు! ఆ ముసుగు తియ్! నీముఖ చూడనీ...''

''ఏం? ముఖం చూచి ముచ్చటపడ తావా?'' అంటూ ముసుగు తీసింది తలె చూచింది.

ఆతనూ, ఆవిడా ఒకేమారు షాక్ తిన్నారు.

''అ... రు... ణా!'' అని అత నోటా.

''సూ ... రి మామయ్యా'' అ

ఆవిడనోటా ఒకేమారు వచ్చాయి,

"అరూ! అరూ! ఏమిటిది? ఏమిటి. అరూ! నువ్వు...భాస్కర్...?"సూరికి తల తిరిగిపోతోంది.

అరుణ కన్నీటితో అతని కాళ్లు తడిసి పోతున్నాయి.

భాస్కర్ అన్యాయం, పోలీసుల ఘాతుకం, మూకుమ్మడి అత్యాచారం, అక్కడినుంచి వ్యభిచార గృహప్రవేశం. దానితో అధః పాతాళానికి దిగజారిన తన జీవితం అంతా వివరించింది అరుణ!

సూరి మూర్తిభవించిన శోకమూర్తిలా నిలబడి పోయాడు.

అతని మస్తిష్కంలో అనంత భావ శకలాలు ఉల్కలై రాలాయి.

నిర్ణయం మెరిసింది తటిల్లతలా.

అరుణ తల నిమిరాడు... "లే! అరూ!" అంటూ లేవనెత్తాడు. అరుణ లేచి నిలబడింది తలవాల్చిందతని ముందు...

"నాతో వస్తావా అరూ! శాశ్వతంగా నాతో ఉండిపోతావా?"

అరుణలో విద్యుత్ ప్రకంపనం కంపించిపోయిన భావోద్రేక ఉద్వేగాలు! ఆశ్చర్యంగా, భయంగా చూచింది అనుమానంగా.

"అ...త్తయ్య...?!?"

"నీవే అత్తయ్యవి..." సూరి నవ్వుతూ అన్నాడు.

"పెళ్ళిచేసుకోలేదూ...?" అరుణలో ఆశ్చర్యంతో పాటు సంతోషం.

"ఉహుఁ! చేసుకోరాదనే అనుకున్నాను. కానీ ఇప్పుడు... ఏం? మరి?" సిగ్గుతో తలవంచింది అరుణ.

'నాలో మళ్ళీ చిగురించిన కొత్తఆశలు నీరోస్తున్న సూరిమామయ్యా!' అరుణ చటుక్కున వంగి సూరి పాదాలకు నమస్కరించింది.

"లే...లే... [illegible]

అంటూ మరో బెడ్ [illegible]

తృప్తిగా క[illegible]

సూరి.

కలల[illegible]తూ[illegible]

అరుణ.

---

## * జి. సుబ్రహ్మణ్యం *

---

రాము సోము రెండుకుక్కపిల్లల్ని తెచ్చి పెంచుకోసాగారు. ఎవరికుక్కపిల్ల ఏదో తెలుసుకోడం కోసం రాము కుక్కపిల్ల మెడకి ఓ రిబ్బన్ కట్టారు. ఓ రోజు ఆ రిబ్బన్ కాస్తా ఎక్కడో పడిపోయింది.

'ఇప్పుడు ఎవరికుక్కపిల్ల ఏదో ఎలా తెలుసుకోవడం" విచారంగా అడిగాడురాము.

ఇద్దరూ కాస్సేపు ఆలోచించారు.

'ఆ! యికనుంచి- ఆ తెల్లరంగు కుక్కపిల్ల నాది- నల్లది నీది" అన్నాడు సోము.

# ప్రణయ వీచికలు

## మూలం : బార్బరా కార్ట్‌లాండ్
## స్వేచ్ఛానువాదం : వాసిరెడ్డి సీతాదేవి

"నీకు ఇండియాగురించి ఎన్నో తెలుసుకోవాలని ఉంది కదూ ?"

"అవును!" ఉత్సాహంగా అన్నది సీత.

సీత మాటలు పూర్తిఅయినా కాకుండానే అతను ఆమెను రెండుచేతులతో పట్టుకుని దగ్గరకు లాక్కున్నాడు. బిగికౌగిలిలో బంధించాడు.

"నేను నీకు ఇండియాగురించి ఎన్నో విషయాలు చెబుతాను" అన్నాడు తన ముఖాన్ని ఆమె ముఖంమీదకు తెస్తూ.

అతను తనను ముద్దుపెట్టుకునే ప్రయత్నంలో ఉన్నాడని సీతకు అర్థం అయింది. ఒక్కసారి విదిలించుకొని అతని బంధంనుంచి దూరంగా జరిగింది.

అతను వెంటనే ఆమెను మళ్ళీ తన బాహుబంధంలో ఇరికించాడు.

"నో! నో! వద్దు! వద్దు!" అంటూనే పెనుగులాడసాగింది సీత.

"ఏం? ఎందుకు వద్దు? నువ్వు నాకు కావాలి" అంటూ ఆమె గడ్డంపట్టుకొని ముఖాన్ని పైకి ఎత్తాడు.

### జరిగిన కథ

అగంతకు ప్రేమికుడు రాజ సమాధుల దగ్గర సీతకు కనిపించాడు - చెలిపతి. భారతీయ దృష్టి సీతకి చెప్పాడు. అదృశ్యమయ్యాడు. అతన్ని గురించి ఆమె ఆశ్చర్యానికి అంతంలేదు బ్లంట్ అభిప్రాయాలకి వ్యతిరేకంగా హార్వే వైస్రాయి ప్రతిపాదించబోయే బిల్లు భారతీయుల మీద చూపబోయే ప్రమాదం సీతకి పూర్తిగా అర్థం కాలేదు. ఈలోగా రెసిడెన్సీకి నిజాం వచ్చాడు. ఆ విందులో పాల్గొనదానికి సీతకి ఖరీదైన దుస్తులు, వజ్రాల హారం ఆగంతకుడి దగ్గరనుండి వచ్చాయి బ్లంట్ తను ప్రతిపాదించబోయే బిల్లును హార్వే పాస్ చేసేట్లు చూడవలసిందిగా సీతను కోరుతాడు

"వద్దు! వద్దు! నాకిష్టం లేదు. నీకు నన్ను బలవంత పెట్టే అధికారం లేదు. నన్ను వదులు" పెనుగులాడుతూనే అన్నది సీత.

"అధికారమా? అందమైన ఆడదాన్ని ముద్దుపెట్టుకొనే అధికారం పురుషుడికి ఉన్నది. దూరంగా కన్పించే నక్షత్రంలా నన్ను నువ్వు ఆకర్షించావు. నిన్ను చూసి నప్పట్నుంచీ ఈ క్షణంకోసమే ఎదురుచూశాను" అన్నాడు బ్లంట్.

సీత ఒక్కసారిగా అతన్ని దూరంగా తోసేసింది.

అతను పడబోయి నిలదొక్కుకున్నాడు.

"నీకు పెళ్ళయింది. నీభార్య పక్కగదిలో డ్యాన్సు చేస్తున్నది!"

"అయితే?"

"నాకు నువ్వు ఇలా ప్రవర్తించడం ఇష్టంలేదు. మళ్ళీ నా జోలికిరాకు!"

"సీతా! ఆహా! నీపేరు ఎంత తియ్యగా ఉంది! ఇంగ్లీషులో స్వీట్ అన్న పదంకంటే స్వీట్‌గా ఉంది సీత అనే పేరు. పేరుకుతగ్గ అందం నీది. నీ అందం ముందు నేను మోకరిల్లడానికి వెనుకాడను."

"ప్లీజ్! ఇంకేమీ చెప్పొద్దు!"

"చెబుతాను. నువ్వు నేను చెప్పేది వినితీరాలి. నా భార్యగురించి నువ్వు భయ పడవలసిన పనిలేదు. ఆవిడ నన్ను అర్థంచేసుకోగలదు. ఎవరైనా గొడవ చేస్తారనే భయం కూడా నీకు అక్కర్లేదు. నాకు వ్యతిరేకంగా ఎవరూ నోరు విప్పరు" అన్నాడు బ్లంట్.

రెండు అడుగులు ముందుకు వేశాడు.

సీత రెండు అడుగులు వెనక్కు వేసింది.

అతను చేతులు చూపాడు.

"వద్దు! వద్దు!" చేతులు అడ్డుపెడ్తూ వెనక్కు వెనక్కు అడుగులు వెయ్య సాగింది.

"నన్ను, నా ప్రేమను అర్థంచేసుకో!"

"హుఁ! ప్రేమ! ఇది ప్రేమకాదు—కామం నీ భార్యకు నువ్వు ఆడవాళ్లతో తిరగడానికి అభ్యంతరం లేకపోవచ్చును. కాని నాకు ఉంది, భార్య ఉన్నవాడు మరో స్త్రీని వరించడం నాకు సహించదు" అన్నది సీత.

*  *

---

"నేను కొన్నిరోజుల్నుంచీ నిద్రపోవడంలేదు"

"అరె! ఎందుకని? జబ్బా?"

"కాదు! రాత్రిళ్ళు నిద్రపోతున్నాను!"




బ్లంట్ నవ్వాడు అందంగా నవ్వాడు ఆడవాళ్లంతా ముందు ఇలాగే మాట్లాడతార్లే అన్నట్టుగా నవ్వాడు

"నీ సౌందర్యం ముందు నేను మోకరిల్లాను నువ్వు నా ప్రేమను తిరస్కరిస్తున్నావు అంటే నీలో బలహీనత ఏర్పడిందన్నమాట నాకు లొంగిపోకతప్పదు ఆడవాళ్ళంతా లొంగిపోయేముందు తమకిష్టమైన మగవాళ్ళను ముందు ఇలాగే తిరస్కరిస్తారు ఈ విషయంలో నాకు చాలా అనుభవం ఉంది ఎంతోమంది ఆడవాళ్ళు ముందు ఇలాగే బెట్టుచేసి, ఆ తర్వాత సంపూర్ణంగా తమ సర్వస్వాన్నీ నాకు నైవేద్యం పెట్టారు!"

సీత గిర్రున వెనక్కు తిరిగింది

సీత భుజంమీద బలంగా చెయ్యివేసి, గుచ్చిపట్టుకొన్నాడు

"బాగా విను! నేను ఈ మాత్రానికే నిరాశచెంది ప్రేమించిన ఆడదాన్ని వదిలేవాడ్ని కాదు నిన్ను పూర్తిగా లొంగదీసుకుంటాను" అన్నాడు కసిగా

సీత నీళ్ళల్లో తడిసిన పావురంలా వణికిపోయింది బేలచూపులు చూసింది

అతను నవ్వాడు మేకపిల్లను చూసి తోడేలు నవ్వినట్టుగా అన్పించింది సీతకు

సీత అతనిచేతిని తనగోళ్ళతో గిచ్చింది అతను ఒక్కసారిగా తన చేతిని ఆమె భుజంమీదినుంచి తీశాడు,

సీత పరుగుతీసింది

వెనకనుంచి బ్లన్ట్ నవ్వు విన్పించింది. అది ఒక ప్రేమికుడి నవ్వులా లేదు. విలన్ నవ్వులా అన్పించింది. సీత తిరిగి చూడలేదు. పరుగు ఆపలేదు. బాత్‌రూం లోకి పరుగెత్తింది.

బ్లన్ట్ అలా పరుగుతీస్తున్న సీతను చూస్తూ నిల్చున్నాడు.

బ్లన్ట్ అందంగా ఉంటాడు. అతనిలో ఆడవాళ్ళను ఆకర్షించే అనేక గుణాలు ఉన్నాయి. అతని దృష్టి పడ్డ స్త్రీ అతని బారి నుంచి ఇంతవరకూ తప్పించుకోలేదు.

అతడు తన తొలి యవ్వనంలోనే ప్రసిద్ధ నాట్యరాణి 'స్కిటల్స్'ను వశం చేసుకొన్నాడు. ఆమెకు ఇంగ్లాండులో నాట్యరాణిగా పేరు ఉండేది.

కులీన స్త్రీలు, వివాహితలు ఎందరో అతని చుట్టూ తిరిగారు. అతనికి వివాహం అయింది. కాని అతని భార్య అతని మార్గానికి అడ్డురాలేదు. ఆమెకు అంత సాహసం లేదు. బ్లన్ట్ లాంటి వ్యక్తి తనకు భర్తగా లభించడమే తన అదృష్టంగా భావించసాగింది.

తన భర్త ఏ ఆడదానికీ లాయల్‌గా ఉండలేడని అతని భార్యకు బాగా తెలుసు అతని దృష్టిలో వ్యామోహం ప్రేమా— రెండూ ఒకటే. ఒక స్త్రీ ఒకే పురుషుడ్ని అంటి పెట్టుకొని జీవితాంతం ఉండడం అంత బోరింగ్ మరొకటి ఉండదని అతని ఉద్దేశ్యం. అతను భార్యతో ఆమాటే అంటూ ఉంటాడు. లేడీ ఆనీ భర్త మాటలకు తేలిగ్గా నవ్వేస్తూ ఉంటుంది.

అతనికి సీత తనకు పరిచయం అయిన స్త్రీలందరిలోకీ విభిన్నమైన వ్యక్తిత్వం గలదిగా అన్పించింది.

ఆమె కళ్లల్లో తేలిపోయేకలల్ని ఎన్నోసార్లు దూరం నుంచి చూసాడు. ఆమె ఈ ప్రపంచానికి సంబంధించిన ఆడపిల్లలా కన్పించేదికాదు. ఆమె అందం కంటే, ఆమెలోని ఈ ప్రత్యేకతే అతడ్ని అమితంగా ఆకర్షించింది.

ఏది ఏమైనా తనుకోరి దగ్గర అయితే ఆమె తనను తృణీకరిస్తుందని అతను అనుకోలేదు. అతనికి సీత తిరస్కారం ఒక ఛాలెంజిగా అన్పించింది,

* ____________________ *

టీచర్ : నీ రైటింగ్ చాలా మెరుగయింది పాపా! కేవలం పదిహేను తప్పులే ఉన్నాయ్ ఇక్కడ,

పాప : ఆ! నిజంగానాండీ! భలే

టీచర్ : అవును! ఇంక రెండోవాక్యం చూస్తానుండు!




సీతను లొంగతీసుకోవడానికి నిశ్చయించు కొన్నాడు.

ఆమె జీవితంలోకి ఇంకా ఏ మగవాడూ ప్రవేశించ లేదని అతని నమ్మకం.

"అవును! ఆమె నాది! ఆమెను నేను లొంగదీసుకోవాలి. ఆమె మరొకరి సొత్తు కాకూడదు." పదేపదే మనసులో కసిగా అనుకొన్నాడు బ్లంట్.

ఆలోచిస్తూ బాత్‌రూంలోకి వచ్చిన భర్త ముఖంలోకి పరిశీలనగా చూసింది లేడీ ఆర్.

ఆమె పెదవుల మీద విరిగిన పాలలాంటి చిరునవ్వు పొంగింది.

6

సీత బ్లంట్ ప్రవర్తనకు భయపడింది. ఒక రకంగా షాక్ తిన్నదని చెప్పాలి.

ఆమెకు ఇది మొదటి అనుభవం.

ఇంతవరకు ఏమగవాడూ ఆమెతో ఇలా ప్రవర్తించలేదు. పెళ్ళిఅయినవాడూ, సమాజంలో ఒక ఉన్నత స్థానంలో ఉన్నవాడు అలా ప్రవర్తించడం సీతకు ఆశ్చర్యంగా ఉంది. ఎంతటి మగవాడైనా స్త్రీ విషయంలో ఒకేలా ప్రవర్తిస్తాడా? తన కాళ్ళముందు మోకరిల్లుతానన్నాడు! తనముందు అతను తన హోదాను మర్చిపోయాడు! తన బాధ్యతల్ని విస్మరించాడు.

అతను తనను వెంటాడతాడా? అలా చేస్తే తను ఏం చెయ్యాలి? ఎవరికి చెప్పాలి!

బాబాయికి చెప్పేస్తే?

అమ్మో! ఇంకేమైనా ఉందా?

తప్పంతా తనదే నంటాడు.

అసలే బాబాయికి బ్లన్ట్ అంటే కోపం! వెంటనే తనను ఇంగ్లాండు పంపిం చేస్తాడు!

సీత ఆలోచిస్తున్నది. ఆమె కళ్ళ వెంట నీరు కారుతున్నది. బావురుమని ఏడవాలని ఉంది. ఎవరికైనా తన కష్టం చెప్పుకోవాలని ఉంది.

ఇంగ్లాండులో తను గడిపిన జీవితం తల్చుకొని కుళ్ళి కుళ్ళి ఏడ్చింది. మళ్ళీ ఆ నరకంలోకి వెళ్ళవలసి వస్తుందేమోననే ఆలోచన ఆమెను భయపెడుతున్నది.

ఇండియా వచ్చాకే తనకు ఓ మనిషిగా గుర్తింపు వచ్చింది.

ఈ విషయం బాబాయికి తెలియకూడదు. తనే ఎలాగయినా బ్లన్ట్ బారినుంచి తప్పించుకొని తిరగాలి.

సీతకు తన అజ్ఞాత స్నేహితుడు గుర్తొచ్చాడు.

అవును! అతనికి చెప్పాలి. అతనే తనను రక్షించగలడు!

అతనే తనను మృత్యుముఖంనుంచి రక్షించాడు. అతని బోధనవల్లనే తను జీవితంమీద ఆశల్ని పెంచుకొన్నది. అతని ద్వారానే తను జీవితాన్ని ప్రేమించడం నేర్చుకొన్నది.

అవును! అతనే తనను ఈ కష్టం నుంచి కాపాడాలి.

అతను రావాలి! అతను వస్తాడు! తప్పక వస్తాడు!

సీత మరొకరితో డ్యాన్స్‌చేస్తూ ఆ అజ్ఞాతస్నేహితుడ్ని తల్చుకోసాగింది.

అతను వస్తాడు! తను కష్టంలో ఉంది. తనకోరిక అతనికి ఈపాటికి తెలిసే ఉంటుంది. తన పిలుపు అతని బుర్రకు అందే ఉంటుంది.

అదేసమయంలో విల్‌ఫ్రెడ్‌బ్లన్ట్ గార్డెన్‌నుంచి లోపలకురావడం సీత గమనించింది.

ఇంకా అతని బలమైన చేతులు తనను గట్టిగా పట్టుకొన్నట్టే అన్పిస్తోంది సీతకు. అతన్ని చూడగానే ఆమెకు మళ్ళీ భయం పట్టుకొన్నది.

ఇంకానయం తోటలోకి వెళ్ళలేదు. అప్పుడు తను అరిచి గీపెట్టినా ఎవరికీ విన్పించేది కాదు.

అతనంటే తనకు అసహ్యం!

అతన్నిచూసి తనెందుకు భయపడాలి?

భయపడుతున్నట్టు అతనికి తెలిస్తే ఇంకా భయపెడ్తాడని-తను అతని లక్ష్యం పెట్టకూడదు ఒక అనామకుడిలా నిర్లక్ష్యంగా చూడాలి!

'నువ్వు సంతోషంగా లేవు నాతో డ్యాన్సు చెయ్యడం ఇష్టం లేదా? లేక ఇంకేమైనా కారణం ఉందా?" ఆమెతో డ్యాన్సుచేస్తున్నతను అడిగాడు సీత ముఖం లోకి చూస్తూ

'ఏం ...ఏం లేదే! సాయంత్రం బజార్లో అల్లర్లు ప్రారంభం అయ్యాయని విన్నాను దాన్నిగురించే ఆలోచిస్తున్నాను" అన్నది సీత.

"ఈపాటికి పరిస్థితులు అదుపులోకి వచ్చిఉంటాయనే భావిస్తున్నాను. సమయానికి తగినచర్య తీసుకోకపోతే ఇలాంటి అల్లర్లు ఒకపట్టాన ఆగవు. చాలా దారుణాలు జరుగుతాయి" అన్నాడు ఆమె పార్ట్నర్.

"అసలు ఏం జరిగింది?"

"నాకు బాగా తెలియదు కొందరు వ్యక్తులు ఇలాంటి అల్లర్లు లేపదీస్తారు. చివరకు అమాయకులు బలైపోతారు "

"నాకు బాగా అర్థం కాలేదు ఎలాంటి గొడవలు?"

"అదే హిందువులమధ్య ముస్లిములమధ్య మతపరమైన ద్వేషాన్ని రెచ్చగొడ్తారు మతమౌఢ్యం చాలా భయంకరంగా ఉంటుంది. రక్తపాతం జరుగుతుంది మానవత్వాన్ని పూర్తిగా విస్మరిస్తారు. పగ, ద్వేషం రెండే ఆ సమయంలో వారిలో ఉంటాయి "

"అంత భయంకరంగా చంపుకొంటారా?"

"అవును!"

"మైగాడ్!" అని ఆగి "మనవాళ్ళు అలా వాళ్ళు ఒకర్నొకరు చంపుకోకుండా ఆపలేరా?" అన్నది సీత

"మనవాళ్ళ ప్రయత్నం అదే ఎంత అప్రమత్తతగా ఉన్నా తరుచుగా ఇలాంటి మతకలహాలు ఎక్కడో ఒకచోట జరుగుతూనే ఉంటాయి." ఆమె నడుం మీద చెయ్యివేసి డ్యాన్సుచేస్తూనే చెప్పసాగాడు.

దూరంగా నిల్చుని విల్ఫ్రెడ్బ్లన్ట్ వాళ్ళను గమనించడం సీత చూస్తూనే ఉంది

*

---

"ఏనుగులు ఏ విషయమూ అస్సలు మర్చిపోవట! ఎందుకని?"

"ఎందుకంటే వాటికసలు ఎవరూ ఏవిషయమూ చెప్పరుకాబట్టి!"




"ఎవడో ఎక్కడో ఏదో చేస్తాడు ఆ నిప్పు మరోచోట రాజుకొని భగ్గున మండుతుంటుంది ముఖ్యంగా ఒక వ్యక్తికోసం మనవాళ్లు గాలిస్తున్నారు అతనే ప్రస్తుతపు అల్లర్లకు కారణం అని మా అభిప్రాయం"

"అతనెవరు?" సీత ఆత్రంగా అడిగింది

"నాకు తెలియదు ఎవడో ఉన్నాడని మా అనుమానం అతను ఇటీవలే ఈ ప్రాంతానికి చేరాడని కూడా మా అనుమానం ఇంతకంటే నాకు ఏమీ తెలియదు నేనేమీ చెప్పలేను" అన్నాడు ఆమె డ్యాన్సుపార్ట్నర్

వీళ్ళకు ఎవరికీ తెలియదు అన్నీ తెలిసినవాడూ, తన సందేహాలను తీర్చగల వాడూ ఒక్కడే ఉన్నాడు

"నేస్తం! నువ్వు రావాలి నీ అవసరం నాకుంది నేను కష్టాల్లో పడబోతున్నాను నువ్వెక్కడ ఉన్నా నా ఆలోచనలు నీకు అందుతాయని చెప్పావు అవసరం అయినప్పుడు వస్తానన్నావు మరెందుకు రావు? ప్లీజ్! త్వరగా రావా? నాకు ఒక్కసారి కన్పించి వెళ్ళవా?" సీత మనసులోనే పదేపదే అనుకోసాగింది

"దాదాపు ఆరడజనుమందైనా చంపబడ్డారు ఇరవైదాకా గాయపడ్డారు ఈ రాత్రికి ఇక గొడవలుండవనే అనుకొంటున్నాను" మిస్టర్ కార్స్టైర్స్-ఆమె డ్యాన్సు పార్ట్నర్ అన్నాడు

సీత వళ్లు జలదరించినట్టయింది భయంతో ఆరడజనుమంది చనిపోయారా? ఎవరో వాళ్లు అందులో తన నో! నో! అలా జరగదు తనే పిచ్చిగా ఆలోచిస్తున్నది

రేపు టూంబ్స్ దగ్గరకు వెళ్తే?

అవును వెళ్ళాలి. అక్కడ అతను కన్పిస్తాడు. అంటే.. అతను ఎప్పుడూ సమాధుల్లోనే ఉంటాడా? ఆమె అరచేతులు చల్లబడ్డాయి.

ఛ! తను అనవసరంగా భయపడుతోంది.

అతను టెలిపతిద్వారా తన ఆలోచనల్ని తెలుసుకోగలడు. ఆరోజు తను సమాధులదగ్గరకు వెళ్తున్నటు తెలిసి అక్కడికి వచ్చాడు. అలాంటిచోట కలుసుకోవడంలో అపాయం లేదు. అందుకే అక్కడకు వచ్చాడు. తను వెళితే రేపుకూడా అతను వస్తాడు.

డ్యాన్సు పూర్తి అయింది.

ఒక్కొక్కరే వెళ్ళిపోతున్నారు.

విల్‌ఫ్రెడ్‌బ్లంట్ అక్కడే ఉన్నాడు.

అప్పుడే మిస్టర్ బర్నెస్ లోపలకువచ్చాడు. సీత చిన్నపిల్లలా అతనిదగ్గరకు పరుగులాంటి నడకతో చేరింది.

అతను సీతనుచూసి ఆప్యాయంగా నవ్వాడు.

"మిస్టర్ బర్నెస్! రేపు నన్ను సమాధులు చూడటానికి పంపించగలరా?"

అతను ఆమె ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు.

"నేను ఆ సమాధులన్నీ చూడలేదు. మూడు మాత్రమే చూశాను. ఉదయంపూట గుర్రపుస్వారీ అంటే నాకు చాలా ఇష్టం. పైగా ఇంకా కొన్ని సమాధులు చూడాలి."

"మూడే చూశావా? అయితే మరో నాలుగు చూడాలి. నిన్న ఉదయంలాగే రేపు గుర్రాలనూ, రక్షకభటుల్నీ పంపిస్తాను. అంత పొద్దుటే లేవగలవా? ఇవ్వాళ చాలా పొద్దుపోయింది గదా?"

"ఫర్వాలేదు. లేస్తాను!"

"సరే! బ్యాండువాళ్ళకు "గాడ్ సేవ్ ద క్వీన్" అనే పాట వాయించమనాలి. అంతటితో ఈ పార్టీ పూర్తి అవుతుంది" అంటూ బ్యాండువాళ్ళ దగ్గిరకు వెళ్ళాడు బర్నెస్.

బ్యాండువాద్యం ప్రారంభం అయింది.

అందరూ లేచి నిల్చున్నారు.

సీతకు ఆ గీతం నచ్చింది.




తమ రాణిని తప్పుకొంటూ నిల్చుంది

8

ఆ రాత్రంతా సీత కలతనిద్రలోనే గడిపింది ఎంత మర్చిపోవాలన్నా విల్ ఫ్రెడ్‌ట్లిన్ట్ ప్రవర్తన మర్చిపోలేకపోతున్నది

మరో భయంకూడా ఉండి ఉండి ఆమె మనసులో తలెత్తుతున్నది

ఆ చచ్చిపోయినవాళ్ళల్లో తన ఫ్రెండ్‌కూడా ఉన్నాడా? అనే సందేహం! మళ్ళీ అంతలోకే "లేడు! లేడు! ఉండడు!" అని తనకుతానే సమాధానం చెప్పుకొంటూ భయపడుతున్న మనసును జోకొట్టి నిద్రపుచ్చడానికి ప్రయత్నిస్తోంది

అతను జీవించే ఉన్నాడు

అతను చచ్చిపోతే తనకు తెలుస్తుంది

తమ ఇద్దరిమధ్యా సిక్స్తు సెన్స్ పనిచేస్తున్నది

అతను చచ్చిపోలేదు అందువల్లనే తను డ్యాన్సు చెయ్యగలిగింది

అతను బతికే ఉన్నాడు! అందుకే తన మనసు ఉల్లాసంగా ఉంది

వాకిలికి ఉన్న కర్టెన్ కదిలింది

ఏదో నీడలా కన్పించింది

సీత తృళ్ళిపడి లేచి మంచంమీద కూర్చుంది భయం భయంగా వాకిలికేసి చూసింది

అతను వచ్చాడా?

అతను ఎలా వస్తాడు? తలుపువేసి ఉందిగా? అంతా తన భ్రమ ఫ్యాన్‌గాలికి వచ్చగా ఉన్న డోర్‌కర్టెన్ కదులుతున్నది

తన భయానికి ముసిముసిగా నవ్వుకొన్నది

మంచంమీద పడుకుని కళ్ళుమూసుకొన్నది పేరుతెలియని స్నేహితుణ్ని గురించి ఆలోచించసాగింది

అతను తనమీద నమ్మకం పెట్టుకోమన్నాడు

ఆ నమ్మకంతోనే అతను తనకు అండగా నిలుస్తాడని ఆశిస్తున్నది

అతను తప్పక వస్తాడు

తన సందేహాలకు సమాధానాలు లభిస్తాయి

అతను రేపు ఉదయం టూంబ్స్‌లో కన్పిస్తాడు

అంతలోనే ఏదో ఆలోచన ఆమె మెదడులో పురుగులా పాకింది

అతను సమాధుల్లో ఏం చేస్తుంటాడు?

అక్కడే ఎందుకు కన్పిస్తాడు?

ఇక్కడెక్కడైనా కన్పించవచ్చుగా?

అతను నిజంగా మనిషేనా?

ఆ సమాధుల్లో శాశ్వితంగా నిద్రపోతున్న ఎవరో ఒకని ఆత్మ కాదు కదా? ఆత్మలగురించి ఎన్నో కథలు విన్నది ఎన్నో చదివింది కొందరు మానవాకారంలో కన్పిసారని కూడా తను కొందరు రికార్డువేసిన అనుభవాల గురించికూడా చదివింది,

సీతకు వెన్నెముకలో చలి పుదుపుకు వచ్చినట్టుగా అన్పించింది

అంతలో కిటికీలకు ఉన్న కర్టెన్స్ కదిలినట్టు అయ్యాయి అంతలో ఏదో దూకినట్టు అయి త్రుళ్ళిపడింది సీత అరవాలనుకొంది అరిచాననే అనుకొంది కాని ఆమె కంఠంనుంచి శబ్దం బయట పడలేదు

భయం భయంగా కిటికీకేసి చూసింది, నల్లటి పిల్లి, గుడ్డివెలుగులో దాని కళ్లు మెరుస్తున్నాయ్

సీత గట్టిగా కళ్ళు మూసుకొని పెద్దగా అరిచింది

ఎవరో తలుపు కొడ్తున్నారు

"మేమ్‌సాబ్! తలుపు తెరవండి!"

సీతకు ఆ కంఠంవిని ప్రాణం లేచివచ్చింది

* ——— *

"మీ కుక్క పేరేంటమ్మా, పాపా"

"తెలీదండీ! ఎన్నిసార్లడిగినా చెప్తేగాఅది!"

చిన్నగా మంచందిగి, పిల్లివైపుకే చూస్తు వెనక్కు అడుగులువేస్తూ తలుపు తెరిచింది వరండాలోని ట్యూబ్‌లైట్ వెలుగు గదిలోకి ప్రవేశించి, పిల్లికిటికీమీదకు దూకి బయటికి వెళ్ళిపోయింది

"ఏం జరిగింది మేంసాబ్!" సెంట్రీ అడిగాడు

నాలుకతో పెదవులు తడుపుకొన్నది

'పిల్లి పిల్లి "

సెంట్రీ ఆశ్చర్యంగా ఆమె ముఖంలోకి చూశాడు

"అది ఇక్కడ తిరిగే పిల్లే నమ్మగారూ! అది మిస్టర్ బర్నెస్‌కు పెట్! అందుకే దాన్ని ఎవరం ఏమీ అనం పిల్లులంటే మీకు భయమా?"

సీత గుండెలనిండా గాలి పీల్చుకొన్నది

"భయంలేదు నిద్రపడుతుండగా ఏదో దూకినట్టయి అరిచాను అంతే!" అన్నది తను అంత చిన్నవిషయానికి సిగ్గుపడిపోతూ

"భయంలేదు నేను ఇక్కడే తిరుగుతుంటాను తలుపులు వేసుకొని పడుకోండి" అన్నాడు సెంట్రీ

సీత తలుపులు వేసింది

ఛ! ఏమిటి తను ఇంత పిరికిదా? తను ధైర్యంగా ఉండాలని తన స్నేహితుడు చెప్పాడు సీత పేరును సార్థకం చేసుకోవాలన్నాడు

తను పట్టి ఫూల్

అతని తల్చుకొని తను భయపడటం ఏమిటి?

అతను సమాధుల్లోనే కాదు షిప్‌లో కూడా కన్పించాడుగా!

అతన్ని తను దెయ్యం అనుకోవడం ఏమిటి?

సీత కళ్లు మూసుకుంది

అత ఆలోచనల్లో ంచి నిద్రలోకి జారిపోయింది

7

తెలతెలవారుతుండగా సీత నిద్రలేచింది

స్నానంచేసి బయటకు వెళ్ళడానికి సిద్ధం అయింది

తను బ్రేక్‌ఫాస్టు చేసింది హార్వే వచ్చేంతవరకు ఎదురుచూసే సమయం లేదు తన బాబాయికి ఒక నోట్‌రాసి, అక్కడ పడ్డించే కుర్రవాడికి ఇచ్చి, అతను రాగానే ఇవ్వమన్నది

తను గుర్రపుస్వారీ చెయ్యడానికి వెళ్తున్నట్టు రాసింది

అంతకుముందురోజు వచ్చిన సిపాయిలే వచ్చారు ఆమె తనకు కేటాయించిన గుర్రం ఎక్కింది ఇరుపక్కల సిపాయిలు తమతమ గుర్రాలమీద ఆమెను అనుసరించారు

ఆమెకు త్వరగా సమాధుల్ని చేరుకోవాలని ఉంది గుర్రాన్ని వేగంగా నడుపుతోంది చుట్టూఉన్న ప్రదేశాల్ని చూడటం లేదు అవన్నీ అంతకుముందు రోజు చూసినవే ఆమెకు తన స్నేహితుడ్ని త్వరగా చూడాలని ఉంది

నగరం దాటింది బెరాక్సు దాటింది టూంబ్స్ దగ్గరౌతున్నాయి ఆమెలో ఉత్సాహం పెల్లుబికింది గుండెదడ హెచ్చింది ' అది భయంవల్ల కలిగింది కాదు.

అన్నిటికంటే చూడవలసింద 'కులీకుతుబ్‌షా సమాధిఅని ఒర్విన్ చెప్పాడు అతనే హైదరాబాద్ నగరాన్ని నిర్మించాడని కూడా చెప్పాడు ఈసారి ఆ సమాధిని బాగా చూడాలనుకొన్నది సీత తన స్నేహితుడ్ని ఆ సమాధిగురించి, కుతుబ్‌షా గురించి ఎన్నో అడిగితెలుసుకోవాలని ఉంది

గుర్రం దిగింది

సిపాయిలు సీతఎక్కిన గుర్రంతోపాటు తమ గుర్రాలను ఒక చెట్టునీడకు చేర్చారు వాళ్ళుకూడా అక్కడే కూర్చున్నారు వాళ్ళను ఆమె మొదటిరోజే తనతో రావద్దని చెప్పింది

సీత ఆత్రుతగా మూడో సమాధిమెట్లుఎక్కి లోపలకు వెళ్ళింది అక్కడే తన స్నేహితుడు కన్పిస్తాడని ఆమె ఆశ కారణం మొదటిరోజు ఆ సమాధుల్లోనే కన్పించాడు

కళ్ళు పెద్దవిచేసుకొని చూసింది ఎండలో రావడంవల్ల టూంబ్స్‌లోపల బాగా చీకటిగా కన్పించింది

ఒకమూల క్రీనీడలో ఏదో ఆకారం కదిలినట్టుగా అయింది

"వచ్చావా? నువ్వు రావేమోనని భయపడ్డాను" అన్నది ఉత్సాహంగా సీత

ఆమె ప్రశ్నకు సమాధానం రాలేదు

నీడలా కన్పిస్తున్న ఆకారం కదలలేదు ఆ పక్కనే మరో ఆకారంకూడా ఉన్నట్టుగా అన్పించింది

ఏమిటీ నీడలు? ఎవరివి?

అతను కాదు




అతనైతే వెంటనే తన ముందుకు వస్తాడు. పైగా మరో వ్యక్తితో అసలుగాడు చీకట్లో ఉన్న ఆకారాలు కొద్దిగా కదిలినట్టుగా అన్పించింది.

సీత గుండెలు ఝల్లుమన్నాయ్. "ఎవరు?" అన్నది. సమాధానం లేదు.

గిర్రున వెనక్కు తిరిగింది సీత.

రెండో మెట్టుమీద కాలుపెట్టిందోలేదో ఏదో వస్తువు తన తలమీదుగా ముఖాన్ని కప్పేసింది. సీత అరవబోయింది. అప్పటికే ఎవరిదో చెయ్యి ఆమె నోరును గట్టిగా మూసింది.

ఆమెను ఎవరో ఎత్తి భుజంమీద వేసుకొన్నారు. సీత నెత్తిమీదుగా దుప్పటి ఉన్నట్టు గ్రహించింది. పెనుగులాడింది. అరవాలనుకొన్నది. ఆమె నోటిని గట్టిగా అదుముతున్న చెయ్యి ఆమెను అరవనివ్వలేదు.

ఇద్దరు వ్యక్తులు తనను పట్టుకొన్నట్టు ఆమెకు అర్థం అయింది. పెనుగులాడి లాభం లేదనుకొన్నది.

ఎవరు వీళ్ళు?

ఎందుకు తనను ఎత్తుకెళ్తున్నారు?

ఎక్కడికి తీసుకెళ్తున్నారు?

తనను అపహరించాల్సిన అవసరం ఎవరికుంది? తన అపహరణవల్ల వాళ్ళు పొందబోయే లాభం ఏమిటి?

సీతకు ఊపిరి సలపడం లేదు.

తన వంటిమీద ఖరీదైన నగలుకూడా లేవు.

తన ఫ్రెండు ఎందుకు రాలేదు.

వీళ్ళల్లో ఒకడు...అతను కాదుకదా?

నో! నో! అలా ఎన్నటికీ జరగదు. అతను ఇలాంటి పని చెయ్యడు. ముఖ్యంగా తన విషయంలో.

మరి తను టూంబ్స్‌కు వస్తున్నట్టు అతనికి తెలియదా? తను తొందరపడి టైంకుముందే వచ్చేసింది.

తను రాత్రి ఆలోచనాతరంగాలద్వారా మెసేజ్ పంపించిందిగా? -ఆ మెసేజ్ అతనికి అందలేదా?

పెనుగులాడి లాభం లేదనుకొన్నది.

ఎత్తుకొన్నవాడి భుజంమీద తోటకూరకాడలా వేలబడిపోయింది

తనను ఎక్కడికి తీసుకెళ్తున్నారు?

వాళ్లు ఏదో ఎత్తు ఎక్కుతున్నారు గాలి గట్టిగా పీలుస్తున్నారు

హిందూ-ముస్లిముల తగాదాలకూ తనకూ ఎలాంటి సంబంధం లేదు తనను ఎవరు అపహరించారు హిందువులా? ముస్లిములా?

వాళ్లు ఆమెను ఒక బగ్గీలో పడేశారు ఒకడు ఆమె నోరుమూసే ఉంచాడు.

బండి గతుకుల్లో పోతున్నట్టు ఎగిరెగిరి పడుతున్నది సీతకూడా గుడ్డల మూటలా బండి ఎగిరిపడినప్పుడల్లా, ఎగిరిపడుతోంది.

ఒకచోట బండి ఆగింది

"మొత్తంమీద పట్టుకొచ్చారు గుడ్!" ఎవరిదో మగకంఠం సీతకు వినిపించింది అతను ఇంగ్లీషు మాట్లాడాడు

"చాలా తేలిగ్గా పట్టేశాం!" రెండో కంఠం.

"ఎవరూ చూడలేదుగా?" మొదటికంఠం

"లేదు!" మూడో కంఠం

"గుడ్! ఆమెను ఎత్తుకొని నావెంట రండి!" మొదటి కంఠం

ఆ మూడు కంఠాలూ సీతకు కొత్తవే! అంతకుముందు ఆ కంఠాలు ఆమె వినలేదు. అందరూ ఇంగ్లీషే మాట్లాడుతున్నారు.

ఆమెను ఎత్తుకొని కొండపైకి అతిజాగ్రత్తగా ఎక్కుతున్నట్టు ఆమెకు తెలుస్తూనే ఉన్నది

వీరు కొండపైకి తీసుకెళ్ళి ఏంచేస్తారు?

వాళ్ళ ఉచ్చారణనుబట్టి వాళ్ళంతా ఇంగ్లీషువాళ్ళేనని గ్రహించింది

(సశేషం)

జీవితంలో ముందు ముందు ఎవరిదారి వాళ్ళదనుకున్నాము. నలుగురం ఎప్పుడైనా, ఎక్కడైనా కలవడం కూడా అంత సాధ్యం కాదేమో అని నిరుత్సాహ పడ్డాము. కాన్పూరు ఐ.ఐ.టిలో బి.టెక్ చదివిన నాలుగేళ్లూ ఎంతో ఆత్మీయంగా గడిచాయి. ఆ తర్వాత ఉద్యోగరీత్యా ఒకచోట పనిచేసే అవకాశం వస్తుందని ఎవరమూ కలగనలేదు. అబ్దుల్లాది జమ్ము, సేతు మాధవన్‌ది తంజావూరు, దేశపాండేది పూనా, నాదేమో తెనాలి. నలువురం ఒకే దేశంలోని వాళ్ళమే. అయినాఉద్యోగాల విషయంగా ఎవరు ఎక్కడుంటామో తెలియదు.

అయితే, నిజం ఊహకంటే గొప్పది. మా నలువురికీ కడప జిల్లాలో ఒకమారుమూల ఉద్యోగాలు దొరికాయి. బొంబాయి పారిశ్రామికులెవరో కొత్తగా కట్టే సిమెంటు ఫాక్టరీలో ఆ మా ఉద్యోగాలు. నలువురం ఒకే బ్రాంచి చదవకపోవడం మేలైంది. నేనూ, దేశపాండే మెకానికల్, అబ్దుల్లా ఎలక్ట్రికల్, సేతుమాధవన్ సివిల్. సిమెంటు ఫ్యాక్టరీలోని వివిధ దశల్లో మేమెంతో అనుభవం సంపాదించే అవకాశం వచ్చిందనీ అది ముందు మాకెంతో తోడ్పడుతుందనే సంబర పడ్డాము. నలువురికీ మంచి భవిష్యత్తు ఉంటుందని ఆశించాము. ఒకేరోజు చేరాము. మా ప్రమోషన్లూ అవీ ఒకేరోజు రావాలి అన్నది మాకల.

మా ఉద్యోగ భూమిని చూసి ఆశ్చర్యపోయాము. అంతా నల్ల ఎడారి. నాపరాళ్ళ కీకారణ్యం. ఆ ఊరు టౌనూకాదు, పల్లెకాదు. ఇళ్ళన్నీ రాళ్ళతో కట్టినవే. మాకు దొరికిన అద్దిల్లు వేయి స్తంభాల గుడి. లెట్రిను లేదు. నీళ్ళసౌకర్యంలేదు. గాలికి కరువే. పవర్ మాత్రం ఉంది. అక్కడున్నవి హోటళ్లు అనడం కంటే వాటిని మరే పేరుతోనో పిలిస్తే బావుంటుంది. దిన పత్రికలు కూడా అప్పుడప్పుడే ఆఊరు ముఖం చూస్తున్నట్లుంది. ఏమైనా ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్‌లోని గ్రామాలకంటే నయమే. బందిపోట్ల భయం లేదు. జనం సాధువులు. భాషే వినడం కష్టం. మర్యాద తెలియదు. అందరూ అందర్నీ "నువ్వునువ్వు" అనే వాళ్ళే. వీళ్ళభాషలో మీరు లేదు. కడపలో మానాన్న ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా పనిచేసిన రోజుల్లో నాకు ఇది అనుభవమే; అప్పుడు ఇంటరు చదివేవాణ్ణి. మిగతా మా స్నేహితులు ముగ్గురికీ తెలుగురాదు కాబట్టి ఇబ్బంది లేదు. అయితే అబ్దుల్లా కనిపెట్టాడు. అక్కడి మహమ్మదీయులు 'తూ' 'తుమ్' అనే మామూలుగా అంటారనీ, 'ఆప్' అనరనీ. నెలరోజుల్లో ఆ కొత్త ప్రాంతానికీ, ఉద్యోగానికీ అలవాటు పడిపోయాము.

ఒకరోజు సాయంకాలమనుకుంటాను, నలువురం ఓ దుకాణంలో భాగంగా ఉన్న కాఫీకొట్టు దగ్గర బెంచీమీద కూర్చొని కాఫీ తాగుతున్నాము. మా కెదురుగా రాతి అరుగుమీద కూర్చున్న యువకుడు నావైపే చూస్తున్నాడు. పలకరించాలని సందేహిస్తున్నాడు. నాకూ అత

నెవరో జ్ఞాపకం రావడంలేదు. అతనే కాసేపు తటపటాయించి చొరవ తీసుకొని పలకరించాడు "నువ్వు... మీరు ప్రకాశం కదా! కడప కాలేజీలో ఇంటర్లో మీ క్లాస్‌మేట్ని" -

జ్ఞాపకం వచ్చింది. అతను చంద్ర. ఇంటర్ చదివే రోజుల్లో నాకున్న మంచి మిత్రుల్లో ఒకడు. ఈ అయిదేళ్ళలో మరీ సన్నబడ్డం వల్ల పోలిక తెలియ లేదు. బట్టలూ అవీ మాసి ఉండడం వల్ల గుర్తు పట్టలేక పోయాను మర్యాదకొద్దీ క్షమాపణ కోరాను. ఇంటరు చదువుకునే రోజుల్లో నాకు ఇష్టమైన మిత్రుల్లోఒకడు. మిగతా నా ముగ్గురు మిత్రులను పరిచయం చేశాను.

మాటల సందర్భంలో తెలిసింది. అతనిది పక్క ఊరేనట. బి. కాం చదివి చదువు మానేశాడట. సిమెంటు ఫ్యాక్టరీ కోసం తనకున్న నాలుగెకరాల భూమి పోవడం వల్ల ఫ్యాక్టరీ వాళ్ళు క్లర్కు ఉద్యోగం మొన్ననే ఇచ్చారట. రోజూ ఊరు వెళ్ళి వస్తున్నాడట. వాళ్ళ ఊరు రమ్మని మమ్మల్ని ఆహ్వానించాడు. మా స్నేహాలు కలిశాయి.

ఒక సెలవురోజు 'చంద్ర' ఊరికి వెళ్లాము. ఎంతో మర్యాద చూపారు. నాగరికత బలిసిన మా ప్రాంతాల్లో ఇటు వంటి అమాయకత్వంతో కూడిన మర్యాదా మన్ననా నేను చూళ్లేదు. ఆ రాత్రి ఇంటి ముందర ఆరుబయట మంచాలు వేసుకొని వెన్నెల్లో మాట్లాడుతూ పడుకున్నాం. ఓ పది పదిహేను మంది బిలబిలా వచ్చి మమ్మల్ని పలకరించి పోయారు. వాళ్ళంతా ఫ్యాక్టరీలో పనిచేసే ఆ ఊరి వాళ్ళు. వాళ్ళు వెళ్ళి పోయాక చంద్ర అన్నాడు.

"చూశారు కదా! వీళ్ళంతా ఒకప్పుడు భూమీ పుట్రా ఉన్న రయితులే. వానల్లేక అప్పులు పాలయ్యారు. పంట ల్లేక భూములమ్ముకున్నారు. యిప్పుడు కూలీలుగా మారిపోయారు. ఈఫ్యాక్టరీ పని పూర్తి అవుతే మళ్ళీ ఏం జరుగుతుందో తెలీదు. వీళ్ళేమీ 'స్కిల్డ్ లేబరు' కాదు కదా! మట్టిమొయ్యగలరు, రాళ్లు కొట్టగలరు..." చంద్ర ఈ ధోరణిలో చాలా చాలా విషయాలు మాటాడాడు; ఆ మాటల వెనుక బాధ ఏదో ఉంది; కసిఏదో ఉంది. అదంతా నాకు కొత్త ప్రపంచం. ఒకరకంగా కొత్తఅనుభవం, దారిద్ర్యం చూసినంత మాత్రాన, సులభంగా అర్థమయ్యే సమస్యకాదు. అబ్దుల్లా సేతు, పాండే ఎప్పుడో నిద్రపోయారు. వాళ్ళు అన్నీ మనసుకు పట్టించుకునే రకంకాదు. ఇంటరు రోజుల్లో చదువు తప్ప ఏమీ పట్టని చంద్ర యిప్పుడు మాట్లాడే మాటలు చూసి నిజంగా నాకు భయం వేసింది. నిద్ర వస్తుందని బొంకాను. చంద్ర మాట్లాడ్డం ఆపాడు. కానీ ఆ రాత్రి సరిగ్గా నాకు నిద్రపట్ట లేదు.

గడిచిన ఆరుమాసాల్లో చంద్ర మాకు మరింత సన్నిహితుయ్యాడు. ఎప్పుడైనా రాత్రిళ్ళు మా గదికి వచ్చేవాడు. అక్కడే పడుకునేవాడు. అతని మాటలు

..నాయుడు గారనీ_ రంగంలోకి మొన్నే వొచ్చారు బావా-
మన రాజకీయాలు యింకా ఆయనకి వంటబట్టలే...




వినడానికి బావుండేవి. విన్న తరువాత ఆలోచిస్తే భయమేసేది కానీ చంద్ర ముఖంలోని నిష్కాపట్యం నన్ను ఆకట్టుకునేది. మాటల్లోని నిజాయితీ నన్ను వద్దన్నా ఆలోచింపచేసేది.

ఒకరోజు సేతు నన్ను హెచ్చరించారు, చంద్ర ప్రమాదకరమైన మనిషి అనీ, మనం కాస్త దూరంగా ఉండాలనీ. "ఎమిటా ప్రమాదం" అన్నాను సేతు చెప్పుకొచ్చాడు ప్రమాదకరమైన ట్రేడ్ యూనియన్‌తో సంబంధాలున్నాయని చెప్పాడు. తమిళ కార్మికుల మధ్య, తెలుగువాళ్ళ మధ్య ఏవో తగాదాలు సృష్టిస్తున్నాడని ఆరోపించాడు. నేను నమ్మలేదు. ఈ విషయం చంద్రనే అడుగుతానని చెప్పాను. అడగ వద్దన్నాడు.

కానీ వారం రోజుల తర్వాత స్థానిక కార్మికులకూ, తమిళ కార్మికులకూ పెద్ద యుద్ధం జరిగింది. స్థానికులు తమిళ కార్మికుల్ని చితక బాదారు ఒకరిద్దరికి బలమైన గాయాలు తగిలాయి వాళ్ళు వేసుకున్న గుడిశెల్ని పీకి పారేశారు. ఊళ్ళో రకరకాల ప్రచారం నిజమేదో తెలియదు. తెలుగు అమ్మాయిని తమిళ కార్మికుడెవడో చెరచడానికి ప్రయత్నం చేయడం వల్ల ఇది జరిగిందని కొందరన్నారు కార్మికుల మధ్య అప్పుల తగాదా అని కొందరన్నారు సేతు మాత్రం మొదటి సారిగా "మీ తెలుగు వాళ్ళకు ఏమీ చేతకాక పోయినా అహంకారం ఎక్కువ తమిళులు స్కిల్డ్ పర్సన్స్. వాళ్ళను చూసి అసూయ, మద్రాసులో అంతమంది తెలుగువాళ్ళు వుంటే తమిళులు ఇలాగే ప్రవర్తిస్తున్నా

రా!” అన్నాడు చదుకునే రోజుల్లో అయితే ఈరకం మాటల్ని సరదా కింద తీసుకునేవాళ్ళం. ఒక మారు సేతు “మా సాహిత్యం మొత్తం భారతదేశంలోనే ప్రాచీనమైంది మా నాగరికత గొప్పది మేము క్రీస్తు పూర్వమే ప్రపంచంలోని ఇతరదేశాలతో వ్యాపారం చేసాము. మలేషియాలో చూడండి, ఇండొనేషియా లో చూడండి, శ్రీలంకలో చూడండి మా సంస్కృతి ప్రభావం ”అని అన్నాడు “నిజమే, ఇప్పటికీ ప్రాచీనులే. దానికి ఉదాహరణ సేతు వీభూది పట్టెలు పెట్ట డమే. ఉదయాన్నే తన భక్తి గీతాల అరుపుల్తో మన నిద్ర చెడగొట్టడమే” అని బెంగాలీ మిత్రుడు సేన్ వ్యాఖ్యా నిస్తే సేతు కాసేపు ఉడుక్కున్నా ఆ రోజుల్లో ఇలాంటి వాటివల్ల మా స్నేహాలు ఏ మాత్రం దెబ్బతినలేదు. ఇప్పుడు సేతు కొత్త భాష మాట్లాడుతున్నట్లు తోచింది.

చంద్రను ఒంటరిగా దొరికించుకొని వివరాలు అడిగాను ఎందుకంటే అతడు స్థానికుడు. స్థానికులకు ఫాక్టరీలో ఉద్యో గాలు ఎక్కువ రావాలని నాతో ఒక ప్పుడు వాదించినవాడు. గొడవ జరిగిన చోట చంద్ర ఉన్నాడని సేతు చెప్పాడు. అతనే రెచ్చగొట్టాడని తమ వాళ్ళు తన తో అన్నట్లు కూడా సేతు చెప్పాడు. చంద్రను విషయం అడిగాను. చంద్ర మాటలు నాన్చలేదు

“నేనక్కడ ఉన్నది అబద్ధం. నాకు ట్రేడ్ యూనియన్‌తో సంబంధాలు-లేది నిజం. కార్మికుల క్షేమాన్ని కోరేవాడె వడూ ఇట్లాంటి తగాదాలను హర్షించడు. బుద్ధీ జ్ఞానం ఉన్నవాడెవ్వడూ వీటిల్లో దూరడు. అసలు కారణం ఏదో అంగడి దగ్గర ఒకరి భాషను ఒకరు సరిగా అర్ధం చేసుకోక పోవడంవల్ల వచ్చిన చిల్లర తగాదా. దానికి రంగులు పులమ డంతో ఇంత అనర్ధం జరిగింది ఒక తమిళుడు కొత్తగా పెట్టిన అంగడి బాగా జరుగుతోందని ఇక్కడి వ్యాపారులు చేసిన కుయుక్తి. నువ్వు గ్రహించాల్సిన నిజం మాత్రం ఒకటి వుంది. సేతు తమిళులతో తన కుండే భాషా పరిచ యాన్ని- తను బాగుపడడం కోసం ఉపయోగించు కుంటున్నాడు, పెద్ద పెద్ద వడ్డీలకు చిల్లర మొత్తాలు అప్పులు ఇచ్చి కూడా” అని చంద్ర అన్నాడు, కానీ నేను ఆ సమస్యను తరచి తరచి అడగ లేదు. చంద్రను నేను ఎక్కువగా నమ్మ తాను. చంద్ర తమిళ కార్మికుల్తో సన్ని హితంగా ఉండడం చాలా సార్లు చూశా ను. ఒక తమిళ కార్మికుడికి ప్రమాదం జరిగింది. చంద్రా, మిగతా తెలుగు కార్మికులూ అతనిపట్ల చూపిన అపేక్ష మాటల్లో చెప్పగలిగింది కాదు.

నెలరోజుల తర్వాత సేతు అద్దెఇంటికి మారిపోయాడు, ఒక తమిళస్త్రీని వంటకు కుదుర్చుకున్నానని చెప్పాడు. ఈలోగా పాండే మరో ఇద్దరు మరారీ ఇంజ నీర్లున్న ఇంట్లోకి మారి పోయాడు, మరారీ బ్రహ్మణుడెవర్నో వంటవాడుగా తెచ్చుకున్నామనీ, తెలుగు భోజనం పడ

లేదనీ చెప్పి వెళ్ళిపోయాడు. బ్రాహ్మణ్యం అప్పటి వరకూ గుర్తురాలేదు మరి పాండే మారిపోయాడు ఫ్యాక్టరీలోని మరాఠీ పెద్ద అధికారులతోనే అతను ఎక్కువగా తిరగడం మొదలుపెట్టాడు

సేతూ, పాండే మా గది నుంచి పోతున్నప్పుడు అబ్దుల్లా బాధపడ్డాడు కాని ఏమీ అనలేదు నేనే కాన్పూరు రోజుల్ని గుర్తుచేశాను సిటీకి వెళ్ళాలన్నా నలుగురం వెళ్ళాల్సిందే ఆటోలో ఇద్దరికి మాత్రమే సీట్లుంటే నలుగురికీ సీట్లు దొరికేంత వరకు ఆగే వాళ్ళం

ఫ్యాక్టరీ. పరిసరాల్లో పట్టడాంకు తవ్వకం పని, చురుగ్గా జరుగుతోంది ఒకరోజు ఏదో దేవతా విగ్రహం బయట పడింది ఇంకేం? చందాలు పోగయ్యాయి యాజమాన్యం పెద్ద మొత్తంలో చందా ఇచ్చింది ఒక చిన్న గుడి నిర్మాణం మొదలైంది

అదంతా చూసి అబ్దుల్లా విసుక్కున్నాడు "ఈ హిందూ దేవతలు రాళ్లయి ఎక్కడ బడితే అక్కడ దొరుకుతారేం సిమెంటు ఫ్యాక్టరీకి పనికి వచ్చే ఇక్కడి రాళ్ళు చాలక? దొరకనీలే కానీ ఇక్కడ పనిచేసే వాళ్ళందరూ హిందువులు కాదే, ముస్లిములున్నారు, మీ క్రైస్తవులున్నారు, ముస్లిములకు మసీదు అఖ్ఖర్లేదా? క్రైస్తవులకు చర్చి అఖ్ఖర్లేదా "

"లౌకిక రాజ్యాంగం" అంటే

అబ్దుల్లా వ్యాఖ్యానించినట్లు ఉండాలా? నాకు ఆపెద్దల భాష అర్థంకాలేదు

అబ్దుల్లా నాతో ఈమాటలు మాట్లాడిన నెల రోజుల తర్వాత ఒక చిన్న మసీదు నిర్మాణం కూడా మొదలైంది యాజమాన్యం దానికీ చందా ఇచ్చింది స్థానిక ముస్లిములు ముందుకొచ్చారు

నాకు నవ్వొచ్చింది నేను కూడా స్థానిక క్రైస్తవుల్ని ప్రోత్సహిస్తే అనుకున్నాను నేను హరిజనున్ననే విషయం గుర్తుకొచ్చింది కాదు మా ముత్తాత హరిజనుడు మాతాత తరం నుంచీ మేము హరిజన క్రైస్తవులం ఏం జరిగిందో ఏమో గానీ ఒక చిన్న చర్చి నిర్మాణం కూడా మొదలైంది దానికీ ఫాక్టరీ యజమానులు చందాలిచ్చారు

హిందూ దేవత గుడి నిర్మాణం జరిగేటప్పుడే "చూడు ముందు ముందు మసీదు, చర్చి కూడా వస్తాయి వాటికి ఈ పారిశ్రామికవేత్తలు డబ్బిచ్చి ప్రోత్సహిస్తారు వాళ్ళకొక్కవల్సింది వ్యక్తిగత మతస్వేచ్ఛ కాదు మూఢభక్తి పెరగడం మతాల మధ్యగోడలు పెరుగుతూ పోవడం" అని చంద్ర అన్నది జ్ఞాపకం వచ్చింది

కాన్పూరులో చదువుకునే రోజుల్లో ఉత్తరప్రదేశ్‌లో జరిగిన మతకలహాన్ని ఆసందర్భంలో గుర్తుకొచ్చాయి ఆ మధ్య హైదరాబాదులో జరిగినవి గుర్తుకొచ్చాయి అదృష్ట వశాత్తు ఈ ప్రాంతంలో అవి జరగలేదు వీళ్ళింకా అంత పతనం కాలేదు

అబ్దుల్లా కూడా గది విడిచి మరోగది చూసుకున్నాడు ఎవరి లోకాలు వారివి. మా నలుగురి మధ్య మొదట చేరినప్పుడున్న ఆత్మీయత దాదాపు పోయినట్లే కానీ పలకరింపులకేమీ కొదవలేదు. దీనికి కారణమేమని తెగ ఆలోచించాను నా బుర్ర గజిబిజి అయిపోయింది

చంద్ర వాళ్ళ పల్లెలో ఉండకుండా ఎక్కువ భాగం నాతోనే ఉంటున్నాడు మా నలుగురి మిత్రుల వ్యవహారం ప్రస్తావనకు వచ్చినప్పుడు చంద్ర అన్నాడు

"అసలువిషయం ఫ్యాక్టరీ అధికారుల కళ్ళలో బడి పైకిపోవాలనుకోవడం దాని కోసం మనవాళ్ళు తమవంతు ప్రయత్నాలు తాము చేసుకుంటున్నారు చూసి నావో లేదో గాని ఈమధ్య సేతు అబ్దుల్లా దేశపాండేకు పార్టీలూ అవీ ఇచ్చి కొండ మీద కూర్చోపెడ్తున్నారు ఈమధ్యనే వచ్చిన మన కన్‌స్ట్రక్షన్ చీఫ్ ఇంజనీర్, దేశపాండే బంధువంట ఈ రోజుల్లో స్నేహాలు, బంధుత్వాలు అన్నీ త్రాసులో తూగేవే కదా!"

ఈ మాటలతో నాకు దిగులుపట్టుకుంది వాళ్ళు నాముందే పెద్ద ఉద్యోగాల్లోకి పోతారు నేను వాళ్ళకింద పని చేయాల్సివుంటుంది ఒకరకంగా వాళ్ళ మీద ఈర్ష్యకూడా కలిగింది. నేను చంద్ర ద్వారా స్థానికుల్ని రెచ్చగొట్టలేనా అని కూడా ఆలోచించాను నేను అంత సమర్థుణ్ణి ఏనాడు కాలేను

సరిగ్గా ఆ రోజుల్లోనే కూలీరేట్ల విషయంమీదా, ఇతర కార్మిక సమస్యలమీదా

ట్రేడ్ యూనియన్ సమ్మెకు పిలుపు ఇచ్చింది.

సమ్మెకు ముందు రోజు రాత్రి యూనిట్ ఇన్చార్జి సంతోజీనుంచి పిలుపు వచ్చింది. నేను వెళ్ళేటప్పటికి మా క్లాస్ మేట్లు ముగ్గురూ అక్కడున్నారు. ఆశ్చర్యం వేసింది. నాతో మాట్లాడవలసింది ఉందని సేతూను, అబ్దుల్లాను, పాండేను ముందుగదిలోకి వెళ్ళమన్నాడు. తలుపులు మూసుకున్నాయి. నాలో సన్నగా వణుకు మొదలైంది. భయం బయటపడనీకుండా కూర్చున్నాను. ఒకచేత్తో బట్టతల రుద్దుతుంటూ, మరోచేత్తో టేబుల్ మీద పేపర్ వెయిట్‌ను ఆడిస్తూ అమెరికన్ ఆక్సెంటుతో సంతోజీ లెక్చరు మొదలు పెట్టాడు:

"ఈ సమ్మె సంగతి మీకు తెలుసు కదా! ఇంత వెనుకబడిన ప్రాంతంలో లక్షలు కాదు, కోట్లు పోస్తున్నాం. ఎందుకు? ఈ సిమెంటు ఫ్యాక్టరీకి తోడు ఇక్కడే మరో ఎరువుల ఫ్యాక్టరీ మన కంపెనీ ఆలోచనలో ఉంది. ఎందుకు? కేవలం లాభాలకోసమా? కాదు. వెనుకబడిన ప్రాంతాలను మన పరిశ్రమలతో ముందుకు తీసుకుపోదామని. ఈ ఫ్యాక్టరీనే లేకపోతే చాలమంది జనం పస్తులుండేవారు. మూడు వేలు చెయ్యని ఎకరా భూమికి పది వేలు ఇస్తున్నాం. మన ఫ్యాక్టరీతో ఎంత అభివృద్ధి జరుగుతోంది? మొదట వచ్చినప్పుడు ఇక్కడ మంచి బ్లేడు కూడా దొరికేది కాదు. ఇప్పుడు స్మగుల్డు గూడ్సు దొరుకుతు

## అడ్డుగోడ

ప్రకృతి
నిరంతరం కృషి చేస్తూ

వికృతి
నిరంతరం అడ్డుపడుతూ

ప్రకృతి మనం
వికృతి అహం!

**ఎస్. వి. రవికిరణ్**

న్నాయి. యిప్పుడు మన వుద్యోగుల కున్న సౌకర్యాలు ప్రభుత్వ సంస్థల్లో వున్నాయా? మనకంపెనీలాంటి ప్రైవేటు సంస్థల లక్ష్యాలు ప్రభుత్వానికి తెలుసు కాబట్టే మనకు లైసెన్సులిస్తోంది. ఇక ఒక సంవత్సరంలో సిమెంటు ప్రొడక్షను మొదలవుతుంది. మీకెంతో భవిష్యత్తు ఉంది. ఏమంటారు?"

నేనేమంటాను? నీరసంగా ఒక నవ్వు నవ్వాను. రహస్యంగా మాట్లాడే ధోరణి లో సంతోజీ చెప్పాడు:

"మీకు చంద్ర మంచి మిత్రుడుకదా! ఈ స్ట్రయికు వెనుక అతనూ, అతన్ని ప్రోత్సహించే ట్రేడ్ యూనియన్ లీడరూ ఉన్నారు. ఆ ట్రేడ్ యూనియన్ లీడరుకు పనీపాటా లేదు. చంద్ర మన ఉద్యోగి అయివుండి వీటిలో తల దూరుస్తున్నాడు. నాలుగు రూపాయలు పెంచడం ఒక సమస్య కాదు.

ఈ సమస్యకు మనం తలవంచామంటే ఇక ట్రేడ్ యూనియన్ బలపడి తీరుతుంది. ఆతర్వాతే అసలు తలనొప్పి, చంద్ర మనవైపు వచ్చాడంటే స్ట్రయికు వీగి పోతుంది. ఊళ్ళోనూ, చుట్టుపక్కలా ఎక్కువగా అతనికి పలుకుబడి ఉంది. చంద్రతో మీరు మాట్లాడాలి. మీరిద్దరూ తెలుగు వాళ్లు. పైగా నీరూం లోనే ఉంటాడని విన్నాను. అది మంచి దేలే. ఈపని చేశారంటే మీ ప్రమోషన్ రికమెండ్ చేస్తాను. ముందు ముందు ఫారెన్ చాన్సు కూడా......"

నాకంతా అయోమయంగా ఉంది. చంద్రకు కార్మికుల్లో ఎంత పలుకుబడి వుందో నాకంటే ఇన్చార్జికే బాగా తెలిసి నట్టుంది. అతని ప్రయోజనం తెలిసి నట్టుంది. అయితే చంద్ర నా మాట వింటాడా? అదేమాట అడిగాను.

"ఏనేట్లు చేయాలి. ఈ వంద మంది హరిజన కార్మికుల్ని చీలిస్తే వింటాడు. ఆపని మీరు సులభంగా చెయ్యవచ్చు".

సంతోజీ పథకం అర్థమైంది. గట్టి బట్టతల. ఏం చెప్పాలో దిక్కుతోచ లేదు. "ప్రయత్నిస్తాను" అని గొణిగాను "ఓ. కే. గుడ్‌బాయ్" అంటూ భుజం తట్టి "గుడ్‌నైట్" చెప్పాడు.

మిగతా ఇద్దరితో ఏంచెప్పి వుంటాడో ఊహించాను. సేతును తమిళ కార్మికుల




తో మాట్లాడమని ఉంటాడు అబ్దుల్లాను ముస్లింలతో మాట్లాడమని ఉంటాడు మాముగ్గురికి ఒకేరకం ఎరలు ప్రమోషనూ రిన్ చాన్సు మొదటి సారిగా అసహ్యం వేసింది ఎంత కక్కుర్తి! ఎన్నికుయుక్తులు! ఎంత వంచన! ఈ విషయమంతా చంద్రకు చెబుదామనుకున్నాను ఎంత అపరాత్రి అయినా గదికి వచ్చే చంద్ర ఆ రోజు రాత్రి రాలేదు

ఉదయం పర్క్-స్పాట్ దగ్గరకు వెళ్ళేవేళకు సమ్మె చేస్తున్న జనం ఇన్నాళ్లు దరిద్రం ఓడుతూ అమాయకంగా కన్పించిన వాళ్ళలో పట్టుదల ఒకేపాట, ఒకేమాట "కార్మికుల ఐక్యత వర్ధిల్లాలి" అంటూ, ఎవరో తమిళుడు "సేతు మాధవన్" అని అరిచాడు యువకుల గొంతులు 'డౌన్ డౌన్' అన్నాయి ఎవరో ముస్లిం 'అబ్దుల్లా' అన్నాడు కొన్ని గొంతులు 'ముర్దాబాద్' అన్నాయి ముక్త కంఠంగా మరికొన్ని నినాదాలు ఆ నినాదాల మధ్య తెలుగు కార్మికులూ తమిళ కార్మికులూ, అనే భేదం లేదు కులాల్లేవు వాళ్ళందరూ రెండు రూపాయల కూలీ పెంచడం కోసమే ఆ నినాదం చేస్తున్నారా? నేను నమ్మను గాక నమ్మను అవి సుందరమైన భవిష్యత్తు కోసం సామూహికంగా తెగిస్తున్న నినాదాలు సమైక్యంగా సాగుతోన్న జనం

మరి పెద్ద పెద్ద చదువులు చదువుకున్నవాళ్ళు, పదవుల్లో ఉన్నవాళ్ళూ చేస్తున్న పని ఏమిటి? వాళ్ళ మధ్య విలువలు రాజ్యమేలుతున్నాయి? నా ఆలోచనలు ఇప్పుడిప్పుడే తెగుతున్నాయి

# తెలిసిన శత్రువు!

## పి. కుసుమ కుమారి

"ఐతే—ఎవరూ రారన్నమాట . "
కోపం వొచ్చింది శాలినికి

"సారీ శాలీ — పిక్చరు చాలా పాతది..." అనేసింది అరుణ

"పాతదైతేనేం...ఎంత మంచి పిక్చరని! ఎంత బాగుంటుందో?"

"థియేటరు దూరం అదీగాక యివాళ నేనింట్లో ఉండాలి" తప్పించుకుంది రేఖ

"సరే మీరెవళ్లూ రాకపోయినా ఒంటరిగా అయినా నేను వెళ్ళి ఆ సినిమా చూసివొస్తాను ఆ సినిమా నా ప్రాణం ప్రాణంపోయినా మళ్ళీ ఆ పిక్చరు చూసి తీరవలసిందే అంతెగాని పిక్చరు మిస్ అవను" కచ్చితంగా అంది శాలిని

"శాలినీ ప్రతిజ్ఞ!" నవ్వింది మృణాళిని "మరి మీ వాళ్ళు నిన్ను ఒంటరిగా పంపుతారా?" అనుమానం వెలిబుచ్చింది

"ప్రాణవిత్తమాన భంగములందు—బొంకవచ్చునధిప నఘము లేదు ఈ పిక్చరు నా ప్రాణమూ మానమూ విత్తమూ కంటె అధికం..."

"అబద్ధమాడగలవా, అది కేటట్లుగా!"

"ఆడపిల్లని, ఆర్ట్సు స్టూడెంటుని ఆ పైన-ధ్యేయం సినిమా"

"విష్ యు బెస్టాఫ్ పిక్చర్"

"ఈ శాలిని నివాళ జోరీగలు బాధించకుండుగాక"

"మా శాలిని సుఖంగా-సురక్షితంగా పౌరీషుం కంటపడకుండా పవిత్రంగా సినిమా చూసి తిరిగి రాగలుగుగాక "

"థాంక్స్ ఈ శాలిని చాలావిధాల బాగనే ఉంటుంది కానీ యిదుగో ఇలాగ సినిమాలకీ, షాపింగ్ లకీ ఆడవాళ్లు ఒంటరిగా వెళ్ళాలంటే పెద్ద చిక్కు- ఊరికి దూరం" అంది శాలిని

"ఉద్యోగికి - సినిమా చూచువారికీ దూరభూమిలేదని సుడివాడు సుమతి రైట్ .మేం పోతున్నాం .. అగైన్ గుడ్ లక్..."

ఇల్లుచేరి-త్వరగా తయారై-యింట్లో అమ్మ నమ్మగలిగే నిజంలాంటి అబద్ధం చెప్పి-బయటపడి-మూడ్రూపాయలు రిక్షా




వాడికిచ్చి - ఐదు నిముషాల ముందుగానే థియేటర్ చేరుకుంది శాలిని.

టిక్కెట్లు దొరకవేమో అన్న భయమేమీలేదు. కానీ ఆటమొదటినుంచీ చూడాలని ఆమె పట్టుదల. ఐదు నిముషాలు ముందుగానే ఆమె లోపలికివొచ్చి సీటులో కూర్చుంది. రిజర్వ్‌డ్‌లో మొత్తం నలుగురైదుగురికంటె లేరప్పటికి. ఇంతకంటె నిదర్శనమేం కావాలి అది క్లాస్‌పిక్చరనే దుకు? నిశ్చయంగా యిది కళాఖండమే అశ్లీలపాటలూ, అర్ధనగ్న నృత్యాలూ హీరో స్టెప్పులూ, హీరోయిన్ స్నానాలు ఏమీలేని యీ చిత్రానికి ఎదురిస్తామన్నా ఎందరో రారు. మనం తెలుగువాళ్ళం

మన భాషలో మంచి సినిమాకి ... ఏ ప్రతిభకీ-మనం మంచినీళ్లు పుట్టనివ్వం. అది మన ప్రత్యేకత. మూరపుకొండం నుసుపుకే పరిమితం మన దృష్టి.

ఇదీ మంచిదే- హాయిగా ప్రశాంతంగా సినిమా చూడవచ్చు తపస్సు చేసుకుంటున్నట్లు. ఈసినిమా అంత పవిత్రమైనదే కూడా.

తెరమీద బొమ్మ పడింది.

ఈ కలక్షనికి అడ్వర్టయిజ్‌మెంట్లూ న్యూస్‌రీలూ కూడా వేయడం కరంటు దండగనుకున్నారో లేక పెద్ద సినిమా అనో స్ట్రెయిట్‌గా మెయిన్ పిక్చర్ ప్రారంభించేశారు. మంచి సినిమా కనుక కథ తొందరగానే ప్రారంభమై ఎన్నోసారి చూస్తున్నా శాలిని నాకట్టుకో సాగింది. ఓ పావుగంటయిందేమో.

త్రుళ్ళి పడింది. ఈ లోకంలోకి వొచ్చింది ఒక్కసారి బలవంతంగా.

"సారీ!" చిరునవ్వు నవ్వాడు.

ఆమెకి చాలా చిరాకూ, కోపమూ వొచ్చాయి. మూడ్ పోయింది. ఇక్కడా దాపురించిందా యీ పిశాచం? ఇంకతను సినిమా చూసినట్లే. టికెట్ డబ్బులూ రిక్షా ఛార్జీలు అన్నీ వేస్ట్. బూడిదలో పన్నీరు. నేనేం నేరంచేశానని యీశాపం నాకు? ఎందుకు నాకీ శిక్ష? ఇష్టమైన సినిమా కూడా చూడడానికి నోచుకోని యీజన్మెందుకు?

"హలంతాకాశీయే. దూరంగా కూర్చోరాదూ యిలాగ చేతులూ అవీ తగిలించక పోతే?" విసుక్కుంది- అతనికి వినడేటట్లు.

అతను నవ్వాడు. "సెంటిమెంటు... బలహీనతేమో... తెలిసినవాళ్లు కనపడే సరికి సాధ్యమైనంత దగ్గరలోనే కూర్చోవాలని అనిపించడం..."

"మనమేమీ స్నేహితులంకాము-" చాలా కోపంగా అందామె.

"సఖ్యం సాప్తపదీనం-అది సంస్కృత సూక్తి. మనం యిప్పటికి కలిసి ఏడేంకర్మ... ఏడువేల అడుగుల కంటె కూడా ఎక్కువే వేసి ఉంటామేమో"

వొళ్లుమండి పోయింది శాలినికి.అతని మాట లౌకవిధంగా నిజమే. గుమ్మం దిగితేచాలు నీడలా పీడలా వెంటపడతాడు. సినిమాకి... షికారుకి... షాపింగ్‌కి... ఎక్కడికి వెళ్ళినా తనకంటె ముందు తయారౌతాడు. జీతం బత్తెంలేని బాడీగార్డ్. చాలా చికాకు వేస్తుందొక్కొక్కప్పుడు. స్వేచ్ఛగా ఉండనివ్వకుండా యీ జిడ్డేమిటని పిస్తుంది. తన ఒక్కతెదే కాదీ బాధ. కొంచెం అందంగా ఉన్న ఏ అమ్మాయికయినా యీ బాధ తప్పదు. అమ్మాయి కనపడడం భయం ఆమె వెనుక చేరి... వెకిలి మాటలు విసురుతూ... వెర్రి పాటలు పాడుతూ... వెధవ చేష్టలు చేస్తూ- ఆమె మనసుకి గాయం చేస్తూ తాము వికృతానందం అనుభవిస్తారు. ఈ యీవ్‌టీజర్స్ వొట్టి మూర్ఖులూ రాక్షసులూ.

"మీరు నాకు స్నేహితులా! ఎంత మాత్రం కాదు. శత్రువు... ప్రథమ శత్రువు..."కసి, ద్వేషం...కోపం... అన్నీ ప్రదర్శించిందామె తన మాటలలో.




అతను నవ్వేశాడు- ఆమె, మాటలను చాలా తేలికగా తీసుకున్నట్లు. సిగ్గులేని మనిషి... ఔను. సిగ్గుంటే అలా ప్రవర్తిస్తాడా? ఈవ్ టీజర్‌కి సిగ్గూ లజ్జా ఏమిటి? దూషణ తిరస్కారావమానా లన్నిటికీ అతీతులీరోమియోలు.

"మీరు మరో సీటుకి వెళ్తారా, వెళ్లరా?" క్రోధంగా అడిగింది

"గాలీ, నీరూ, సౌందర్యమూ, సినిమాహాలులో సీటూ ఏవొక్కరి స్వంతమూ కాదు"

"ఛీ–" అంటూ లేవబోయిందామె తనే మరో సీటులోకి వెళ్ళి కూర్చుందామని. అదేక్షణంలో...

"ఏమిటమ్మా! ఇతను అల్లరి పెడుతున్నాడా?" అంటూ వొచ్చాడొకాయన వెనుక సీటులోంచి. చీకట్లో కూడా ఆయన ముఖం పచ్చగానూ గౌరవంగానూ పెద్దమనిషి తరహాగానూ ప్రకాశిస్తూంది. నాన్నగారి వయస్సే ఉంటుందేమో అనుకుంది శాలిని ఆయనను చూసీ చూడగానే.

"మరే... మరే..." గొణిగింది- సిగ్గుపడుతూ.

ఆయన- హెచ్చరించాడు-"మిస్టర్! మళ్ళీ ఆమెనల్లరి చేశావో మర్యాద దక్కదు. జాగ్రత్త. దూరంగా వెళ్ళి కూర్చో. లేదా..."

ఈవ్‌టీజరు- శాలిని వేపదోలాచూసి. ఒకసీటు వొదిలి- కూర్చున్నాడు. ఆమె కూడా రెండు సీట్ల అవతలికి వెళ్ళిపోయింది- ఆయనకు "థాంక్స్" చెప్పి.

ఇంక అతని పోరులేదు. ప్రాణానికి హాయిగా ఉంది. సినిమా సుఖంగా చూడసాగింది.

ఇంటర్వెల్... దీపాలు వెలిగాయి,

అతను తన వంక ఎలాగ చూస్తున్నాడో– కోపంగా, రోషంగా- చేజారిన

లేడి వంక పులి చూస్తున్నట్లు; ఎక్కడికి తప్పించుకు పోతావులే అన్నట్లు. శాలిని మరీ మరీ చూసింది అతనివంక - అతనలా ఓడిపోయిన ముఖం వేసుకుని - అభిమాన హీరో సినిమాకి టికెట్ దొరకని వాడిలా వెర్రిమొహం వేసుకుని ఉంటే తనకెంత సంతోషంగా... పగతీరినట్టు పరమానందంగా ఉండని! అతని మీద కొంచెమయినా జాలెయ్యడంలేదు. ఈవ్ టీజర్స్ మీద జాలా! ఆడపిల్ల కనపడితే ఏడిపించడమే తప్ప వీళ్ళకి కొంచెమయినా సెన్సూ, మంచీ మర్యాదా ఉన్నాయా? సమయమూ సందర్భమూ చూడకుండా గుడ్డిగా పిచ్చిగా పశువుల్లా, రాక్షసుల్లా ప్రవర్తించి అమ్మాయిల పాలిటి ప్లెషర్ కిల్లర్స్ అౌతారు.

రమని - యిలాంటి యీవ్ టీజరేగా పుణ్యం కట్టుకున్నాడు! కుటుంబంతో సినిమాకి వొస్తే - పక్కన తల్లిదండ్రులున్నారనయినా చూడకుండా డాషిచ్చి - పలకరించాడుట తెలుగు సినిమాలో శుద్ధ మొద్దావతార పశుహీరోలా. అసలీ మృగలక్షణాలకు సగం కారణం సినిమాల్లో హీరోలు కారూ? రమ అమ్మానాన్నా సినిమా ప్రోగ్రాం కాన్సిల్ చేసుకుని యింటికి వెళ్ళిపోయి— "అతనెవరు? ఎన్నాళ్ళ నుంచి పరిచయం? పరిచయమేనా, యింకా ఏమన్నా ఉందా? ఉండే ఉంటుంది. లేకపోతే... మాముందే నీతో అలా ప్రవర్తించడానికి వాడి కన్ని గుండెలు? నీ అలుసు చూసుకునే వాడలా చేశాడు. వాడెవడు? ఎన్నాళ్ళ నుంచి మీ సంబంధం? "అంటూ రమని నిలదీశారు. "నిజంగా నాకేమీ తెలీదు" ఎంతో మొత్తుకుంది రమ. ఇటువంటి సందర్భాలలో అమ్మా నాన్నా తమ అమ్మాయిని నమ్మరు. ముక్కూమొహమూ ఎరుగని మూడో మనిషినే నమ్ముతారు. అలాగే జరిగింది రమకీను. ఆమె ఎంత ఏడ్చినా వినక - కాలేజీ మానిపించేశారు. రమ— తమ దగ్గరకు వొచ్చి.

"శాలినీ... నీకు తెలుసు నాకు చదువంటే యెంత శ్రద్ధో... ఎంతయిష్టమో. నేను నిజంగా ఏమీ ఎరుగను. లోగడ కూడా అతను పలకరించబోయాడు. నేను రెస్పాన్సివ్వలేదు తలవొంచుకుని వెళ్ళిపోయాను..." బోరుమంది.

"తల్లి పుట్టిల్లు మేనమామకి తెలియదనా యింత చెబుతున్నావు! మేమూ యీ న్యూసెన్సు అనుభవిస్తున్న వాళ్ళమే కదా? నీ పరిస్థితి బాధా అర్థం చేసుకోగలం..."

"కాని - వాళ్ళు... తప్పంతా నాదే ఐనట్లు..."

"అత్తమీదకోపం దుత్తమీదచూపించారు అవతలి వాడినేమీ చేయలేని తమ అసమర్థత కొద్దీ. ఈ దౌర్భాగ్య వ్యవస్థలో గెలుపెప్పుడూ ముల్లుదే. జరిగిన తప్పులో నీ బాధ్యత రవంతయినాలేదు. అదీకాక యిలాగ జరుగుతున్నది - నీ వొక్కర్తికే కాదు, ఎందరో అమ్మాయిలకి... బయటకొస్తే చాలు యీ బాధ తప్పదు. నిర్దోషివైన నిన్ను చదువు మాన్పించి శిక్షించి భవిష్యత్తూ జీవితమూ నాశనం చేయబోవడం ఘోరాతి ఘోరమూ, దారుణాతి దారుణమూ. మేమంద

రమూ... వొచ్చి మీ వాళ్ళతో చెప్పటా దమా?"

"ప్రయోజన ముండదు పిసరంత యినా. నీ ఉదాహరణచూసి మీరయినా జాగ్రత్త పడండి. ఆడపిల్ల చదువుకోడ మంటే కత్తిమీద సామే. చేయని నేరా నికి కూడా తీవ్రమయిన శిక్ష అనుభ వించ వలసి ఉంటుంది" కన్నీరు తడుచు కుంటూ అంది రమ. "ఎందుకంటే... మనం... ఆడపిల్లలం... అసహాయు లం..." శాలినికి చాలా కోపం వొచ్చిందా క్షణంలో. రమమీద జాలి— ప్రపంచం మీద కోపంగా మారి— "నాకే శక్తి ఉంటే... ప్రపంచంలో యీవ్‌టీజరనే వాడు లేకుండా షూట్‌చేసి పారేసి ఉందును. అయినా ఈ మూర్ఖతేమిటి? ఆడదాన్నే ఎరగనట్లు చూచిపోవడమేమిటి, పశువులా గుద్దుకోడమూ, రాక్షసుల్లా రక్కడమూ... యీవ్‌టీజింగ్ ఎవతలి వాళ్ళు చేత చిరునవ్వు నవ్వింపజేయాలి కాని కన్నీరు తెప్పించడమా! ఈ ఫూల్స్‌కి ఏది సరిగా తెలుసునని యిది తెలియ డానికి?"

మళ్ళీ— సినిమా. శాలిని ఆలోచనలు తెగిపోయాయి. చిత్రంలో లీనమైంది. ఈవ్‌టీజరు దగ్గరలోలేడు కనుక చెవిలో జోరీగలేదు. వొంటిమీద నల్లులూ గొంగ ళీలూ పాకడంలేదు, రసభంగం వాటిల్ల కుండా సినిమా చూసింది. ఆమె కేవిధమ యిన యిబ్బంది కలగలేదు.

షో అయిపోయింది. శాలిని యివతలకి వొచ్చింది. ఆకాశం మబ్బుపట్టి ఉంది. కాలనీ వాళ్ళెవరయినా కనిపిస్తారేమో, కలసి వెళ్లవచ్చునని— ఆవరణంతా కన్నులు పెద్దవి చేసుకుని కలియ జూసింది. ఆశనిరాశ అయింది. ఒక్క—

సారి పెద్దగాలి వీచింది. ఆకాశం వంక చూస్తే– ఆ నల్లదనం- భయంగొల్పింది. ఈ వాతావరణంలో ఒంటరిగా వెళ్ళాలా తను! భయంగా- గేటు దాటింది. మంచి సినిమాకి ప్రేక్షకులే భేరు. రిక్షాలూ ఆటోలూ కూడా రావన్న నిజం అవగత మయింది. పాత సినిమా కనుక పెద్దది. విడిచే సరికి ఆలస్యమయింది. ఒక్క- రిక్షాకాని, ఆటోకానిలేదు. రెండుమైళ్ళపై చిలుకు- యీ చీకట్లో ఒంటరిగా నడిచి- వెళ్ళగలదాతను? నేరకపోయి వొచ్చింది సినిమాకి. రాకపోతేనే బాగుండేదేమో ఇప్పుడెలా? శాలిని భయంగా నిలబడి పోయింది - బ్రమాన్పడిపోయి. ఆమె పక్కగా- మోపెడ్స్.

"రిక్షాలూ ఆటోలాలేవు... ఇంటి కెలా వెల్తారు?" నవ్వాడతను.

ఆమెకు అరికాలిమంటి నెత్తికెక్కింది అతన్ని చూడగానే, ఆ మాటలువినగానే.

"లిఫ్టిస్తాను వొస్తారా?" నవ్వుతూనే.

ఆమె కోపం తారస్థాయినందుకుంది. ఏమిటి తన దురాశ? ఇతని దగ్గర లిఫ్ట్ తీసుకుంటుందా తను? అంత అమాయకు రాలూ మూర్ఖురాలూ అనుకుంటున్నాడా తనని? ఇతని బండి ఎక్కితే అతను తననెక్కడికి తీసుకువెల్తాడో తనకి తెలీదా? ఆ సర్వనాశనానికి తను సిద్ధ పడుతుందనే! ఏనిర్జన ప్రాంతంలోనో తన కేమయినా చెయ్యాలని కాదూ అతని ఆశా కుటిలత్వమూ? పాము పడగనినమ్మే పసిపాప కాదు తను. ఇతని సహాయ- తీసుకుంటే జరిగేదేమిటో ఊహించలేక పోదు.

"రాను. మీరు ఆశలు పెట్టుకోకండి" కచ్చితంగా అందామె. అదేక్షణంలో- ఆమె నెత్తిమీద టపటప చినుకులు పడ్డాయి. అప్పులాడు (కాబూలీ) వొస్తా డంటేనే భయంతో పారిపోయే అప్పా రావులా-వానవొస్తుందేమో అనికరంటు- ముందు జాగ్రత్త పడి- పోయింది... శాలిని– భయంతో వొణికిపోయింది. చీకటి... వర్షం... దూరం... ఒంటరి తనం... నలుగురు శత్రువులు ఒక్క- సారిగా తనని కబళించడానికి కమ్ముకు వొస్తున్నట్లే కంపించింది. అదేక్షణంలో, కారుహారన్.

"మళ్ళీ యితను టీజ్ చేస్తున్నాడా?"

"ఉహుం...మరే..." తడబడింది. అటువేపు చూసింది. ఈయనది నాన్న గారి వయస్సే. కొంచెం పోలికలూ ఉన్నాయి. బహుశా...నాన్నగారికంటే కొంచెం పెద్దే ఏమో.

"లిఫ్ట్ యిస్తాడుట ... రిక్షాలూ ఏవీ లేవు..."

"బోడి బండి. ఒకరికే పనికిరాదు. మీరు వొస్తే కారుంది..."

"మీకు శ్రమ... కాలనీకి వెళ్ళాలి."

"నేనూ అటే వెళ్లాలి. ఫరవాలేదు... రండి" అంటూ తలుపుతీసి పట్టుకుని– "ఈ చీకట్లో ఒంటరిగావెళ్ళడం క్షేమం కాదు. అసలే రోజులు బాగు లేవు" అన్నారు.

"థాంక్స్... కాని... మీకు చాలా శ్రమ..." అంటూనే ఆమె కారెక్కి- కూర్చుంది.

"ప్రేమించి, స్పైడర్." కాని కదులు తూంటే, శాలిని మోపెడ్స్ వేపు పోళనగా చూసింది. ఓ సాలెపురుగూ, నీ వల్లిన గూటిలో నేను చిక్కి నీకు బలికాలేను సుమా.

కారు పరుగెడుతూంది- కటికచీకటిని చీలుస్తూ... రోడ్డుని మింగుతూ.. ఈ కారు...యీ పెద్దమనిషి...ఆపద్బాంధవుడు తటస్థపడకపోతే తన గతి ఏమయ్యేదో అని ఆలోచిస్తూ భయపడుతూంది శాలిని. పగలు-కాంతిలో చూసే రోడ్లూ పరిసరాలే, యీ చిమ్మచీకటిలో కొత్తగా ఎంత భయంకరంగా ఉన్నాయి. ఎక్కడా జనసంచారమే లేదు!

"మీ పేరు "

"శాలిని-" చెప్పింది.

"మంచి పేరు-"

అదుగో తొలిగండం. అటూయిటూ చెట్లు...గుడిసెలు కూడా ఉండవు రోడ్డు పక్క. అరిచి గీపెట్టినా ఎవరూ పలకరు. ఇటువేపు వాహనాలుకూడా తరచుగా రావు.

కారాగిపోయింది—ఒక్క కుదుపుతో.

శాలిని ఉలిక్కిపడింది. ఆమె గుండె ఝల్లుమంది. అయినా - ఆయననిచూసి-ధైర్యం తెచ్చుకుని- వొణుకుతూనే అడిగింది. "ఏమైంది?"

"కారుకి ట్రబులు. ఒకోక్కసారి యిది యిలాగే ఆగిపోతూంటుంది. కొంతసేపటికి సర్దుకుంటుంది. దిగు..."

"అవతల చినుకులు."

"ఫరవాలేదు. కారుకి రెస్ట్ యిస్తేనే మళ్ళీ కదులుతుంది."

ఆమెకేమిటీ అర్థం కాలేదు. అతని మాటలు అయోమయంగానూ ఆశ్చర్యకరంగానూ ఉన్నాయి. అర్థరహితంగానూ ఉన్నాయి. కారుకి రెస్టెందుకు? అది పరుగెత్తినదెంత? విధిలేక - కారు దిగింది. ఆయన ఆమె పక్కకు వొచ్చి నిల్చున్నాడు. చినుకులు బాగానే పడుతున్నాయి. చీకటిగా ఉంది. అతను అగ్గిపుల్ల గీసి సిగరెట్ వెలిగించాడు. "చలేస్తోందా?"

"ఊఁ" అంది యింకేమనాలో తెలీక.

"వెచ్చదనం కావాలా?" నవ్వాడు. తెల్లబోయింది. ఏమిటతని ఉద్దేశం?

ఆమె మౌనంగా ఉండిపోయింది అతని ఉద్దేశమేమిటో, తనే సమాధానం చెప్పాలో తెలీక.

"మౌనం—అర్థాంగీకారం. నువ్వు... శాలినీ! గుడ్ గాళ్‌వి. ప్రెటీ గాళ్‌వి" అంటూ ఆమె భుజంచుట్టూ చేయివేసి దగ్గరగా తీసుకోబోయాడు.

నివ్వెరపోయింది శాలిని.

నిర్ఘాంతపోయింది శాలిని. జరుగుతున్నది నిజమని—నమ్మలేకపోతూంది.

ఇది — నిజమేనా? తన తండ్రికంటె పెద్దవాడు...గౌరవంగా హుందాగా కనబడుతున్న పెద్దమనిషి...తనకి మూడురెట్లు వయసున్న వృద్ధుడు...యిలాగ... నమ్మశక్యమేనా?

ఆ చెయ్యి భుజంమీంచి-పాములా... గుండెలమీదికి...

క్షుటిలో... ఆమె మెదడులో... తాను చదివిన వింత అయిన అమానుషాలు...

ఏడేళ్ళ బాలుడు - ఐదేళ్ళ పాపని బలాత్కరించాడు.

పది నెలల పసిపాప — చెరచబడి - చనిపోయింది.

అరవై దాటిన అవ్వపై — మాన భంగం. ఎనభై ఏళ్ళ వృద్ధుడు - ఎనిమిదేళ్ళ బాలికను...

చటుక్కున అతని చేతిని విసిరికొట్టి... "సిగ్గులేదూ? నీ వయసేమిటి, నా వయసేమిటి?" అంది పక్కకి — దూరంగా జరుగుతూ.

"సిగ్గెందుకూ ఆడామగల మధ్య? ఇక వయసంటావా, వయసుపిల్లముందు ఏ మగవాడయినా యువకుడే. నీలాటి దోరవయసు పిల్ల తటస్థపడితే యౌవనం వొస్తుంది ఎవడికైనా." నవ్వాడు.

"షటప్ ..." ఒక్క లెంపకాయిచ్చింది, అతని మాటలు ఆమెలో అతని మీద అంతవరకూ ఉన్న గౌరవాన్నీ, విశ్వాసాన్నీ అపోహలనీ పూర్తిగా నాశనంచేసి నిజం తెలిపే సరికి.

పరస్త్రీ ముందు - పురుషుడు నిత్య యౌవనుడట! నిజంగా ఎంత నిజం!

"అనవసరంగా గొడవ చెయ్యకు. బెట్టుచెయ్యకు. ముసిలివాడిననుకుంటున్నావేమో... ఓసారి రుచిచూస్తే నీకే తెలుస్తుంది. యీకాలపు కుర్రాళ్ళకంటె నేనే ఎక్కువ సుఖపెట్టగలనని, లోగడ అనుభవం లేదా? ఫరవాలేదు. మొదటి అనుభవమే — బోణీయే మంచిదని గ్రహిస్తావ్. ఆ కుర్రాణ్ని కాదనడంతో నువ్వు చాలా తెలివయినదానివీ అనుభవజ్ఞురాలివీ ఏమో అనుకున్నాను ఇక్కడ నిన్నెవ రాదుకుంటారని నీ ఆశ? చేసిన బెట్టు చాలుకానీ క్విక్‌గా కౌగిలిలోకి రా. నీ వయసూ సొగసూ చూసి ఆగలేకపోతున్నాను. తాళలేకపోతున్నాను. తొందరగా నువ్వు వెచ్చబడి నన్ను వేడెక్కించు హుషారుగా..."

రెండో చెంప ఛెళ్లుమనిపించి కాలిని అతనివేపు అసహ్యంగా జుగుప్సగా చూసి.

"నువ్వు ముద్దుకి పిల్లవి కావు. మర్యాదకి మనిషివి కావు. సినిమాలు చూసినా నీకు జ్ఞానం రాలేదు. కన్నెగుంటలు ముసిలి హీరోల వెంటపడడంలో అంతరార్థం గ్రహించలేకపోయావు. అమెరికాలో అమ్మాయిలు బాల్డ్ హెడ్స్‌నే ఎందుకు ఆశ్రయిస్తారో నీకర్థం కాదు. మళ్ళీ కాలేజి గర్ల్‌వి. నిన్ను రేప్‌చేయడం కంటె గత్యంతరం లేదనుకుంటాను." బెదిరిస్తున్నట్లు ముందుకి అడుగువేశాడు.

"ఏడిశావ్... ఇందుకేకాబోలన్నారు భారతంలో... వృద్ధుల బుద్ధులు సంచలించవే... అని. సినిమా చూసి నవలలు చదివీ భ్రాంతిలో ఉన్నావేమో. ఆరోగ్యంగా ఉన్న ఆడదాన్ని ఒక మగవాడు ఎన్నటికీ రేప్ చెయ్యలేడు. నీలాటి ముసిలాడు నన్ను రేప్ చెయ్యగలగడమా! ఊంచిపెట్టి ఒక్కటి వేశానంటే ఊర్ధ్వ లోకం కనబడుతుంది."

"అదంతా ఎందుకులే. ఒక్కసారి నాతో అనుభవంచూసావంటే రాత్రంతా యిక్కడే ఉండి పోదామంటావు నువ్వే. ఒక్కసారి చూడు. తరువాత నీ యిష్టమే."

# క్రిస్మస్

చూస్తుచూస్తు క్రిస్మస్ పండుగ రానే వచ్చింది ఎక్కడచూసినా క్రిస్మస్ విందులు, వేడుకలు, బహుమానాలు, సొంపైన సందేశాలు, ఇంపైన సంగీతం, వెల్లవేసిన గోడలతో, రంగురంగుల కాగితాలతో క్రొవ్వొత్తుల వెలుగులో ప్రతి ఇల్లు కళకళ లాడుతుంది అయితే విచారించ వలసిన విషయమేమిటంటే చాలా మంది క్రైస్తవులు క్రీస్తు ప్రభువును పక్కకునెట్టి వట్టి పండుగను ఆచరిస్తున్నారు ఆనాడు బెత్లెహేములో క్రీస్తు జన్మించినప్పుడు తొట్టిలో పరుండ బెట్టేరని వ్రాయబడి యున్నది ఈనాడు కూడా అనేకుల హృదయ మందిరములో క్రీస్తు తప్ప మిగిలినవన్నీ ఉన్నాయి పుట్టినరోజు పాపాయిని విడిచిపెట్టి కేవలం పుట్టిన రోజు వేడుకలు చేసుకుంటున్నారు ఈ అట్టహాసం, ఆడంబరంలోపడి ఎంతో మంది క్రిస్మస్ యొక్క అసలు అర్థాన్నే విస్మరిస్తున్నారు క్రిస్మస్‌పండుగ దినాలలో జంటనగరంలోని పెద్దపెద్ద హోటల్సును చిత్ర విచిత్రంగా అలంకరిస్తారు

రాజాధిరాజు, ప్రభువులకు ప్రభువైన యేసుక్రీస్తు తన దైవత్వాన్ని నిరూపించుటకు అనేకమైన సూచనలను భూలోకానికి ఆనాడు అనుగ్రహించాడు

తన కిష్టులైన మనుష్యులకు భూమిమీద సమాధానం కలుగజేస్తూ క్రీస్తు జన్మించాడు తన్ను కష్టపెట్టిన మనుష్యులను క్షమిస్తూ శిలువ మ్రానుమీద ఆయన మరణించాడు ఈ సమాధానం, క్షమాగుణం ఏసు క్రీస్తునందు విశ్వశించిన వారికి అపూర్వమైన స్వార్ధం అయితే నీతిసూర్యుని కిరణ కాంతిని ప్రక్కకు నెట్టి క్రొవ్వొత్తుల వెలుగులో పండుగను ఆచరించే వారికి ఈ రెండూకూడా కరువయ్యాయి పాపములో నశించుచున్న మానవాళికి దేవుడనుగ్రహించిన విలువైన కానుక ఏసుక్రీస్తు క్రీస్తుని నిజముగా చూచినవారు అనుసరించేది క్రొత్త మార్గం అది పరిశుద్ధ మార్గం అది అపవిత్రులు పోకూడని మార్గం ఎందుకనగా క్రీస్తుని చూచిన వాడెడ నూతనసృష్టి పాతవన్నీ గతించును సమస్తము క్రొత్త దగును ఈ పండుగ సమయములో క్రీస్తుని పొందియున్నారా!

---

"అనుభవానికి వాదిఉంటే- నీతోనా! నాఖర్మ అంతకాలలేదు ఇంత బ్రతుకూ బ్రతికి యింటి వెనకాల చచ్చిందని-!"

"డార్లింగ్ .. ప్లీజ్..."

ఇంతలో కారులోంచి కేక "ఇంకా కాలేదూ నీరౌండు?"

"గ్రౌండుకే రాలేదు రౌండెక్కడ?" విసుగ్గా చెప్పాడు "బిగ్ బ్రదర్. .నీ హెల్ప్ కావాలి గుంట బెట్టు చేస్తూంది లొంగడమూలేదు, వొంగడమూలేదు"

శాలిని త్రుళ్ళిపడింది వెనక సీట్లో మరొకడున్నాడా యితని అన్న? ఇవీ వీళ్ళ అసలు రూపాలు, పెద్దమనిషి తరహాలూ? ఎంత నీచులు! ప్రణాళికవేసి- తనని వశపరచుకోదలచుకున్నారా! వీళ్ల బుద్ధులేమిటి? వయస్సుని కూడా నమ్మ రాదన్నమాట యీ కాలంలో

ఎంత ముసిలాళ్ళయినా వాళ్ళిద్దరు తను ఒక్కతే అయితే వాళ్ళని తను జయించడమూ నిగ్రహించడమూ కష్టం అసాధ్యమే ఏమో, ఆ రాస్కెల్స్‌కి దూరంగా-పారిపోవాలి

తనని పట్టుకున్న చెయ్యి కొరికేసింది చటుక్కున అతను అరిచి- ఆమెను వొది లేశాడు

శాలిని యిదే అదునని పరుగెత్త బోయింది

చీకటి .. బాగా కనిపించడం లేదు రెండో స్కౌండ్రల్ కాబోలు— పరుగెత్తు తున్న తనకి కాలడ్డం పెట్టాడు. బోర్లా పడిపోయింది చేతులడ్డం పెట్టుకుని— దెబ్బతగలకుండా కాపాడుకో గలిగింది కానీ...

ఆ స్కౌండ్రల్ ఆమెమీద కూర్చుని లేవకుండా అదిమిపెడుతూ .. "కమాన్ యంగ్ బ్రదర్ .. ప్లేన్‌లాండయింది" అంటూ ఆనందంగా పిలిచాడు అతను వొచ్చేశాడు ఇద్దరూ కలసి తనచేతులు కట్టేశారు, నోట్లో గుడ్డకుక్కారు కాళ్ళు రెండూ కలిపి పట్టుకుని .. తేల్చి. . మోసుకు పోతున్నారు ఎక్కడికి?

ఆమె పూర్తిగా నిస్సహాయురాలై పోయింది అరవటానికి కుదరడంలేదు అమెకు దుఃఖంవొస్తోంది చివరికి జరుగుతున్నదిదా! తను సర్వ నాశనం కాబోతూందా? ఇంక తనపని ఐపోయినట్లేనా?

ఒంటరిగా సినిమాకి వొచ్చినందుకు— యింతశిక్షా! ఇంతనీచంగా ముగుస్తూందా తన కన్యాత్వం? అయ్యో... యిలా జరుగుతుందని ముందు తెలిస్తే.. శీలం కోల్పోవడమే తన నొసట వ్రాసిఉందని ఏమాత్రమయినా పసిగట్ట గలిగితే... అసలు సినిమాకే వొచ్చేది కాదు వొచ్చినా యీ కారుని నమ్మేదికాదు తను మోసపోయింది భంగపడుతూంది ఎలాగూ శీలం పోవడమే తప్పనిసరి ఏతే అది- యీ ముసిలి తొక్కల చేతులలో కంటె ఆకుర్ర యీప్‌టీజరు చేతుల్లో అయితేనే నయమేమో మూడేళ్లు సాముచేసి మూల నున్న ముసిలి ముండను కొట్టాడన్నట్లు- తన అందం. . పరువం . కన్యాత్వం వీళ్ళ పాలవుతుందా? ముసిలివాళ్ళు రేప్ చేశారంటే తనకీ తన యీడుకీ ఎంత అవమానం! ఛీ!... వీళు ఎంతకి తెగించారు అందుకే అన్నారేమో ఆడదాని చూడ- బ్రహ్మకయిన పట్టు రిమ్మ తెగు




లని. పసిపాపయినా... పండుముదుసలయినా పురుషుడయితే చాలు ఆడదానికాగర్భ శత్రువే అన్నమాట.

రోడ్డుపక్క- డొనులో... పచ్చిక మీద పడేశారు శాలినిని.

ఓ ముసిలాడు ముఖంమీదకి వొంగి- ముద్దు పెట్టుకోబోతూంటే...

రెండోవాడు కాళ్ళమీద చీరెను తొలగిస్తూ...

ఛీఛీ...

ఈ నీచం... యీ అవమానం జరగక ముందే తన ప్రాణాలు పోతే ఎంత బాగుండును! దేముడా!... నువ్వు నన్ను రక్షించనక్కర్లేదు. వాళ్ళు మరుక్షణంలో నన్నవమానించ లేకుండా-యీక్షణమే- నన్ను చంపెయ్. అబ్బ!... ఇతనినుంచి వొస్తున్న ముసలి కంపు... అబ్బ!... అతని ముసలివేళ్ళు వెధవపాము పిల్లల్లా. గొంగళీల్లా... తొ డ ల మీదకు... అయ్యో...

చూడలేనట్లు... భరించలేనట్లు ... గట్టిగా కళ్లు మూసుకుంది.

క్షణాలు గడుస్తున్నయ్.

జరగదేం. ఏమీ జరగదేం?... అవి ఆనందమూ ఆశ్చర్యమూ కలిగేంతలోనే ఫట్ ఫట్‌మని చప్పుడు... తనకి విముక్తి. కళ్లుతెరచి చూస్తే... యిద్దరు ఓల్డ్‌మాన్సూ చెరోపక్కకీ పడున్నారు. ఎవరో తన చేతులు కట్లు విప్పి... నోటిలో గుడ్డలు తీసి... నిజమా? కల కాదుకద? ఇది నిజమే ఐతే భాగ్యలక్ష్మి లాటరీలో మొదటి బహుమతి రావడం కంటె కూడా ఆశ్చర్యమూ, అదృష్టమూ కాదూ? ఇది— దైవమాయే కాదూ?

"లేవగలరా. చేయి ఊతయిచ్చేదా?" జాలిగా... దయగా...

ఐతే- నిజమేనన్న మాట. తను ఎంత అదృష్టవంతురాలు!

ఎవరీ దేముడు? ఎవరీ దయామయుడు? చీకట్లో... కనిపించడంలేదు.

**రచయితలకు కార్టూనిస్టులకు మనవి**

తాము మా కార్యాలయానికి పంపిన రచనలకు మేము తిప్పిపంపే విషయమై ఎట్టి బాధ్యత తీసుకోలేము. ప్రచురణకి ఆమోదించబడని రచనలు తిప్పిపంపే విషయమై ఎట్టి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. రిజిష్టర్డు పోస్టేజీ, స్వంత చిరునామా గల కవర్లు జతపరచిన నవలల విషయంలో మాత్రం బాధ్యత వహించగలము. ॥సం॥

అతని చేయిపట్టుకుని మెల్లగా లేచి కూర్చుంది "ఎవరు మీరు? నన్ను కాపాడ టానికి వొచ్చిన దేముడు... ఎవరు?.."

"దేముణ్ని కాను, దెయ్యాన్ని కాను. మనిషిని. మీ- శత్రువుని. లేచినిలబడ గలరా?"

"ఊ.." అంటూ అతి కష్టంమీద లేచి నిలుచుంది.

"గాయాలయ్యాయా?" ఆకంఠంలో ఆతృత... ఆప్యాయత... అభిమానం. ఆమెకు సిగ్గు కలిగింది.

"లేదు. తాబోయి తప్పిన గాయం ముందు- అయినవి అసలు గాయాలే కాదు. మీకు చాలా థాంక్స్"

"శత్రువుకి కృతజ్ఞతలు చెబుతారా ఎవరయినా? మీరు- మోపెడ్స్... దొక్కు బండే అనుకోండి... కూర్చోగలిగితే... మీయింటి దగ్గర విడుస్తాను. కొంచెం విశ్రాంతి అవసరమనుకుంటే - ఆగే వెళ్దాం."

"ఫరవాలేదు, కూర్చోనగలను, మీ ఆసరాతో. కాని... చిన్న రిక్వెస్టు..."

"ఏమిటి?"

"మరేమీ లేదు. మీరు - జరిగినది మరచిపోండి."

"అది చేయవలసింది నేను కాదు, మీరు. ఈ పాడు సంఘటన నెంత తొందరగా మరచిపోగలిగితే అంత మంచిది."

"అలాగే."

అతను చాలాజాగ్రత్తగా సున్నితంగా వెహికల్‌మీద కూర్చోబెట్టాడామెను.

ఆమె కసౌకర్యం కలగకుండా మెల్లగా నడపసాగాడు బండిని. అతని భుజాలు పట్టుకుని...వీపుమీద ఆనుకుని నిస్సంకోచంగానూ నిర్భయంగానూ కూర్చున్న శాలిని ఒక్క నిముషంలోనే తేరుకోగలిగింది.

"సినిమాలో హీరోలా సరిగ్గా సమయానికెలా రాగలిగారు? అసలు మీకిలా రావాలని ఎందుకు బుద్ధిపుట్టింది?" అడిగేసిందామె తనమనసులోని అనుమానం.

"నమ్మగలిగితే చెబుతాను. సిక్స్‌త్ సెన్సూ ఏమీకాదు. ఇంటికి బయలుదేరి కొంతదూరం వెళ్ళానో లేదో మీరు సురక్షితంగా చేరగలరోలేదో అని అనుమానం వొచ్చింది."

"ఎందుకని?"

"సెంటిమెంటేమో. మీ మీదా మీ క్షేమంమీదా ఆత్రుత. తెలిసినతనంవల్ల




కావొచ్చు నేను మీకు శత్రువునే అయినా యీ శత్రుత్వం వెనుక తెలిసినతనం ఉంది కదా? తెలిసినవాళ్లు - శత్రువులే అయినా - దానిలో స్నేహమూ ఒకరిపట్ల ఒకరికి ఆత్రుతా ఉంటాయనుకుంటాను మీరు కారెక్కినవారు - స్నేహితులే కావొచ్చు. కాని ఆ స్నేహంలో తెలిసిన తనమూ లేదు ఆ స్నేహానికి వయసూ లేదు ఆయన పెద్దవాడే అయినా రోజులు సరిగా ఉండడంలేదు వయసునీ, పోలీసులనీ కూడా నమ్మడానికి లేకపోతూందని పేపర్లు ప్రచురించే వింత వార్తలే చెబుతున్నాయి. అవి మెదడులో మెదిలి-భయమూ అనుమానమూ వేసింది, వెనక్కి తిరిగి వొచ్చాను అలా రావడమూ మం చిదే అయింది సరిగ్గా సమయానికి రాగలగడం - వాళ్ళ దురదృష్టమేమో"

"నా అదృష్టం"— ఆమె కృతజ్ఞత నిండిన కంఠంతో అంది "మీ ఋణం ఎలా తీర్చుకునేది?"

"వొద్దు శత్రువుతో ఎవరూ అలా మాట్లాడరు. శత్రువుకి ఋణమూ తీర్చరు"-

"ఎంతమాత్రమూ మీరు శత్రువు కారు, స్నేహితులు అంతకంటే ఎక్కువ..."

"ఉహుఁ.. ఇలాగే తెలిసిన శత్రువులా ఉండడమే నాకిష్టం. మీ యిల్లు వొచ్చేస్తూంది ఇంట్లో-చిన్న ప్రమాదమని తప్ప నిజం చెప్పకండి వాళ్ళు కంగారుపడతారు ముందుముందు మీ స్వేచ్ఛకరికట్టబోతారు"

"ఉహుఁ" అని యింట్లోకి నడిచింది శాలిని

ఆమెకు జరిగినదంతా కలలాగ ఉన్నది అదంతా నిజమేనా? వయసు మళ్ళిన వృద్ధులు-ప్రణాళిక వేసుకుని మరీ తనని చెరచబోతే-వయసూ, వేడిలో ఉన్న యీ ఓటీజరు తనని సమయానికి రక్షించి యిల్లుచేర్చారు సురక్షితంగా! రెండూ వింతయీ విడ్డూరాలుగా వినవచ్చిన వార్త కాదూ యిది!

యౌవనంలో ఉండే స్వచ్ఛతా స్వాతి కమూ వయసుమీరాక ఉండవుకాబోలనుకుంటూ తలుపు తట్టసాగింది శాలిని

# మీరో తప్పు చేస్తారా?

## కోడుకొండ, సత్యానంద

రంగనాధంగారు ఆరోజు ఒక కథ చదివారు... ఆ కథపేరు 'నాకథ'... దాన్ని వ్రాసిన రచయిత పేరు మధు... ఆ కథే అతన్ని ఆలోచింపజేసింది ఆ కథలోని ఆఖరు ఉత్తరమే అతన్ని ఆలో చనల్లోకి దింపింది... ఆ కథలో-

ఒక నిరుద్యోగి ఉన్నాడు... అతనికి ఒక పేరుంది... ఆ పేరు అందంగా, అర్ధవంతంగా వుంటుంది... ఆ పేరు లాగే అతను కూడా అందంగా ఉంటాడు... అతనికి 'మంచి' కుర్రాడు అనే మరో పేరు కూడా ఉంది... తెలివైన కుర్రాడు అని అనుకుంటారు చాలా మంది...

అతని దగ్గర యూనివర్సిటీ ఇచ్చిన గోల్డ్ మెడల్ ఉంది... అతనికి దాని మీద ప్రేమ, గౌరవాలు ఉన్నాయి

వీటన్నింటితో పాటూ అతనికి రిటైర్డైన తండ్రి ఉన్నాడు... మంచం దిగలేని తల్లి ఉంది... పెళ్ళికి ఎదిగిపోయిన ఇద్దరు చెల్లెళ్ల ఉన్నారు... లోకం తెలియని ఇద్దరు తమ్ముళ్ళున్నారు.

తనకేమీ మిగల్చని తండ్రి మీద అతనికి కోపం లేదు... తన తాహతుకు మించి తన్నింతవరకూ వడిఎంచాడన్న కృతజ్ఞతా భావం, ప్రేమాభిమానాలు ఉన్నాయి...

అతనికి కోపం, కసి ఉన్నాయి... ఇంటర్వ్యూలకి వెళ్ళినప్పుడు పిచ్చి పిచ్చి ప్రశ్నలడిగి, వెకిలి నవ్వులు నవ్వి, వెరీగుడ్ కానీ, సారీ... అనే మనుష్యుల్ని చూసినప్పుడు ఆ రెండూ అతనిలో ఉప్పొంగి పోలాయి...

వాటిని అదుపులోకి తెచ్చుకోవడం అతనికి చాతనౌను...

నూరు రూపాయలు ఖరీదు కలిగి అందంగా, సుతారంగా ఉండే చెప్పులు అతనికి లేవు... కర్ర క్రింద లారీ టైరు ముక్క అందించిన చెప్పులే అతనికి ఉన్నాయి... అతను పొడవుగా కన్పించడానికి గానీ, ఫ్యాషన్‌గా ఉంటుందని గానీ వాటిని వేసుకోవడం లేదు... వేసుకొని ఎంత తిరిగినా అవైతే అరగవని అతని ఆలోచన...

ఈ మధ్య అతనిలో విసుగు, వైరాగ్యం, చికాకు విరక్తి పెరుగుతున్నాయి ఎందుకంటే అతని కింకా ఉద్యోగం రాలేదు... తల్లి ఇంకా మంచందిగలేదు... చెల్లెళ్ళకు ఇంకా పెళ్ళి కాలేదు. తమ్ముళ్లు తెలియక అల్లరి పెడుతు



న్నారు . అంతకన్నా. వాళ్ల కడుపుల్లో ఆకలి నాట్యం చేస్తోంది.

తన వాళ్ళకు తన ముఖం చూపించలేక పోతున్నాడు. .

ఇవి చాలవా ఏ (సంస్కారం, మనసు, ఆదర్శాలు ఉండి బాధ్యతను పట్టించుకొనే) మనిషికైనా విసుగు, వైరాగ్యం, చికాకు, విరక్తి పెరగడానికి? ఓర్పు అంతా అయిపోయిన మనిషికి?

అతనికి ఓర్పు ఉంది. . చాలా ఉంది . కానీ దానికి అంతు అన్నది ఒకటుంది మరి!

ఒకరోజు అతనికి ఉద్యోగి అయిన ఒక స్నేహితుడు ఓ సలహా ఇచ్చాడు.. డబ్బు తప్ప మిగిలిన సహాయాలు చేస్తానన్నాడు

" వద్దురా సారీగా "అన్నాడు

"ఒరే! ఆదర్శం ఆకలిని చంప

నేడు... కసీసావసరాలు తీర్చని ఆ ఆదర్శాల గొడవ నీకెందుకురా? నీ సమ స్యలు తీరిపోవడానికి ఆదర్శం ఒక గొడ్డలి పెట్టు... సారీ అనకు... సరే అను... ఐవిల్ షోదెమ్... కమాన్!" అన్నాడు ఆ స్నేహితుడు...

లొంగిపోయాడు... ముందుకు కది లాడు...

అతనను కున్నట్లు లోకం పచ్చగా లేదని తెలిసి అతని కళ్ళు పచ్చ బడ్డాయి...

బేరాల తతంగం ఎంప్లాయిమెంటు ఆఫీసులోనూ, ఉద్యోగం ఇచ్చే ఆఫీసు లోనూ ముగిసాయి... బేరాల సంఖ్య వేల సంఖ్యలో ఉంది...

అతనొక నిశ్చయాని కొచ్చాడు... నా గోల్డు మెడల్నీ, నా పుస్తకాల్ని, నేను గెలుచుకున్న వెండికప్పుల్ని కొం చెం సామాన్లనీ అమ్మితాను 'నాన్న! అని తండ్రిని అడిగాడు... తండ్రి 'సరే' అని అనలేకపోయాడు...

కానీ, పొంగుతున్న కన్నీటి పరదను అనకట్టవేసి ప్రక్కకు తిప్పిన తలను 'సరే' అన్నట్లుగా ఊపాడు...

జేబు నిండుగా ఉన్న నోట్ల కట్టను జాగ్రత్తగా పట్టుకొని బల్ల క్రిందుగా అందివ్వడానికి బయలు దేరాడు... నడు స్తుంటే అతని ఆత్మ ఏదో అంటుంది... తను కూడా ఏదో అనబోయాడు...

కానీ, అంతలో ఆదర్శాల కడలిలోని కెరటాలు ఉవ్వెత్తున లేచాయి... వాటి ధాటికి తట్టుకోలేక పోయాడు...

ఆదర్శాలకు అతని ఆత్మకు ఘోరాతి ఘోరంగా యుద్ధం జరిగింది...

నడుస్తున్న అతను దారి మా ర్చి పోయాడు...

తనింట్లో ఎన్నాళ్ళ నుండో లేని బియ్యం, కూరగాయలు, పప్పులు... మిగతా ఆహార పదార్థాలన్నీ కొనేసాడు తన దగ్గరున్న డబ్బుల్తో...

తెలిసిన రిక్షా వాడ్ని పిలిచి, ఆ సామానంతా అందులో పెట్టి... 'మా ఇంటికి తీసుకొని వెళ్ళిపో!' అని ఆ రిక్షా వాడికి మిగిలిన చిల్లర ఇచ్చేశాడు... అతనో నిర్ధారణ కొచ్చేసాడు...

అది విని ఆత్మ రెచ్చిపోయింది... "ఏమిటి? నువ్వు చేస్తున్నదేమిటి? ఇది ఘోరం! ఇది పాపం! అన్యాయం కూడా!..." అని చిందులు వేసింది...

అతను ఏమీ మాట్లాడలేదు...

మనసును తీసి దూరంగా పారేశాడు. ఆత్మను ఫెళ్ళున ఓ చెంపదెబ్బ కొట్టా డు... ఆలోచనల్ని కట్టేసి ఆకాశంలోకి విసిరేశాడు...

అతనికిప్పుడు చాలా హాయిగా ఉంది ఎంతో తేల్లగావుంది...ఒంటినిండా ఉన్న కట్లేవో విడిపోయి స్వేచ్ఛగా ఉన్నట్లని పించింది...

బ్రతుకును స్వేచ్ఛగా; హాయిగా గడ పాలనుకున్న అతను ఇప్పుడవి లభించినా బ్రతుకలేడు... కారణం, అతను బ్రతి కితే దూరంగా పడిపోయిన మనసు మళ్ళా తిరిగొచ్చేస్తుంది... చెంపదెబ్బ తిన్న ఆత్మ తేరుకుంటుంది.. ఆకాశం




లోని ఆలోచనలు మళ్ళీ అతని మెదడు పరిధిలోకి వచ్చి వీరవిహారం చేసి అతని మెదడును చీల్చి చెండాడుతాయి...

అందుకే అతను బ్రతకాలనుకోలేదు.

"ఇదే ఆఖరు నిమిషం" అని అనుకుంటున్న అతని చేయిని ఓ చల్లని చేయి పట్టుకుంది... ఆశ్చర్యంతో వెను తిరిగి చూసాడు...

"......స్వప్న......"

ఆ బీదవాడిని, ఆ నిరుద్యోగిని ఆ అమ్మాయి ప్రేమించింది...

తప్పన్నట్లుగా తలూపి...రా...అని సైగ చేసింది...

అతను ఒకే ఒక్క ప్రశ్న వేశాడు ఆమెను...

నువ్వొ వస్తావా? నన్ను వెళ్ళిపొమ్మని అంటావా?"

ఆమె అతని కళ్ళలోకి సూటిగా చూసింది...

"...వస్తే రావొచ్చు..." అన్నాడతను...

అంతే! మరుక్షణంలో గోదావరి గలగల శబ్దంలో అతని ఉచ్ఛ్వాస నిశ్వాసలు కలిసిపోయాయి... ఆ అమ్మాయి ఆగలేకపోయింది...

దడదడలాడుతున్న గుండెల్లో పరుగు పరుగున పారి పోయింది...

ఈ కథను చదివి రంగనాథంగారు అంతలా ఆలోచిస్తున్నారు అని కదూ మీరనుకుంటున్నారు? కాదు... ఇది క్రొత్తకాదు... వింత కథ అంతకంటే కాదు... ఇది ఒక మామూలు కథ...

కానీ మధు వ్రాసిన కథలోని శైలి భావాలు, తనెప్పుడూ అనుభవించక పోయినా, ఒక నిరుద్యోగి ఎంతలా బాధ పడతాడో అన్న విషయాన్ని కళ్ళకు కట్టినట్లుగా వ్రాసాడు...

నేనే ఆ పరిస్థితిలో ఉంటే? అని ఊహించుకున్న వాళ్ళు గజగజా వణికి పోయేలా వ్రాసాడు...

కానీ, రంగనాథం గారు ఆలోచించేది ఆ కథ తర్వాత ఉన్న ఒక ఉత్తరం గురించి... ఆ వుత్తరం గురించే అతనంతలా ఆలోచిస్తున్నారు... ఏదో చెయ్యాలని తహతహలాడుతున్నాడు...

రంగనాథం గారు మెల్లగా ఆ ఉత్తరాన్ని చదవడం మొదలుపెట్టారు...

"రెస్పెక్టెడ్ రీడర్.. నమస్కారం!

మీరు ఈకథ పేరు చూసే వుంటారు ఈ కథను వ్రాసినతని పేరుకూడా చూసే ఉంటారు...

నేనిప్పుడు ఎక్కడికి వెళ్తానో మీకు తెలుసా? పోస్టాఫీసుకి... ఎందుకో మీరు

ఊహించొచ్చు.. ఈ కథను పోస్ట్ చేయడానికి ఆ తర్వాత ఎక్కడికి వెళ్తానో తెలుసా? ఎంప్లాయ్‌మెంటు ఆఫీ స్‌కు ఎందుకని ప్రశ్నార్థకంగా ముఖాన్ని పెట్టి ఆలోచిస్తున్నారు కదూ? ఎందుకేమిటి? ఎంప్లాయ్‌మెంట్ ఆఫీస్‌లో ఓ క్లర్కునో, ఓ ఆఫీసర్నో కాకాపట్టి, బేరం కుదుర్చుకొని ఆ ఉద్యోగానికి కాల్ రప్పించడానికి...

ఆ తర్వాత ఎక్కడికి వెళ్తానో తెలుసా? ఆ ఉద్యోగం ఇచ్చే మనిషి దగ్గరకు... ఎందుకో మీకు తెలిసే ఉంటుంది... అక్కడ కూడా బేరం కుదుర్చుకోడానికి—

ఛీ! ఇంత సేపూ 'పెద్ద' కబుర్లు చెప్పావు... నీకు బుద్ధిలేదూ? నీ మనసు ఎలా అంగీకరిస్తుందయ్యా ఆ పని చేయడానికి...? రాతలు వరకేనా? చేతలు చేయలేవా? అని మీరు కళ్ళెర్రజేసి, కోపంగా, ఉక్రోషంగా, ఉద్రేకంతో అనొచ్చు...

నాకూ కోపం వస్తుంది... ఉక్రోషం పెరిగిపోతుంది...

నేను వ్రాసింది కథ... నేను అనుభవిస్తున్నది జీవితం...

కథకోసం జీవితాన్ని వదులుకోమంటారా? ఊహు... నేను వదులుకోలేను. కథలో వ్రాయని బంధాలు, బాధ్యతలు నాకెన్నో ఉన్నాయి... నాకూ బ్రతుకు మీద ఆశ ఉంది... వాటిని నేను వదులుకోలేను... అయితే ఈ కలాన్ని విసిరేయంటారా?... ఒకే... అది చేయడానికే ప్రయత్నిస్తాను... నా కోపాన్ని కాగితాలమీద కక్కేసి అప్పుడే కలాన్ని విసిరేస్తాను.

కానీ, నన్నంటే అలా అడగ్గలరు కానీ, నాలాంటి వాళ్ళెంత మందో ఉన్నారు... అందర్నీ అడగ్గలరా?... మీరు అడగలేరు... అది నాకుతెలుసు. ఎందుకంటే అందరూ నాలాగ చెప్పుకోరు కనుక!

జీవితాన్ని అనుభవించడానికి మనిషి ఎన్నో అన్యాయాలు చేస్తున్నాడు... తన కలల్ని నిజంచేసుకొనడానికి ఎన్నో అక్రమాలు చేస్తున్నాడు...

కనీసం బ్రతగ్గలగడం అన్నది నా ఆశ...అందుకు నేను చేసింది అన్యాయమా? అది అన్యాయం అని మీరన్నా, అది చేయకపోతే నేను అన్యాయం అయిపోతాను... ఎప్పటికీ నాకు ఎంప్లాయ్‌మెంటు కాల్ రాదు... ఎప్పటికీ నాకు ఉద్యోగం రాదు...

నేను చేసేది అన్యాయం అని ఇంకా అంటున్నారా?

అయితే నేనడిగే ప్రశ్నకు సమాధానం చెప్పండి!

## మీరు నాకు ఉద్యోగం ఇప్పించగలరా?

ఆ ఉత్తరమే ఆయన మనసు కుదిపేసింది...

ఆ కథ, ఆ కథతో పాటూ ఆ ఉత్తరాన్ని కూడా ప్రచురించిన పత్రికను మనసులో అభినందించారు...చాలా సేపూ ఆలోచించి ఆయనో నిర్ణయానికి వచ్చారు... ం ం

హోటల్ మెనూ

వరదల వల్ల రేట్లు పెంచటమైనది. కష్టమర్లు సహకరించ ప్రార్థన

| | | రూ. పై. |
|---|---|---|
| పుట్టి ఇడ్లీ | జత | 3-00 |
| చట్నీతో | | 4-00 |
| స్పూన్ సాంబార్ | | 0-50 |
| దోసె (మీడియం సైజు) చట్నీతో | | 3-00 |
| గారె (పది చిల్లులతో) | జత | |
| పూరి | | |

చిరంజీవి మధుకి...

నా పేరు రంగనాథం... ఈవారం కల్పన పత్రికలో పడిన నీవు వ్రాసిన 'నా కథ'ను చదివాను... ఆ కథలోని నీ భావాలు, మానసిక విశ్లేషణ, నిరుద్యోగి పడే కలత నా కళ్ళకు కట్టినట్టుగా వ్రాసావు నీ రచనావిధానాన్ని మెచ్చుకోలేకుండా ఉండలేకపోతున్నాను...

నీ కథలో నీవు ఆఖర్న వ్రాసిన ఉత్తరం నన్ను కుదిపేసింది... నీ జీవితాన్ని నీవే కథలోకి చొప్పించి, నీవు పరిస్థితులకు లోబడి చేయబోయేపనిని . ఎంత ధైర్యంగా వ్రాసావు? సంస్కారంలో నిజాన్ని వ్రాసావు ... అలా అందరూ చేయరేమో అని అనుకుంటున్నాను...

ఆ కథ చదివాక నాకో ఆచలోన తట్టింది...అదేమిటో చెప్తాను...నామాట కాదనవు కదూ!? నాకో ఫ్యాక్టరీ ఉంది.. అడ్రస్సు ఈ కాగితంపైన ఉంది...ఈ అడ్రస్సుకు నీవు అప్లయి చేయి...అసి స్టెంటు పోస్టు నీకు యిస్తాను... జీత అరొందల ఇస్తాను...నీవు మరోవిధంగ అనుకొని అభిమానపడకు..."ఆ పని' మాత్రం చేయకు సుమా!? నీవు రః యితవు.. తప్పటడుగు వేయకు... ఇి రికమండేషనో, జాలి అనో అనిమాత్రం అనుకోకు... ఎంతమాత్రం కాదు... ! చదువులకు, నీ తెలివితేటలకు నేను చేయ గలిగే కనీస న్యాయం! నీ చదువుకితగ్గ పొజిషన్‌కి నీ తెలివితేటల్ని పనిలో ! సమర్థతను చూసి ప్రొమోట్ చేస్తాను..

నువ్వు నాకంటె చిన్నవాడివన్న ఉద్దే శంతోనే ఏకవచన ప్రయోగంచేసాను. .

రంగనాథం...

ఉత్తరం వ్రాయడం పూర్తిచేసి మరొక్కసారి చదువుకొని, తృప్తిగా, ఆనందంగ నిట్టూర్చారు...దాన్ని మధు పేరన కల్పన పత్రికకు పంపారు...

o o o

ఆగని కాలం, ఎవర్నీ పట్టించుకోని పది రోజులు పరుగులు తీసింది...

రంగనాథంగారు మాత్రం ఆతృతగా ఎదురుచూస్తున్నారు...కానీ, ఈ రోజు మాత్రం పోస్ట్‌మాన్ అతనికో ఉత్తరాన్నిచ్చాడు... ఉత్తరం ఇంటికి వచ్చిందంటే ఖచ్చితంగా అది బంధువులదగ్గర్నుండి గానీ, మధు దగ్గర్నుండి కానీ వచ్చినదై ఉంటుంది... అని అనుకొన్నారు... కవరుమీద రంగనాథంగారి అడ్రస్సుమాత్రమే ఉంది...రంగనాథంగారు గబగబా కవర్ని విప్పి లోపలున్న కాగితాన్ని తీసి చదవడం మొదలు పెట్టారు...

గౌరవనీయులైన శ్రీ రంగనాథం గారికి నమస్సులు

మీరు వ్రాసిన ఉత్తరాన్ని కల్పన పత్రికవారు నాకు పంపించారు. చదివి చాలా సంతోషించాను. కానీ, ఆ సంతోషంలోంచి ఒక్కసారి దుఃఖం పెల్లుబికింది. "నా కథ" మీవంటి ఉన్న తుల్ని కదిలిస్తుందని, మీ మనసును కదిలిస్తుందని నేననుకోలేదు. కారణం జీవితాన్ని ఆనందంగా అనుభవిస్తున్నవాళ్ళు ఇటువంటి కథల్ని, కష్టాల్ని పట్టించుకోరు. కష్టాల్లో ఉన్నవారు చదివినా ఇదీ ఒక కష్టమేనా? అని నీరసంగా నవ్వుతారు. లేకపోతే, తాను ఏ సాయం చేయలేక భారంగా ఓసారి నిట్టూర్చి ఊరుకుంటారు.

క్రాంతి చనిపోయాడు. కానీ, మధు కూడా బ్రతికిలేడు.

మధు రచయిత. అన్ని పాత్రల్నీ అన్ని కోణాల్లోంచీ ఆలోచిస్తాడు. తను సృష్టించిన పాత్రను చంపేసాడు. తాను కూడా చచ్చిపోయాడు.

వాడు పోయాక వాడి సొరుగులో దీన్ని చూసి కల్పన పత్రికకు పంపించాను వాడి పేరన. ఆ పత్రికవారు దీన్ని ప్రచురించారు. వారికి నా కృతజ్ఞతలు కూడా తెలిపాను. ఇంతకూ నేనెవర్నో చెప్పలేదు కదూ!? నేను మధు తండ్రిని.

ఎదురుగా కన్పిస్తున్న మమ్మల్ని చూసి ఆదర్శాల, బాధ్యతల మధ్య వాడు నలిగిపోయి మాకు దూరమైపోయాడు. బ్రతకలేక, చావలేక జీవచ్ఛవాల్లా పడివున్న మాకు మీరో సహాయం చేయాలి. మధుకి ఇస్తానన్న ఉద్యోగం మా పెద్దమ్మాయికి ఇవ్వమని ప్రాధేయపడుతున్నాను.

కృతజ్ఞతలతో పరంధామయ్య

ఉత్తరం చదవడం పూర్తిచేసిన రంగనాథం ఏదో దృఢనిశ్చయంతో తల పంకించారాయన.

○ ○ ○

డియర్ రీడర్! ఈ కథలో ఒక తప్పుంది. ఆ తప్పు చిన్నదికాదు, చాలా పెద్దది.

మధుది తప్పు. ఆ తప్పును రంగనాథంగారు గుర్తించలేదు. అందుకే పోయిన ఆ నిరుద్యోగ కథల్ని చదివి 'పాపం నిరుద్యోగులు' అని కన్నీళ్ళు పెట్టుకున్నారు. వాళ్ళ తెలివితక్కువతనాన్ని గుర్తించలేదాయన కూడా!

ఈ కాలంలో ఉద్యోగమే మనిషి జీవితానికి రాచబాటా? ఉద్యోగం చేస్తే ఇక కష్టాలే ఉండవా? కళ్ళల్లో మనసు పెట్టుకొని చూస్తే ఏ చిన్న మార్గమైనా కన్పించకపోదు. ఏ విషయంలోనూ మనస్సును చంపుకో నక్కరలేదు. ఎలాంటి పరిస్థితుల్లోనైనా బ్రతకడం ఒక ఛాలెంజి. జీవితాన్ని సర్దుబాటు చేసుకొని అనుభవించాలి. ఆనందాన్ని పొందాలి. లైఫ్ ఈజ్ ఏన్ ఎడ్జస్ట్‌మెంట్. చేదుకాలంలోనైనా బ్రతుకు మీది తీపిని పెంచుకొని బ్రతకాలి. ఇదే నా ఉద్దేశం, మరి మధు ఉద్దేశంఏమిటో!? మీ ఉద్దేశం ఏమిటో!?

[నిరుద్యోగ రాక్షసి కోరల సందుల్లో నలిగిపోతున్న సోదరులకు]

# కల్లోల గౌతమి

## లల్లాదేవి

8

శబరగణాల స్త్రీలను అవమానించాలని ప్రయత్నించిన శమంతుడికి బాగా బుద్ధిచెప్పేందుకు వెంటనే ప్రయత్నాలు ప్రారంభించారు శబరవీరునితో కలిసి తుల్య భాగ చక్రాని పథకాన్ని సిద్ధంచేసింది

ఆ పథకం ప్రకారం ఒక్క ఐరావతితప్ప వేరెవరూ ఆమెవెంట ఉండేందుకు వీలుకాదు శబరవీరుడు వేరుగా వచ్చి వారిని కలియాలి తుల్యభాగ వ్యక్తిత్వమూ సాహసమూ ఆమె మేధాసంపత్తి శబరయువకుణ్ణి బాగా ఆకర్షించినాయి

గణతంత్రాల యువతీయువకులంతా తలకొక పనితో నియుక్తులయినారు, కర్తవ్యమే వారికి పరమ లక్ష్యమయింది ఆయుధాల సేకరణ ఆరంభించినారు

వాటి ప్రయోగంలో నిపుణులయిన పెద్దలు తర్ఫీదు యివ్వటం కొనసాగ తోంది

పథకాన్ని సంసిద్ధంచేసే ప్రయాణానికి సమాయత్తమయింది తుల్యభాగ, ఆమెవెంట ఐరావతి

వారు ఎక్కడకు వెళ్ళేది ఏమి చేయదలచింది ఇటువంటి విషయాలన్నీ గోప్యంగా ఉంచబడినాయి వాటిగురించిన వివరాలు ఎవరికీ తెలియనీయలేదు

* ——— జరిగిన కథ ——— *

ధనకాంక్షతో శబరులని మోసగించిన శమంతుని బిడారుచర్యలు క్రమశః తెలుసుకుంది తుల్యభాగ శబరగణ యువకుడు కుండాలకునితో సంప్రదించాడు యక్షగణాలు సంపూర్ణంగా సమీకరించబడి పరిషత్తు సభలు జరిగాయి ఆర్య వ్యాపార కుతంత్ర నీతి విస్తరణ దక్షిణగణాలకు చేరనీయరాదన్న నిర్ణయం ఏక గ్రీవంగా తీసుకున్న యక్షగణాలు కుండాలకుడిని తమ నాయకుడిగా ఆర్యులని ఎదురుదెబ్బ కొట్టేందుకు అంగీకరించారు

మూడు ఉవసత్సాలు [illegible] అపూర్వమయిన అశ్వాలను సమాయత్త పరచి నా[illegible] తులేబాన గణతంత్రాలలోని పెద్దలందరినీ పేరుపేరునకలసి వారిఆశీస్సులు అందుకున్నది [illegible]హ్యచర్యలు జరిపింది

అందరికన్నా వృద్ధుడయిన ఒక గణతంత్ర సేభ్యునిదగ్గర చేరి పాదాభి వందనం చేసిందామె

అతడు నవ్యనవ్యత సమానమయిన నిండుమనంతో ఆశీర్వదించినాడు,

"పెద్దయ్యా! ఆర్యులతో అనివార్యమయిన యుద్ధం సంప్రాప్తమయింది, వెనుకంజ వేయటం జాతికి అవమానకరం కదా! అలా అని తల మించిన యుద్ధాలలో తలదూర్చి జాతిని పరాజయం పాలుచేయటం అన్యాయం, శక్తికిమించిన యుద్ధాలు జాతిని నిశ్శేషం చేస్తాయి, అలాంటి పని చేసేందుకు కాదుకదా నాకీ నాయకత్వ బరువుబాధ్యతలను మీరు నాకు అప్పగించారు,

ఆర్యరాజయిన సంవర్తకుడు శక్తిసంపన్నుడు ఆతనితో యుద్ధమంటే మాటలుకాదు, సప్తసింధూతీరంలో అతడు ప్రతిష్ఠాశాలి

అతడు బయలుదేరినాడు

మన తీరభూముల్లో విడిదిచేసినాడన్న వార్తలు వచ్చిపడుతున్నాయి ఎదు ర్కోవటం ఎలాగన్నది ఇపుడు జాతిముందున్న బృహత్తర సమస్య

అతని సైనికశక్తిసంపన్నత గురించిన వివరాలు సేకరించేందుకు మేము బయలుదేరినాము చేయవలసినదానిమీద నిశ్చితమయిన కార్యక్రమం నిర్ణయం కాలేదు.

చేయగలిగినదానిగురించి ఆత్మవిశ్వాసం ఒక్కటే తోడుగా బయలుదేరినాము

స్థూలంగా చెప్పాలంటే సప్తసింధూతీర పాలకుడయిన సంవర్తనుడి శక్తి సంపన్నత ఏపాటిదో, అతని సేనాబలం వివరాలేమిటో, ఏ పద్ధతిన యుద్ధ కార్య క్రమాలను నిర్ణయిస్తే అతన్ని జయించటం సాధ్యపడుతుందో తెలుసుకోవటమే ఈ ప్రయాణానికి లక్ష్యం.

అది నెరవేర్చుకుని త్వరలో తిరిగివస్తాము ఒకవేళ ఈ ప్రయత్నంలో నా తనువును పణంగా పెట్టవలసివస్తే నేను తిరిగిరాను

పెద్దయ్యగారూ! అలా జరిగితే ఈ జాతిరక్షణ భారం మీరు స్వీకరించాలి అది చెప్పేందుకే నేను మీ పాదాలదగ్గరచేరి కూర్చున్నాను" అని వినమ్రభావంతో వినయసంపన్నత ఉట్టిపడేలా చెప్పింది తుల్యభాగ




ఆమె మాటలు సావధానుడై విన్న వృద్ధుడు గంభీరంగా నవ్వాడు. తుల్యభాగశిరస్సున చేయివుంచి ఆశీర్వదించాడు. అతడు తన సుదీర్ఘమయిన జీవితంలో ఎన్నో అనుభవాలను చవిచూశాడు. ఎన్నెన్నో ఆర్యుల దాడులను ఎదుర్కొన్నాడు, ఆ అనుభవాలలో తుల్యభాగవలె సాహసించి ప్రత్యర్థుల స్కంధావారంలోకి చొరబడేందుకు ప్రయత్నించిన వారెవరూ లేరు. ఇది తుదినాళ్ళలో తాను చూడనున్న సరిక్రొత్త అనుభవం జాతిరక్షణకై ఇటువంటి సాహసానికి పూనుకున్న వ్యక్తి తన ఎదుట అంత వినమ్రభావంలో నిలిచి ఉండటం అతనికెంతో ఉత్తేజాన్నీ గర్వాన్నీ కలిగించింది.

తన అనుభావసారాన్ని అంతటిని క్రోడిచేసి తుల్యభాగకు ఒకేఒక్క మాట సలహాగా యిచ్చాడతడు.

"అమ్మా! సంకల్ప శక్తీ, సాహసమూ ఎక్కడ వుంటాయో అక్కడ విజయలక్ష్మి నివసిస్తుంది. వెళ్ళి విజయురాలవై క్షేమంగా తిరిగిరా!" అన్నాడతడు.

గుండెల నిండుగా ఊపిరిపీల్చి అక్కడ శలవు పుచ్చుకుని తిరిగి వచ్చింది తుల్యభాగ.

మరునాడే ప్రత్యర్థుల స్కంధావారానికి ప్రయాణం!

ఆ ప్రయాణంలో తొలి మజిలీ శమంతుని బిడారు. యదుల ఆ వాసాలలో తనకు నూకలు చెల్లుతున్నాయని గమనించిన శమంతుడు తిరోగమనుడయినాడు.

వెళ్ళి ఎలాగయినా సంవర్తనుడి అండదండలు అందుకోవాలని అతని ప్రయత్నం. కాని జాతిరక్షణ ప్రయత్నంలో ఉవ్వెత్తున కెరటంలా లేచిన యక్షనాయకురాలిశక్తి సంపన్నత ముందు అతడు భీరువు అయిపోయి పాదాక్రాంతుడయినాడు.

తుల్యభాగ లక్ష్యం శమంతుడు కానేకాదు. ఆమె దృష్టి యావత్తూ సంవర్తనుడి సైన్యాలమీద నిలిచింది. గోదావరీ ప్రాంతాలకు అప్పటికే చేరుకున్నాడు సంవర్తనుడు. అతనిది విస్తారమయిన సేనావాహిని.

తన తరువాత తరంతటి వాడయిన మహాదేవుడిని నగర రక్షణకై నియమించింది తుల్యభాగ. ఐరావతిని వెంటపెట్టుకుని గోదావరీ తీరానికి అభిముఖంగా ప్రయాణం కొనసాగిస్తోంది.

శబర యువకుడు ఎప్పుడు ఎలావచ్చి వాళ్ళతో కలుస్తాడో ఊహించేందుకు వీలుకాదు. అందునించి ప్రయాణంలో అతని అండపండ పూర్తిగా లేవనే భావించాలి.

కొండలు అడవుల మధ్యగా ప్రయాణం కొనసాగుతోంది.

"సోదరీ! శత్రువును శక్తి సంపన్నుడుగా అంచనా వేయటమే నిజమయిన యుద్ధనీతి, అదే మనకి సంపూర్ణమయిన విజయానికి దారి చేస్తుంది.

నేను సంవర్తనుడి శక్తి సంపన్నతను తక్కువగా అంచనా వేశానని నీవు ఎందుకు అనుకుంటున్నావు!
అలా నేనెన్నటికి చేయను. అతని వెనుక అపారమయిన ఆర్యసేన ఉన్నదనీ, వారి వద్ద అధునాతనమయిన ఆయుధాలు ఉన్నాయనీ నేను మరువలేదు!

అతనికి అండదండలుగా ఆర్యమేధావులు పండితులు నిలిచివున్నారన్న సత్యాన్ని నేను విస్మరించగలనా? అతడు యుద్ధరంగంలో ముమ్మాటికీ పులిబిడ్డే!

అందుకు రవంతయినా సందేహం లేదు. కాని పుల్లుల్ని వేటాడడం నాకు క్రీడ! అది నాకు చిన్నతనం నించీ అలవాటయిన విద్య. పులులతో చెలగాటం ప్రాణాపాయమే కాని మనకుయిది అని వార్యంగా సంప్రాప్తమయిన పోరాటం. వెను కంజ వేయటమన్న ప్రశ్నలేనేలేదు. ఏమి జరుగుతుందో నీవు చూస్తావు కదా! రేపటి సూర్యాస్తమయ సమయానికి గౌతమి వాహిని ఒడ్డున విడిసిన అతని సేనా వాహినిని చేరనున్నాము.

హృదయాన్ని దుర్బలం కానీయకు. నీ అక్కమీద విశ్వాసముంచు. తుది శ్వాసవిడిచేదాకా ఈ బ్రతుకు అర్థాలన్నింటినీ యక్షగణాల శ్రేయఃకామనకే అంకితం కావించినామన్న విషయాన్ని మరొక మారుస్మరించు" అన్నది తుల్యభాగ. ఆత్మ విశ్వాస పరిపూర్ణమయిన ఆవాగ్ధార విన్నతరువాత రవంతగా స్థిమిత పడింది ఐరా

వతి రావలసిన దారినించి శాబరవీరుడువచ్చి త్వరగా తమతో కలిస్తే బాగుండు నన్న ఆలోచన ఆమె మనసుని వీడిపోలేదు

"సోదరీ! పగలంతా విశ్రాంతి ఎరుగని ప్రయాణం ఇంకా రేపటిపగలంతా కూడ ప్రయాణమే చేయవలసి ఉంది విశ్రాంతి అవుసరం కదా! నిద్రకూడా ముంచుకు వస్తోంది" అన్నదామె భోజన కార్యక్రమం త్వరగా ముగించి బూరుగు చెట్టు కొమ్మలమీదికి చేరి పోయినారు

అలసట వల్ల అంతలోనే వాళ్ళకి కనురెప్పలు వాలినాయి

అడవిలో తెల్లవారింది ఉషఃకాంత సిగమీది పూలచెండులా ప్రొద్దు పైకొస్తోంది ఉన్నతంగా పెరిగిన కొమ్మల రెమ్మల మాటునించి రవికిరణాలు దోబూచులాడుతున్నాయి ఇద్దరూ చెట్టుకొమ్మలు దిగివచ్చారు చాలినంత విశ్రాంతి తరువాత వారి ముఖాలు దీప్తిమంతాలయినాయి యౌవనపు మిసిమితో చెంపలు బద్దారినాయి

అశ్వాలు వినూత్నమయిన శక్తితో హయహేషలు వినిపిస్తున్నాయి నూనె రాచిన మెరుగులా వాటి శరీరాలు నిగనిగలాడుతున్నాయి ఉత్సాహంతో తోక కుచ్చుల్ని కదలిస్తున్నాయి

దగ్గరలో ఉన్న నీటినెలవుదగ్గరకు వెళ్ళి కళ్ళుతుడుచుకుని నీళ్ళు పురిషిట పట్టి తుప్పున ఉమిసింది తుల్యభాగ స్నానం ముగించి నారచీరలు మార్చుకున్నారు

శరీరమంతా తేలిపోతున్నట్లు అనిపిస్తోంది వినూత్నమయిన జవసత్వాలతో రక్తం పరుగులుతీస్తున్నట్లుగా అనిపించసాగింది తమతో తెచ్చుకున్న తేనె చెరి కాస్తా ఆరగించారు

ముందుగా ఒక్క గెంతులో అశ్వాన్ని అధిరోహించింది తుల్యభాగ ఐరావతి తను అధిరోహించిన అశ్వాన్ని కంచీతో అదలించింది

గౌతమీ తీరప్రాంతాలకు అభిముఖంగా ప్రయాణం ప్రారంభమయింది తుల్యభాగ అశ్వాన్ని అందుకోవాలని ఐరావతి అశ్వాన్ని అదలిస్తూ గుర్రపుస్వారీలో తనకున్న నైపుణ్యమంతా ప్రదర్శించసాగింది తుల్యభాగ

మందగతిన బయలుదేరిన అశ్వాలు అశ్వగతిలో అడవిదాటి మైదానాలమీదికి వచ్చాక ప్లుతగతిని అందుకున్నాయి వాటి గిట్టలు తాకిన చోటున భూమిమీద ధూళి ఆకసానికి లేస్తోంది

* * *

మరునాడు పగలంతా పయనించిన అశ్వాలు అలసనాయి అల్లంత దూరంలో గౌతమీ సలిలధారలు గలగలపారుతూ కన్పించినాయి గోదారిగట్టు కన్పిస్తోంది ఆవలిఒడ్డుక ఆర్యసేన విడిదిఉండటం లీలామాత్రంగా పొడకట్టతోంది అశ్వాన్ని అలాగే యధేచ్ఛగా వొదిలి గోదావరిజలాల్లో కాలుపెట్టింద్ది తుల్యభాగ

ఐరావతి అక్కను అనుసరించి ఈదుకొస్తోంది అక్కడ గౌతమీనది పాయలుగా చీలి ప్రవహిస్తోంది ఏవంతసేపు ఈతలో నైపుణ్యం ప్రదర్శించాక మళ్ళీ నీటిలో నడిచి ఒడ్డుకు చేరటం కాస్సేపు లంకల్లో నడిచాక అడ్డుగా కన్పించిన మరొక పాయలో దిగి ఈది అవతలి లంకకు చేరుకోవటం – ఇలా సాగుతోంది ప్రయాణం

అప్పటికే రెండు మూడు పాయలుగా దటివచ్చారు మరో రెండు మూడు పాయలు దాటిపోతే కరకట్టను చేరుకోవచ్చు లంకల్లోకి వచ్చాకనే ఆర్యసేనలు తచ్చాడుతూ వుండటం కన్పించింది

గౌతమికి ఉత్తరతీరమంటే ఇంచుమించు ఔత్తరాహుల రాజ్యాలకది సరిహద్దు !

గౌతమీనదికి దక్షిణతీరంనించీ దాక్షిణాత్యుల భూములు ప్రారంభమవుతాయి

వాస్తవానికి గోదావరినది ఉత్తరతీరంనించి మధ్యభారతం ప్రారంభమవుతుంచి అది మొదలు నర్మద తపతి నదుల్ని దాటి వింధ్యగిరి శిఖరాలు కన్పించేదాకా మధ్యభారతమే విస్తరిల్లిఉంటుంది

అవతలిప్రక్క అంతా ఉత్తర భారతం కాని ఔత్తరాహులయిన ఆర్యులు తమ యుద్ధవిద్యా కౌశలంతో మధ్యభారతాన్ని ఆక్రమించారు నర్మద తపతి నదుల్లో బలిష్ఠ శక్తిమయిన తమ ఖడ్గాలను కడిగారు కళింగభూముల్నిసైతం కాలి

* ——— *

ఓ పెద్దమనిషని ఓవర్‌స్పీడ్‌తో కారునడుపుతున్నందుకు గాను కోర్టులో నిల బెట్టారు పోలీసులు

బాబోయ్! పోలీసులు చెప్పేదంతా అబద్ధమండీ! నేను గంటకు పదిహేను కిలో మీటర్లకంటె ఎక్కువ స్పీడుతో నడపలేదండీ! అంటూ మేజిస్ట్రేటుగారితో మొత్తుకున్నాడా పెద్దమనిషి

పదిహేను కిలోమీటర్లకంటె ఎక్కువ స్పీడ్ లేదని ఖచ్చితంగా ఎలాచెప్ప గలవ్? అడిగాడు మేజిస్ట్రేట్

భలేవారండీ! నేను పన్ను పీకించుకోడానికి డాక్టర్ దగ్గర కెళ్తున్నాకదా మరి!




క్రింద త్రొక్కిపట్టారు. మహేంద్రగిరి శిఖరాలు వారి బలపరాక్రమలకు యుద్ధ కౌశలానికి తలవంచినాయి.

ఇప్పుడు గోదావరికి ఉత్తరపు ఒడ్డు వారి సరిహద్దు అయింది. ఆ సరిహద్దులలో తొలిసారి కాలుమోపింది తుల్యభాగ.

"సోదరీ! చరిత్రలో అసమానులుగా వర్ణింపబడుతూ, మొత్తం జంబూద్వీపంలోనే నాగరికతకు నిర్మాతలని భావించబడుతున్న ఆర్యభూమి ఇది. ఇక్కడ కాలు మోపగా నా శరీరం జలదరిస్తోంది! కొన్ని శతాబ్దాలుగా మన పెద్దలకూ, వారి పెద్దలకూ మధ్య జరిగిన చారిత్రాత్మకమయిన పోరాటాలన్నీ జ్ఞాపకం వొస్తున్నాయి

అంతటి చారిత్రాత్మకమయిన, బృహత్తరమయిన బాధ్యతను నెరవేర్చటంలో తనకూ కొంత పాత్ర దొరికినందుకు ఎంతగానో పొంగిపోయింది ఐరావతి.

"అక్కా! ఔత్తరాహులతో దాక్షిణాత్యులు సాగిస్తున్న పోరాటంలో నా సర్వశక్తులూ సమీకరిస్తాను దాక్షిణాత్యుల మానాభిమానాలు నాకు ప్రాణసమానులుగా భావిస్తాను. ఇంకా శబరయువకుడు మనతో కలియరాలేదు ఎందుకని?" అని అడిగింది ఐరావతి.

"తగిన సమయంలో అతడే రాగలడు. నీవు తగు జాగ్రత్తలో ఉండాలి సుమా!" అని మరొకమారు హెచ్చరించి గౌతమీతీరానికి కొంతదూరంలో ఉన్న చెట్లగుబురుల మధ్యకు వెంట తీసుకుపోయింది తుల్యభాగ

ఆ రాత్రికి ఒక వృక్షశాఖనే శయ్య - భావించి ఇరువురూ విశ్రాంతి తీసుకున్నారు.

ఉషోదయాన అల్లంత దూరాన గుర్రపు డెక్కల చప్పుడు విని చప్పున రెప్పలు విప్పి చూచింది తుల్యభాగ.

సమున్నతకాయుతయిన యువకుడొకడు అటుగా వొస్తూ కన్పించాడు. ఇతని వెనుక మరికొందరొచ్చారు. వారందరూ మరింత చేరువకు వచ్చాక ఒకచోట ఆగి పోయినారు.

"ఆర్యకౌండిన్యులు ఇంకా యుద్ధయాత్రకు అనుజ్ఞ యివ్వలేదు. కారణమేమయి ఉండవచ్చు" అని ప్రశ్నించాడు, ముందుగా వచ్చి నిలచిన యువకుడు.

"వయోభారంవల్ల రక్తమాంసా లుడిగిపోతున్న కౌండిన్యుని యుద్ధసలహాదారుగా నియమించుకొనటం సంవర్తనుడు చేసిన తప్పిదం. రాజు సరిఅయిన నిర్ణయం తీసుకోనప్పుడు దాని ఫలితాన్ని అనుభవించవలసింది మనవంటి సైనికులే కదా!" అన్నాడు మరొకడు.

వారి మధ్య చాలసేపు సంభాషణ జరిగింది. వారంతా దక్షిణాది యుద్ధ యాత్రకు తొందరపడబోతున్నారని ఆ మాటలవల్ల గ్రహించింది తుల్యభాగ!

వారు తిరిగి పోతూ చెప్పుకున్న మాటలు తుల్యభాగను మరింతగా ఆకర్షించినాయి.

"ఈవేళే కదా దశరాత్రోత్సవాలకు ముగింపు. మన ఉత్తరాది దేశాలలో అయితే గొప్ప పండుగ జరుపుకుని ఉండేవారము. దశ్యులను సంహరించటానికి అంబదుర్గగా అవతారమెత్తిన సుదినమది.

ఈ దశరాత్రి ఉత్సవాలగురించి ద్రావిడులకు రవంత అయినా తెలిసినట్లు లేదు. ఇక్కడ ఎక్కడా జనపదాలలో కూడ కోలాహలం కన్పించలేదు" అన్నాడొక సైనికుడు తిరిగిపోతూ.

*  *

చిన్నిగాడు స్కూల్లో చేరిన మొదటి రోజు అది. హోమ్‌బెల్ అవగానే పిల్లలంతా ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారుగానీ చిన్నగాడు మాత్రం క్లాసులోనే ఉండిపోయాడు.

"నువ్వు ఇంటికెళ్ళవేంరా చిన్నీ?" అడిగింది టీచర్

"నాకు పదిహేనేళ్ళు వచ్చేవరకూ స్కూల్లోనే ఉండాలని మా మమ్మీ చెప్పిందండీ" దగులుగా అన్నాడు చిన్ని.




"ఈ దాక్షిణాత్యులకు ఏమీ తెలియదు. మన రాజు మధ్యాహ్న వేళ విలు విద్యలో పోటీలు పెట్టాడు. గురిచూచి బాణం కొట్టడంలో నిపుణులయిన వారికి మంచి బహుమానాలు దొరుకుతాయి.

మనమంతా పోటీలకు సంసిద్ధులం కావాలికద! ఇక్కడ కాలహరణం చేయటమెందుకు బయలుదేరండి" అని హెచ్చరించాడు వారినాయకుడు.

అందరూ తిరో న్ముఖులయి వెళ్ళిపోయారు.

వారంతా పోయాక ఆసక్తిని అణచుకోలేక అక్కను అడిగింది ఐరావతి. "అక్కా! దశరాత్రోత్సవాలు అంటే ఏమిటి? ఉత్తరాదిన ఈ వేళంతా పండుగ జరుపుకుంటారటకదా! మన వారెందుకు జరుపుకోరు. ఇందు గురించి నీకేమయినా తెలుసా?" అని అడిగిందామె. తుల్య భాగ చిరునవ్వు నవ్వింది.

"సోదరీ! ఈ భూమిమీద ప్రాణులన్నీ సమంగా పుట్టాయి. వాటన్నింటికి ప్రకృతి సంపదలను అనుభవించేందుకు సమానమయిన ప్రాతి పదిక ఉండి తీరాలి. కాని దురదృష్ట వశాత్తు స్వార్థమను పెనుభూతం మనిషి మనసుని స్వాధీన పరుచుకుంది.

మరొకరికన్నా శక్తిలోను సంపదలోను అధికుడనుకోవాలన్న కామన వ్యక్తుల మధ్యనేకాక జాతుల మధ్యకూడ అంకురించింది.

ఆర్యుల స్వార్థదృష్టివల్లనే దాక్షిణాత్యులకు ఔత్తరాహులకు మధ్య ఎవగూ పూడ్చనంతగా అంతరం ఏర్పడింది. ఎందరు బలవంతులయిన ద్రావిడులను సంహా

రిస్తే అతడంత గొప్ప ఆర్యుడన్న పేరురావటం ప్రారంభించింది ఆందు గురించి కథలు కూడా పుట్టాయి

చిన్న తనంలో నా తండ్రి చెప్తూ ఉండేవాడు

పూర్వం ప్రాగ్జ్యోతిష్యమనే నగరాన్ని సింధుద్వపుడనే రాజు పాలిస్తుండే వాడట అతడు ఆర్యులమీద పగతీర్చుకునేందుకు నడుం కట్టాడు

వేత్రవతీ నదీ తీరాన తపస్సుచేసి ఒక బిడ్డను పొందాడు అతడి పేరు వేత్రాసురుడు అతనిని సంహరించేందుకు దుర్గ అవతారమెత్తిందట

ఒక అసురుడిని ఆర్యవనిత సంహరించిన రోజు వారంతా పండుగ చేసుకున్నారు ఆ రోజు వారుచేసుకున్న ఉత్సవం కాలగర్భంలో ఒక జ్ఞాపకంగా పండుగగా నిలిచిపోయింది అదే విజయదశమి

తరువాత ఆర్య సంతతి దాన్ని పదిరోజుల పండుగగా చేసుకుంది అదే ఈ నాటి పండుగ

అంటే ద్రావిడులను ఆర్యులు వధించిన పండుగ

ఈ వేళ మనం గుర్తుపెట్టుకోవలసిన ప్రధానమయిన అంశం మరొకటి ఉంది నీవు దానిని మరచినట్టున్నావు

ఈనాడు విలువిద్యతో పోటీలు జరుగుతాయట వాటిలో మనం పాల్గొనే అవకాశం ఉన్నదో లేదో ముందు పరిశీలించాలి మనం వెంటనే బయలుదేరాలి" అంటూ చెట్టుకొమ్మ దిగివచ్చింది తుల్యభాగ

కొద్దిసేపటి తరువాత ఇద్దరూ ఆర్య రాజు స్కంధావారం వైపుగా బయలుదేరారు

*

---

లక్షాధికారి అయిన బంధువు భోజనానికి కొస్తున్నారని బాబిగాడిని ముందే వెధవవేషాలు వేయకూడదనీ, బుద్ధిమంతుడిలా ఉండాలనీ వార్నింగిచ్చాడుతండ్రి భోజనాలు పూర్తయేవరకూ బాబిగాడు నోరు మెదపకుండానే కూర్చున్నాడుగానీ ఆ తరువాత లక్షాధికారి వేపుతిరిగి "మీరు గున్న ఏనుగులా ఎప్పుడు నడుస్తారు అంకుల్?" అనడిగాడు

లక్షాధికారి ఆశ్చర్యపోయాడు "గున్న ఏనుగులాగా నడవటమా?"

"అవునంకుల్! మీరు అచ్చంగున్న ఏనుగులా నడుస్తారని డాడీ మమ్మీతో చెప్పారు.. ఒక్కసారి నడవరూ!!"



వారి స్కంధావారం వలయాకృతిగా విడిసి దిశ వుంది సేనావాహిని విడిది దిశన గుడారాల చుట్టూ పెట్టని కోటవలె ఏనుగులు కట్టివేసి ఉన్నాయి మావటీలు వాటిని బాగా మచ్చిక చేసుకుంటున్నారు

కోట గోడలా ఉన్న గజశ్రేణి లోపల అశ్వాలు కట్టివేయబడి ఉన్నాయి వాటికి అంతర్భాగాన సైన్యానికి అవసరమయ్యే నిత్యావసర వస్తువులు, దుస్తులు, ఆయుధాలను తరలించుకు వస్తున్న శకటాలు, రథాలు నిలవరించి వున్నాయి

ఆ లోపల సైనికుల గుడారాలున్నాయి

సైనికుల పటాలంచుట్టూ మూడుశ్రేణులలో కోటగోడలు నిలిచినట్లుగా గజ అశ్వ శకట శ్రేణులు అమర్చి ఉన్నాయి అర్ధ రాత్రివేళ అలుగా ఎవరైనా దాడి చేయాలంటే ఆ మూడు శ్రేణులు దాటి రావాలి

ఆర్యుల యుద్ధ తంత్రం ఎంత నిర్మాణాత్మకమయినదో స్కంధా వారం చూస్తేనే తెలిసి పోతుంది

అవన్నీ దాటుకుంటూ ముందుకెళ్ళింది తుల్యభాగ

అప్పటికే ఆర్య రాజు అయిన సంవర్ధనుడు సభ తీర్చి కూర్చున్నాడు అతని ప్రక్కన ఉన్నతమయిన ఆసనం మీద కూర్చున్న వ్యక్తి దగ్గరకు రాగానే అందరూ అంజలి ఘటించి అవనతులవు తున్నారు అతడు మహాతేజస్వి

“అక్కా అతడే కదా ఆర్య కౌండిన్యుడు?” అని అడిగింది ఐరావతి అవునని తలఊహించింది తుల్యభాగ రాజుకు మార్గదర్శి అయిన బుద్ధిశాలి కౌండిన్యుడు సభ నిండిపోయిన తరువాత సంభాషణ ప్రారంభించాడు

"ఆర్య మహాజనులారా! జంబూ ద్వీపంలో నలుమూలలకూ ఆర్య సంస్కృతి విస్తరించాలని, అందువల్ల ప్రజాజీవితం సుసంపన్నమూ,శక్తివంతమూ అవుతుందని గ్రహించిన వారు మన పెద్దలు.

మతము ఆలోచనారీతి ప్రజా జీవితం ప్రశాంతంగా ఉండాలంటే మతమనేది ఏకోన్ముఖంగా ఉండితీరాలి. అందుకు పునాదులు వేశారు మన పెద్దలు. ఆ సాంప్రదాయాన్ని మనం తుగిదాకా కొనసాగించాలి

అందుకోసమై రక్త తర్పణ అయినా చేయాలి. ఆ ఆశయాన్ని నెరవేర్చేందుకు మనసేనలు దక్షిణ పథాలవెంట తరలి వచ్చినాయి.

ముఖ్యంగా భారతఖండలో వివిధ సంస్కృతులున్నాయి. వేరువేరు నవీన సరళులు ఉన్నాయి ఇవన్నీ ఆర్య నాగరికతలో సంక్రమించి ఆర్యసంస్కృతి చిర విశాలతమం, విస్తృతమూ కావాలి అలా జరగాలి అంటే ఆర్యుల పాలన క్రిందికి భారతఖండమంతా వచ్చేయాలి

ఈ సదాశయం కోసమే మనము యుద్ధాలు చేస్తున్నాం అయితే భిన్నమయిన జీవిత విధానాలకూ, ఆలోచనా ధోరణులకూ అలవాటు పడినవారిందుకు అంగీకరించరు.

వారు మనకు వ్యతిరేకంగా పోరాడుతారు. సత్యమే వజయతే! అన్నారుకదా! అందునించి అంతిమ విజయం మనదే అయితీరుతుంది. అలసత్వం పనికిరాదు, శ్రమించాలి విజయం సాధించాలి" అని చెప్పాడు కౌండిన్యుడు

ఆర్యకౌండిన్యుడి మాటలకు వారంతా హర్షామోదాలు తెలియ చేసారు సప్తసింధు పరిపాలకుడయిన సంవర్ధనుడు అందుకున్నాడు "మీరంతా ఆర్యుల ఆశయాలను సాధించగల శక్తిశాలురు కావాలి అలా అయేలా తీర్చిదిద్దేందుకు ఎన్నో ప్రయత్నాలు జరుగుతున్నాయి వాటిలో యుద్ధవిద్యలలో పోటీ ఒకటి




"మీ అబ్బాయిని అద్భుతమయిన విద్యార్థి అని పిలుచుకుంటూంటాము మేము" అంది టీచరు

"ఆ! నిజంగానాండీ!" ఆనందంతో పొంగిపోతూ అంది ఆ కుర్రాడి తల్లి

"అవును! ఎంతనేర్పించినా, ఎంత చెప్పినా ఒక్క-ముక్క- కూడా రాకపోడమే నిజంగా అద్భుతం! కదూ?" అంది టీచరు




ఖడ్గ చాలనమూ, గుర్రపుస్వారీ, గురిచూచి యీటె విసరటం, బాణంలో లక్ష్యాన్ని ఛేదించటం, మల్లయుద్ధం వీటన్నింటిలో పోటీలు జరుగుతాయి. అందరూ పాల్గొని మీ శక్తియుక్తులు ప్రదర్శించండి సర్వోత్తములుగా ఎంపిక అయిన వారికి వాహినీ పతితో సమానమైన గౌరవం యివ్వబడుతుంది ప్రయత్నించండి" అని ప్రసంగించాడు ప్రభువు

ఆ తరువాత వారి ఆంతరంగికమయిన రాజకీయ సమస్యలు అనేకం చర్చకు వచ్చినాయి. ఆహారపు నిల్వలు, ఆయుధాలను అమర్చుకోవటం వంటి విషయాలెన్నో చర్చకు వచ్చాయి

 ——————————————— 

రెండు వందలమంది టూరిస్ట్‌లతో రాకెట్ షిప్ చంద్రలోకం మీదుకు బయల్దేరింది. పదినిమిషాలు ప్రయాణం చేశాక స్పీకర్‌లో ఓ గొంతు వినిపించింది

"ఇప్పుడు మనం భూమికి మూడు వేలమైళ్ళ దూరంలో పరిభ్రమిస్తున్నాం! ఈ సందర్భంలో మన రాకెట్ షిప్ గురించి కొన్ని వివరాలు! అన్నిటిలోకి ముఖ్యమయిన దేమిటంటే ఈ రాకెట్ ఇంజన్‌లో ఎలాంటి పొరబాట్లూ జరగకుండా జాగ్రత్తలు తీసుకున్నాం! ఈషిప్ కేవలం మరమనుషులతోనే నడుపబడుతోంది కనుక ఎలాంటి ప్రమాదమూ జరగదు— జరగదు- జరగదు— జరగదు-"

తరువాత [illegible] ముగిసింది



ఉత్సాహపరేతులయినవారంతా సర్వ సన్నద్ధులు అయినారు ముందుగా ఆయుధాలను ప్రయోగించడంలో పోటీ జరిగింది ఆ తరువాత మల్లవిద్యలలో పోటీ జరిగింది

అంతా అయిన తరువాత వారి శక్తి యుక్తులు తుల్యభాగకు అర్థమయినాయి ఫక్కున నవ్విందామె.

అంతవరకూ ఆ పోటీలు తిలకించేందుకు వచ్చే ఆటవికులు గ్రామీణులలో చేరిపోయింది తుల్యభాగ వారి శక్తి సంపత్తి, సాధన సంపత్తి ఏమిటో తెలిపోయేంత వరకూ బయటపడదలచుకోలేదామె పోటీలు పూర్తి అయినతరువాత ఇంక తాను దాగుండవలసిన అవసరం లేదని తీర్మానించుకుంది

వివిధ విద్యలలో కొందరు వ్యక్తులు ప్రథములుగా ఎంపిక అయినారు వారందరిలో అన్ని విద్యలలో సమంగా ప్రతిభాశాలి అయిన యువకుడిని సర్వ ప్రథముడుగా ఎంపికచేశారు ఆతనికి వాహినీపతితో సమానమయిన గౌరవప్రతిపత్తులతోపాటుగా మరికొన్ని కానుకలు యిచ్చేందుకు సంసిద్ధుడయినాడు రాజు సంవర్తనుడు అప్పటికి ఆతడే సర్వప్రథముడయినా ఆతనికి దక్కవలసిన బహుమతులు దక్కే సమయాన తన అభ్యంతరం తెలియజేశాడు ఆర్యకౌండిన్యుడు

రాజా ! ఈ ప్రదర్శన పూర్తిఫలితం మనకు దక్కాలంటే మీరు ఈ పోటీలో దాక్షిణాత్యులు కూడ పాల్గొనవచ్చని ప్రకటించాలి వారిలో నిపుణులు





ఏమిటంత కోపంగా ఉన్నారు?" లావుపాటి పిన్నిగారిని అడిగింది పక్కింటామె

"ఇందాక మార్కెట్ కెళ్ళినప్పుడు మనబరువుని నోటితో చెప్పే వెయింగ్ మిషన్ ఎక్కి నిలబడితే అదేమందో తెలుసా?"

"ఏమందండీ?"

ఇలా ఇద్దరూ ఒకేసారి ఎక్కితే బరువు చెప్పడం కష్టం! ఒకరు దిగిపోండి అంది-' రుసరుసలాడుతూ అంది పిన్నిగారు




ఎవరయినా ందుకు రావచ్చు అప్పుడు దాక్షిణాత్యులకు యుద్ధనైపుణ్యంలో ఉన్న శక్తిని మనం స్థూలంగా అంచనా వేయడానికి వీలు అవుతుంది ఇంతకాలంనించి ఈ ప్రదర్శనలు చూచేవారిలో ఆటవికులున్నారు గ్రామీణులున్నారు వారంతా దక్షిణాత్యులు అందునించి ఈ వార్తయి చేరవలసిన చోటుకు చేరుతాయి మన వీరుల శక్తియుక్తులు వారికి తెలుస్తాయి వారికుండే శక్తి కూడా మనం ప్రత్యక్షంగా చూడాలి అందుకు ఇదొక్కటే చక్కని అవకాశం అందుకని సర్వప్రథము డయిన అతనితో ఆర్య అనార్య విచక్షత లేకుండా ఎవరయినా పోటీచేయవచ్చని ప్రకటించండి అంటూ మంత్రాంగాన్ని వివరించాడు ఆర్యకౌండిన్యుడు

(సశేషం)



---

ఏమిటంత కోపంగా ఉన్నారు? రావుపాటి ఎన్నిగారిని అడిగింది పక్కింటామె

ఇందాక మార్కెట్ కెళ్ళినప్పుడు మన బరువుని నోటితోచెప్పే వెయింగ్ మిషన్ ఎక్కి నిలబడితే అదేమిందో తెలుసా?

ఏమందండీ?

ఇలా ఇద్దరు ఒకేసారి ఎక్కితే బరువు చెప్పడం కష్టం! ఒకరు దిగిపోండి అంది రుసరుసలాడుతూ అంది ఎన్నిగారు

# రిపోర్టు

సాయంకాల అయిదున్నర,

దక్షిణ గోదావరిజిల్లా మాధవవరం తాలూకా రామభూపాలపట్నం. ఆ బుధ వారంకూడా చుట్టుపక్కల నలభై-ఏభై గ్రామాల జనంతో ఆ వూరి సంతసావిళ్లు నిండివున్నాయి. ఆ గ్రామానికి వచ్చే దోవలన్నింటా తట్టలూ, కావిళ్ళూ, సంచీలూ, బస్తాలతో సామాన్లతో రిక్షాలూ, సైకిళ్ళూ ఒంటెద్దు బళ్ళూ గుర్రబ్బళ్ళూ వగైరాలమీద జనం. వెళ్ళిపోతున్న జనానికి రెండింతల జనం. ఆ సంతచావిళ్ళలో గోనెపట్టాలమీదా, నులకి మంచాలమీదా, యీతచాపలమీదా పరచి వుంచిన వివిధరకాల వస్తువుల బేరసారాలతో తీరికలేకుండా ఉన్నారు. ఆ జనం ధ్వని దూరానికి సముద్రపు హోరులా ఉంది.

అయిదు అడుగుల పొడవూ, మధ్యకం లావూ, ఊరిన బుగ్గలూ, చిన్ని కళ్ళూ, దళసరి పెదాలూ, కొద్దిపాటి బొంగురుగొంతూ-తో రామస్వామి ఆడవాళ్ళతో గాజులబేరాలు చేసిచేసి జనం పలచబడటంతో కొంచెం ఊపిరి తిప్పుకుంటున్నాడు. పర్లకిపూడి గ్రామానికి చెందిన వీరమ్మ అనే హరిజన మహిళ గాజులధరలు అడుగుతోంది. ఆమెకి కావల్సిన వివరాలు పదినిమిషాలు వివరించి- "డజను గాజుల ఖరీదు ఒ రాత్రి సుఖం"-అన్నాడు రామస్వామి. అలా మొదలయింది.

రామభూపాలపట్నం జనాభా 5,682, ఆయకట్టు 7,876 ఎకరాలు. పట్టాదార్ల సంఖ్య 974, కేవలం మెరకభూములు గల రైతులు 462, పదెకరాలకన్న మించినరైతులు 237, వీరిలో బ్రాహ్మణులు 3, రాజు 1, కోమట్లు 7 పోగా మిగిలిన 226లో గొల్లలు 82, తెలగకాపు 78, పెరికీలు 66, మొత్తంజనాభాలో 2,734 హరిజనులు, గత జనాభాలెక్కల ప్రకారం గొల్లలు 826, తెలగాలు 1285, పెరికీలు 627, మిగిలినవారు అల్పసంఖ్యాకులు.

రామస్వామి గొల్ల కులానికి చెందినవాడు, అతను చేసిన వేళాకోళం కార్చిచ్చులా వ్యాపించింది, వీరమ్మభర్త మరో ముప్పైరెండుమందితో ఆ దుకాణాన్ని సమీపించాడు, ఆరున్నరకు అక్కడ రామస్వామి కొట్టుపెట్టిన చిహ్నాలు మిగలలేదు, రామస్వామి ఆచూకీ లేదు

అది అక్కడతో ఆగలేదు, పర్లాకిపూడికీ రామభూపాలపట్నం రెండున్నర మైళ్ళు - మద్రాసు కలకత్తాను కలిపే గ్రాండ్ ట్రంక్‌రోడ్డు ద్వారా ఎటుపోవాలన్నా పర్లాకిపూడి జనానికి ఆ వూరు మీదగా వెళ్ళకతప్పదు,




ఇది జరిగిన తొమ్మిదిరోజులకి సరిగ్గా 1974వ సంపత్సరం జనవరి ఆరవ తారీఖున రామభూపాలపట్నానికి చెందిన మాధవరావు అనే ముప్పై అయిదెకరాల పెరిక్రీ కులస్థుడైన రైతు తల ఆ రెండు ఊళ్ళనూ కలిపే రోడ్డుమీదకు కుక్కలు లాక్కునివచ్చి పీకుతుండగా కనిపించింది, అంతవరకూ పేపర్లకు ఎక్కని ఆరెండు గ్రామాలూ ఆ సంఘటనతో వెలుగులోకి పచ్చాయి రాజంపూడి పోలీస్‌స్టేషన్‌కి చెందిన సబ్-ఇన్స్‌పెక్టర్ రాఘవరావును బట్టి—

"ఇది ఒక ఉద్దేశ్యపూర్వకమైన హత్య, హతుడి తలకాయ మీద కని పిస్తున్న దెబ్బలే ప్రాణంపోటానికి కారణ మని డాక్టరు అభిప్రాయం ప్రాణం పోయాక గొడ్డలి వంటి ఆయుధంతో తలను వేరుచేసినట్లు తెలుస్తోంది. చుట్టు పక్కల పదిమైళ్ళలోగల నూతులూ' చెరువులూ ఆరురోజులపాటు గాలించినా హతుడి మొండెం దొరకలేదు, దీనినిబట్టి శవం జాడలు తెలియకుండా కాల్చివేయ బడినట్టూ, లేదా అందుకు ప్రయత్నాలు జరిగినట్టూ ఊహించవచ్చు, జరిగినదంతా చూస్తే-హతుడిని పట్టుకుని కొట్టి చంపి వేసి ఆ తర్వాత గొడ్డలితో ముక్కలు ముక్కలుగా నరికి గోనెవంటిదానిలో వేసి మూతి బిగించి కట్టి ఏ వాహనంమీదో తీసుకుపోతూండగా వదులుగాఉన్న ముడి జారి యీ తల అందులోంచి క్రిందకు పడి తుప్పల్లోకి దొర్లిపోయి వుండాలి, కొంచెందూరం వెళ్ళాక చూసుకున్నా వాళ్ళకి కంగారులో, చీకటిలో దొరకక పోడమయినా జరిగివుండాలి, లేదా వాళ్లు చూసుకోకపోడమయినా జరిగివుండాలి, కాబట్టి యీ హత్య ఉద్దేశ్యపూర్వకంగా జరిగిందనడంలోనూ, ఒక వ్యక్తికాక కొందరు వ్యక్తులకు యీ చర్యలో పాలు ఉందనడంలోనూ సందేహం అవసరం లేదు—"

జనవరి పన్నెండవతారీఖు రాత్రి పద కొండు గంటల చలిలో వణికి పోతూ కొద్దిగా మాసిన గడ్డంతో ముఖంలో ఆందోళనతో రామనాథం అనే వ్యక్తి రాజంపూడి పోలీస్‌స్టేషన్‌కు చేరు కున్నాడు డ్యూటీలోవున్న కానిస్టేబుల్ అతను చెప్పినదివిని—'పొద్దుట చూద్దాం!' అన్నాడు. సబ్-ఇన్స్పెక్టర్ గురించి అడిగితే-శరభవరం అనే గ్రామంలో మకరసంక్రమణానికి ముందుజరిగే కోడి పందాలలో యిరువర్గాలమధ్య ఏర్పడిన ఘర్షణ చల్లార్చటానికి వెళ్ళాడు రామ నాథం అంతటితో తన ప్రయత్నం విర మించుకోలేదు, అప్పటికప్పుడు బయల్దేరి రాజంపూడికి మూడుమైళ్లలోవున్న రంగా పురంలో ఉంటున్న స్థానిక ఎం ఎల్ ఏ-నారాయణస్వామిని కలిసాడు, సుమారు రాత్రి పన్నెండుగంటలవేళ చలిలో ముడు చుకు పడుకున్న ఆ బంగ్లా చాలా ప్రయ త్నంమీద నిద్రలేచింది,

"అయితే ఏంటంటావ్?" కళ్ళనులు ముకుంటూ-ఆవులింతలుపోడానికి చిటి కెలు వేస్తూ నారాయణస్వామి అడిగాడు.

"వాళ్ళు ఆరువందల మందికి తక్కువ ఉండరు. తెల్లవారీ సరికి కనీసం నల్భై ఏభై శవాలు లేస్తాయి పట్నంలో తెలగా లకీ గొల్లలకి మధ్య గొడవలు యీనాటివి కావు అందులోకి యితర కులాలు ఏనాడూరాలేదు పెరికీల మాటసాయం మాత్రం తెలగాలతోనే ఉండేది మాధవ రావు హత్యకు కారణం గొల్లలేనని పెరి కీలలో చాలమంది అభిప్రాయం ఆ అభి ప్రాయం కలిగించినదీ తెలగాలే అంటు న్నారు నిజం ఎవరికీ తెలీదు గొల్లలతో కలిసిమెలిసివుండే హరిజనులని తెలగాలు మంచి మాటలాడుతున్నారని కూడా అన్నారు మొత్తంమీద పర్లాకిపూడి హరిజనులూ రామ భూపాలపట్నం హరి జనులూ కలిసారు"

రామనాథం మాటలు నారాయణ

స్వామిని పెద్దగా కదిలించలేదు. 'నువ్వు చూసేవా? విన్నావా?' అంటూ అడిగాడు గుమిగూడిన జనాన్ని తాను స్వయంగా చూసేనని వాళ్ళ మాటలు స్వయంగా విన్నాననీ గట్టిగా చెప్పాడు రామనాథం

"ఉదయం మాదామంటూ" లోపలికి వెళ్ళిపోయాడు నారాయణస్వామి రామనాధాన్ని పంపేసి గేటుమూసేసాడు నౌఖరు

ఆరాత్రి ముగిసింది. ఆంధ్రదేశంలో సూర్యుడు మామూలుగానే బయటకు వచ్చాడు. చలిగాలి మామూలుగానే వీచింది మంచుతెర దట్టంగానే ఉంది గ్రామాల్లో మామూలుగానే భోగిమంటలు లేచాయి. అభ్యంగన స్నానాలు జరిగాయి జనం కొత్త బట్టలు తొడుక్కున్నారు హరిదాసులు వైష్ణవగీతాలు పాడుతూ గ్రామ వీధులు కలియతిరిగారు. గంగిరెద్దులు ఊరేగాయి ముంగిళ్ళకు రంగవల్లులు కొత్త అందాలను పొదిగాయి. బంతి పూలు విరబూసాయి పిల్లలు వేస్తున్న గొబ్బి దండలతో మంటలు ఉత్సాహంగా లేచి చలిగాలులను తరిమేసాయి

కాని— రామభూపాలపట్నం నడివీధులలో భోగిమంటల కోసం పేర్చి నకలపతో గొల్లలలో ముప్పైరెండు మంది శవాలు తగలబడుతున్నాయి ఆరుగురు హరిజనుల శవాలు, యిద్దరు తెలగాల శవాలు ఆవూరి వీధుల్లో పడున్నాయి జరిగిన దౌర్జన్యం తీవ్రత వివరించాలంటే అయిదురోజులపాటు యిరవై మంది నిర్విరామంగా శ్రమించినా అక్కడక్కడ మానవ శరీర ఖండాలు దొరుకుతూనే వున్నాయి ఆ గ్రామంలో మూడింట రెండు వంతుల గడప నామరూపాలు లేకుండా భోగిమంటలకు బదులుగా కాలిపోతూనే ఉన్నాయి ముప్పైమైళ్ళ దూరం నుంచి వచ్చిన పైరింజన్లు పచ్చేసరికి మొండిగోడలు,ఏడుపు మొగాలు మాత్రమే మిగిలాయి. మూడువందల అరవై మూడు మంది హరిజనులనీ, అరవై ఎనిమిది మంది తెలగాలనీ, సలభై ఆరుమంది గొల్లలనీ నిర్బంధంలోకి తీసుకున్నారు.

రంగరాజు అనే ప్రత్యక్షసాక్షి కథనం ప్రకారం-

"రాత్రి పన్నెండు దాటింది తల గడుగులుకోసం మాగలిని ఒంటిగంటకే రమ్మన్నాను పిల్లల్ని లేప మని మాఆవిడతో చెప్పాను పొయ్యి అంటించి నీళ్ళు కాచటానికి ఆమె ఉపక్రమిస్తోంది చెంబు పట్టుకుని నేను బయటికి నడిచాను ఇల్లు దాటి నాలుగు అడుగులు వేసాను, రామస్వామి కొట్టుని నాశనం చేసాక మూడు నాలుగుసార్లు పర్లాకిపూడి హరిజనుల్లకీ మాపూరి గొల్లలకీ గొడవ జరిగాయని చెప్పుకున్నారు గొల్లలు స్టేషన్‌లో రిపోర్టిచ్చినా ఆ కాగితం తీసుకోలేదనీ, యిన్స్‌పెక్టరు హరిజనుల తరఫు మనిషనీ అనుకున్నారు. గత్యాగత్యా ఏదో రోజున పెద్దగొడవే జరుగుతుందనీ గొల్లలు చేతుల ముడుచుకు కూర్చోరనీ పెరికిలను కలుపుకొని రాడానికి ప్రయత్నిస్తున్నారనీ మావూళ్ళో పెద్దరూమరు మొదలయింది పర్లాకిపూడి హరిజనుల మీద ఏదయినా దాడి జరిగినా గొల్లలకీ మావూరి హరిజనులకీ మధ్యగల సత్సంబంధాల దృష్ట్యా వీళ్ళు కలగజేసుకోరని కూడా మేం నమ్ముతూవచ్చాం

కాని మా అభిప్రాయాలు తప్పయాయి నేను చెరువుగట్టు ఎక్కి సర్దుకుంటూం డగా దూరంనుంచి ఎవరో వస్తున్నట్టు అలికిడి అయింది. యాదాలాపంగా చూసాను. ప్రవాహంలాసాగి వస్తున్నారు ఎవరూ గట్టిగా మాట్లాడటంలేదు. సన్నగా వినిపిస్తున్న ఆమాటలు స్పష్టంగా తెలీ టంలేదు. నా అంచనా ప్రకారం వెయ్యి మందుంటారు. నేనున్న చెరువుగట్టుకి సమీపంలోనే గోపయ్య యిల్లు ఉంది అతను ఊరికి పెద్ద మోతుబరి-గొల్లకుల స్తుడు. అతని యింటిముందు ఆగింది. గుంపు చూస్తూండగానే గబగబా పది మంది వీధి అరుగు ఎక్కారు. ఓ వ్యక్తి తలుపులు తట్టాడు, కొద్ది నిమషాలలో తలుపులు తెరవబడ్డాయి- అంతలోనే మూసేయడానికి ప్రయత్నం జరిగింది. ముందు నిలుచున్న యిద్దరు ముగ్గురు తలుపు తెరిచిన వ్యక్తిని బలవంతంగా బయటకు లాగారు. రెండు తలుపులూ బార్లా తెరిచారు "ఎంకావాలి?" అంటూ పెడరెక్కలు విరిచిపట్టుకున్న మనుషు లని గింజాయించుకుంటూ అరుస్తున్న గొంతు గోపయ్యది. అతనిగొంతుకనాకు అంచనా తెలిసింది- రామస్వామి కావాలి ఓ గొంతు పెద్దగా అరిచింది. ఎవరిదో నాకు తెలీలేదు. మావూరి గొంతులాలేదు 'నాకు తెలీదు' అనే మాటలు గోపయ్య అంటున్నాడు- అంతలోనే- అమ్మా అనపుతో క్షణాలలో గోపన్న- వాలి పోయాడు. కొందరు అతన్ని జనం మధ్యకు యీడ్చుకు పోయారు జరిగిందే మిటో నాకు అర్థమయేసరికి భయంతో పళ్ళు పణికిపోయింది., ఏం చేస్తున్నానో తెలియ, ఎలా పరిగెత్తానో తెలీదు చేలకు అడ్డబడి పరుగెత్తాను- మర్నాడు నేను తిరిగి వచ్చేసరికి- ఊరు స్వరూపమే మారిపోయింది. నిజానికి రామస్వామి ఏనాడో ఊరు దాటేసాడు. అతని ఆచూకీ తెలియవచ్చునన్న ప్రతి గొల్లకులస్తుడికీ మరణం తప్పలేదు"

ఈ దొమ్మీలో కీలకపాత్ర వహించి నది ఎవరన్నది ప్రధాన ప్రశ్నకాదు. అయితే ప్రభుత్వ విచారణ ఆ దిశగానే జరిగింది. కొందరు వ్యక్తులకు లాగేకొన్ని ప్రభుత్వాలకు కూడా సమస్యలకు పరి ష్కారం కాక కప్పివేత మాత్రమే అవ సరమవుతుంది. అవాంఛనీయ సంఘట నలు జరిగితే వాటిద్వారా కూడా తమ ప్రాబల్యాల్ని యినుమడింప జేసుకునే ఆలోచనా ధోరణి కొందరికి ఉంటుంది, వారు ప్రభుత్వంలో ఉండటం తటస్థిస్తే ఏ అవాంఛనీయ సంఘటనకూ సరయిన ఆధారం కనిపించకుండా పోతుంది.

●

---

"మొత్తం పధ్నాలుగు మంది అమ్మాయిలు ఒకే గొడుగులో తలదాచుకున్నారు. అయినా ఒక్కరు కూడా తడవలేదు!"

"ఎందుకని?"

"అసలు వర్షంలేదు—"

# ఆ అనుభవం కావాలి!



పి. మోహన్ కుమార్

## 27

స్వప్న చెప్పింది విని నమ్మాలో వద్దో తేల్చుకోలేక పోయాడు ఆనందరావు. స్వప్న నిర్ణయానికి ఆయన లోలోన సంతసించినా ఆమె అలా మనసు మార్చుకోడం మంచిదా అన్న సంశయం ఆయన్ని పీడించింది. స్వప్న ప్రకాష్ని చేసుకుంటుందేమో అని ఆయన అనుకున్నాడు. అంతేకాని ఆమె ఆసంగతి ఎప్పుడూ చెప్పలేదు. స్వప్న ప్రకాష్ని స్టడి చేయడాన్ని తను ప్రేమ అనుకున్నాడా? ప్రేమ ప్రయాణంలో ఆ అధ్యాయాన్ని ఏమంటారు.

### జరిగిన కథ

దైన్యమైన పరిస్థితుల్లో ప్రశాంత్ని చేరిన స్త్రీని కాపాడిన ప్రశాంత్ డ్యూటీ నుంచి తిరిగివచ్చి చూసుకునేసరికి ఆమె లేదు-వెళ్ళిపోయింది. ఆ సందర్భంలో లక్ష్మిగురించి ప్రస్తావిస్తూ అత్తయ్య రాసిన ఉత్తరం కనిపించింది. అభాగ్యురాలై తనని మోసగించిన ఆమె నిజస్వరూపం ఆమె రాసిన ఉత్తరంద్వారా గ్రహించాడు ప్రశాంత్. ఆమె ఎవరో కాదు-ప్రవీణ్ చేత మోసపోయిన స్త్రీ. ఫోటోతోపాటు ప్రవీణ్ ఆమెని తిరస్కరిస్తూ రాసిన లెటరూ దొరికింది తనకి. ప్రవీణ్, స్వప్నల ఆనంద యానంలో ప్రశాంత్ కంటబడింది తను వెదుకుతున్న స్త్రీమూర్తి. కారు ఆపి ఆమెకోసం పరుగుతీసినందుకు ఫలితం-ప్రవీణ్ నిర్దాక్షిణ్య ప్రవర్తన.

తనకి ఆ విషయంలో అనుభవం లేదు. తనకి దాని గురించి తెలియదు. ఇప్పుడు స్వప్న ఇలా చెప్పిందంటే ప్రవీణ్ విషయంలో ఆమె ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చిందన్న మాట.

పోనీ ఇదీ మంచి[illegible]న్నాడు ఆనందరావు

అయితే తొందరలో ఎంగేజ్‌మెంట్ ఫిక్స్ చెయ్యాలి.

ఆ ఆలోచనరాగానే ఆనందరావుకి గుబులు పెరిగింది. ప్రవీణ్ నిజంగా ఎలాంటివాడు. చూడ్డానికి బాగానే ఉన్నాడు. పనిలో నైపుణ్యం ఉంది. మనిషిలో అవగాహన వుంది. అయితే అతను స్వప్నని సుఖపెడతాడా? మంచి పని మంతుడు మంచి భర్త కావాలన్న రూలు ఎక్కడా లేదు.

ఈ విషయంతో స్వప్న ఓ నిర్ణయం తీసుకోవాలని ఇంత కాలంగా ఎంతో అసహనంతో ఎదురు చూసాడు అయితే ఆ నిరీక్షణకి ముగింపు వచ్చేసరికి ఎక్కడ లేని సందేహాలు కలుగుతున్నాయి తను వేస్తున్న అడుగు సరైనదేనా అన్న అనుమానం పీడిస్తోంది.

'సరె అంతా మనమంచికే' అని సరిపెట్టుకున్నాడు ఆనందరావు.

*　　*　　*

స్వప్న, ప్రవీణ్‌ల మాటలు వింటూ కారు డ్రైవ్ చేస్తున్న ప్రశాంత్‌కి పిచ్చెక్కినట్టుగా ఉంది స్వప్న ఊబిలో కాలేస్తోంది ఆ సంగతి తెలిసీ తనేం చెయ్యలేక పోతున్నాడు

ప్రవీణ్ నవ్వుతున్నాడు

స్వప్న శృతి కలిపింది.

ప్రవీణ్ పట్ల అసహ్యం తాలూకు పులుపు ప్రశాంత్ నరనరాల్లో వ్యాపించింది తిన్నగా కారుని ఏ గోడకేనా గుద్దేదామా అనిపించింది.

స్వప్నని కాపాడాలి

ఎలాగేనా సరే

ఆమె ఏమనుకున్నా ఆమెకి అసలు సంగతి తెలియజెయ్యాలి. ఎంగేజ్‌మెంట్ పార్టీ గురించి మాట్లాడుకుంటున్నారు. ప్రవీణ్ ఎంత గర్వంగా నవ్వుతున్నాడు! అతనికి గెలుపు అతి చేరువలో ఉంది.

ఈ పెళ్ళి ప్రవీణ్‌కి ఓ ఆభరణం. అయితే అది స్వప్నకి ఓ సంకెలగా మారుతుంది దీని మూలంగా స్వప్న సుఖపడుతుందన్న నమ్మకం తనకి లేదు.




కారు ఆగింది

ప్రవీణ్ దిగి టాటా చెప్పి వెళ్ళిపోయాడు.

కారు కదిలింది

స్వప్నతో మాట్లాడాలంటే ప్రశాంత్‌కి భయంగా ఉంది అయితే మాట్లాడకుండా ఉండలేక పోతున్నాడు ఆమెకి చెప్పమని మనసు తొందర పెడుతోంది. అయితే ఏం చెప్తాడు? ఎలా చెప్తాడు? ఆమె కసురుకుని "నా ఇష్టం నువ్వెవరివి?" అంటే ఏం చేస్తాడు

ఆనందరావు గారిల్లు చేరువైంది

చెప్పాలి? త్వరగా చెప్పెయ్యాలి ఆలస్యం అయితే ఈ అవకాశం మళ్ళీ రాకపోవచ్చు

"స్వప్నా" గొంతు పెగుల్చుకుని అన్నాడు ప్రశాంత్.

ఇన్ని రోజులు కారు నడిపినా అవసరమైన దానికన్నా ఎక్కువ మాట్లాడని అతను. అలా పేరుపెట్టి పిలవడంతో ఉలిక్కి పడింది స్వప్న.

"ఏమిటి" అన్నట్టు చూసింది. ఆమె ముఖం అతనికి అద్దంలో కనిపిస్తోంది వినే మూడ్‌లో ఉన్నట్టుంది అనుకున్నాడు

"నేను మీ ఉద్యోగిగా మాట్లాడడం లేదు శ్రేయోభిలాషిగా మాట్లాడుతున్నాను. మీ వ్యక్తిగత విషయాల్లో జోక్యం కల్పించుకుంటున్నందుకు క్షంతవ్యుణ్ణి. మీ నిర్ణయం నాకు సరైందిగా కనిపించటం లేదు.

"కనిపించటం లేదా అనిపించటం లేదా" - స్వప్న ప్రశ్నకి నిర్ఘాంత పోయాడు ప్రశాంత్

"రెండూను"

"థాంక్స్ నాపట్ల అంత శ్రద్ధ చూపిస్తున్నందుకు కృతజ్ఞతలు. నా విషయంలో ఇంత ఆసక్తి చూపించి అనుక్షణం నేనేం చేస్తున్నానో తెలుసుకుంటూ నాక్షేమం కోసం పాటుపడే వ్యక్తి నాకు డ్రైవర్‌గా దొరకడం నా అదృష్టం మిస్టర్ ప్రశాంత్ ఓ విషయం గమనించండి నాకు డ్రైవర్ అవసరం లేదు నా జీవితాన్ని నేను నడుపుకోగలను నాకు ఏది మంచో ఏదికాదో నేను తెలుసుకోగలను"

"సారీ- మిమ్మల్ని నేను నొప్పించానను కుంటాను నాకు లౌక్యం తెలియదు మనసుకి అనిపించింది సూటిగా చెప్తాను ప్రవీణ్ మీరు అనుకుంటున్నంత మంచి వ్యక్తి కాదు"

"ఎప్పట్నుంచి ఆయన మంచి వాడు కాకుండా పోయాడు నేను ఆయన పట్ల ఇష్టపడడం ప్రారంభించినప్పటి నుంచీనా ఆయన నిజంగా మంచి వ్యక్తే కాక పోతే ఈరోజు వరకూ ఊరుకుండి ఈరోజు ఎందుకు చెపుతున్నారు"

"స్వప్నా ప్రపంచంలో రకరకాల మనుషులుంటారు అందరి గురించి మనం పట్టించుకోం. అయితే మనకి కావలసిన వాళ్ళ గురించి, వాళ్ళతో సంబంధం పెట్టుకోబోయే వ్యక్తుల గురించి పట్టించుకుంటాం"

"తమకి సంబంధం లేని వ్యక్తుల గురించీ పట్టించుకునే వాళ్ళు లేకపోలేదు"

"ఉండచ్చు. నేను అలాంటి వాణ్ణికాను. ఇప్పుడు సందర్భం వచ్చింది కాబట్టి చెబుతున్నాను. ప్రవీణ్ నైపుణ్యంగల వ్యక్తి. ఈ కంపెనీ ఉద్యోగుల్లో చురుకైన వాళ్ళలో ఒకడు. ఆ సంగతి నేనూ విన్నాను. అయితే వ్యక్తిగా అతని లోపాలు అతనికున్నాయి. వాటి మూలంగా కంపెనీకి నష్టంలేదు. అందువల్ల అతని గురించి చెప్పలేదు. అయితే ఇప్పుడు పరిస్థితివేరు. ప్రవీణ్ ఇప్పుడు కంపెనీ ఉద్యోగే కాదు. నా కిష్టమైన వ్యక్తితో..."

"స్టాపిట్ ప్రశాంత్, మీరిలా మాట్లాడ్డానికి కారణం నాకు తెలుసు. అసూయ కూడా అయి ఉండాలి"

"స్వప్నా. మీరిలా అనుకుంటారని నాకు తెలుసు. అందుకే ఎంతో సందేహించి, సందేహించి ఈమాట చెప్పాను. నేను ఒకప్పుడు మీ మీద ఆశపడ్డమాట




నిజమే. అయితే ఇప్పుడు ఆ ఆశలేదు. ఇప్పుడు నేను కేవలం నీ సుఖాన్ని, క్షేమాన్ని కోరుకునే వ్యక్తిని- అంతే. అవి మీకు ఎవరిమూలంగా వచ్చినా సంతోషిస్తాను అసూయపడే ప్రసక్తిలేదు. మీరు మోసపోతే, దాని మూలంగా నష్టపోతే మొట్టమొదట ఏడ్చే వాణ్ణి నేను. ఎందుకు అంటే నాదగ్గర సమాధానం లేదు"

స్వప్న మాట్లాడలేదు.

"ఒక డ్రైవర్ తన అవధుల్ని, హద్దుల్ని అతిక్రమించి సలహాలు ఇస్తున్నాడని మీకు కోపం వస్తే రావచ్చు"

"మిమ్మల్ని నేనెప్పుడూ ఒక సామాన్యమైన డ్రైవర్‌గా చూడలేదు" అంది స్వప్న. నెమ్మదిగా తనలో తను అనుకున్నట్టుగా ఉంది ఆమాట.

"మీ నిర్ణయం మార్చుకోమని నేనను. కాని జాగ్రత్తగా ఆలోచించండి"

"ప్రవీణ్‌కి ఏంలోపం" అడగబోయింది స్వప్న, కాని అలా అడగడానికి ఆమె అహంకారం అడ్డొచ్చింది.

కాని అలా అడిగి ఉంటే ఆమే లాభం పొంది ఉండేది

"థాంక్స్" అంది స్వప్న.

కారు ఇంటిముందు ఆగింది.

స్వప్న దిగి వెళ్ళిపోయింది.

28

ఆ సంఘటన జరిగి వారం అయింది. పరిస్థితిలో ఏ మార్పూరాలేదు. స్వప్న ప్రవీణ్‌ల సంబంధం ఎంగేజ్‌మెంట్ వైపు పరుగుతీస్తోంది. తను చెప్పిన దాని

ప్రభావం లేకపోవడంతో కణతలు నొక్కుకున్నాడు ప్రశాంత్

ఎంగేజ్‌మెంట్ పార్టీ దగ్గరకొస్తున్న కొద్దీ అసౌకర్యంగా ఫీలవుతున్నాడు దీన్ని ఆపగల శక్తి విజయకే ఉంది ఆమే సహకరిస్తే ప్రవీణ్ గుట్టు బట్టబయలు చేసి దీన్ని ఆపుతాడు దీన్ని ఆపితే తనకేదో ఒరుగుతుందని కాదు స్వప్నని చిక్కుల్లోంచి తప్పించినట్టవుతుంది

విజయను కలుసుకున్నాడు ప్రశాంత్ జరిగింది చెప్పాడు

"నువ్వు ఎలాగేనా స్వప్నని కాపాడాలి" అని బతిమాలాడు

"దీని మూలంగా స్వప్నకి నష్టం జరుగుతుందని నీకెందుకంత గట్టినమ్మకం" అడిగింది విజయ

'ప్రవీణ్ నీకు ఎంత అన్యాయం చేసాడో చూసికూడా స్వప్న దీనిమూలంగా లాభం పొందుతుందని నమ్మమంటావా"

"అన్నయ్యా స్వప్నకీ నాకూ సామ్యమా? అన్నీ ఉన్న అమ్మాయి స్వప్న ఏమీలేని అభాగ్యురాల్ని నేను అందుకల్లే నన్ను ఇలా వదిలేసాడు స్వప్నని ఎందుకు వదిలిపెడతాడు దీనిమూలంగా ఇద్దరి జీవితాలు బాగుపడచ్చు"

'అది నీ ఆశ అతను స్వప్నని చుట్టుం వేసుకున్న తీరుచూస్తే అతను దేనికేనా వెనుతీయడని తెలుస్తోంది అతనికి లేని అలవాటు లేదు కాని స్వప్న ఎదురుగా ఎంత బుద్ధిగా ఉంటున్నాడు పెళ్ళయ్యేంతవరకు ఇలా ఉంటాడు ఆ తర్వాత అసలు రంగు బయటపడుతుంది స్వప్న అసలె సున్నితమైన మనిషి"

"స్వప్నగురించి అంత బాగా నీకెలా తెలుసు ఆమె అంటే నీకు ఎందుకంత శ్రద్ధ" విజయ అడిగింది ప్రశాంత్ మాట్లాడలేదు తిరిగి ఆమే అంది

"నీ మంచితనం అలా ఆలోచింపచేస్తోంది అన్నయ్యా ముక్కు ముఖం తెలియని నా గురించె ఆలోచించి మనసు పాడుచేసుకున్నావు నీ యజమానురాలి గురించి ఆందోళన పడడంలో ఆశ్చర్యం ఏముంది నా కెందుకో అంతా సవ్యంగా జరుగుతుందన్న నమ్మకం ఉంది"

"విజయా ఎలాగేనా జరగని మన అదృష్టం ఎలా ఉంటే అలా జరుగుతుంది కాని స్వప్నకి నిజం తెలియాలి ఆ తర్వాత ఆమె ఇష్టం ఆమె అదృష్టం నాకు ఈ విషయంలో సహకరించు"

"ఏం చెయ్యమంటావు? ఆమెదగ్గరకెళ్ళి నా స్థితికి కారణం ప్రవీణ్ అని చెప్పమంటావా? అలా చెపితే ఆమె నమ్ముతుందా? నా స్థితికి కారణం ప్రవీణ్ కాదు ప్రశాంత్ అంటే ఏమవుతుంది కాదని నేను రుజువు చెయ్యగలనా?"

"విజయా!"

అన్నయ్యా! ఈ ప్రపంచంలో కొన్ని విషయాలకి అంతరాత్మే సాక్షి రుజువులు, నిరూపణలు ఏమీ సాధించలేవు'

"నీదగ్గర అతనురాసిన ఉత్తరం, ఫోటోలు ఉన్నాయికదా! అవి చూపిద్దాం"

"వాటిని చింపేసాను అవి నీ చేతుల్లోకి రాగానే నువ్వు చదివావు అలాగే అవి ఎవరి చేతుల్లోకేనా వెళ్ళచ్చు అందరూ నీలాంటి మంచివాళ్ళు కారు అయినా ప్రవీణ్ ఇప్పుడు నా మనిషి కాదు నా మనిషికాని వ్యక్తి ఫోటోలు, ఉత్తరాలు నా దగ్గర ఉంచుకునే హక్కు నాకెక్కడిది వాటిమూలంగా మేలు ఎలాగూ జరగదు ఎటుకూడి జరిగితే కీడే జరుగుతుంది అందువల్ల వాటిని చింపేసాను"

ప్రశాంత్ కణతలు నొక్కుకున్నాడు

"అన్నయ్యా ఈ ప్రయత్నం మానుకో దీనిమూలంగా నా పరువుపోవడమే తప్ప ఇంకేమీ జరగదు" విజయ బాధగా అంది

ప్రశాంత్‌కి ఏంచెయ్యాలో పాలుపోలేదు

ఆఖరికి ప్రకాష్‌ని కలుసుకోడానికి నిశ్చయించుకున్నాడు

* * * * *

"తీసుకోక తీసుకోక ఓ నిర్ణయం తీసుకున్నాను శుభమా అని నేను నిర్ణయించుకుంటే మీరందరూ నన్నెందుకిలా భయపెడుతున్నారు" ప్రకాష్‌వంక తీక్షణంగా చూస్తూ అంది స్వప్న

"భయపెట్టడం కాదు స్వప్నా ని మేలుకోరి"

స్వప్న వ్యంగ్యంగా నవ్వింది "ఈమధ్య నా మేలుకోరేవారి సంఖ్య హఠాత్తుగా పెరిగిపోయింది కారణం తెలియడం లేదు"

"ప్రవీణ్‌కి ఇంతకుముందే ఓ అమ్మాయితో సంబంధం ఉంది"

"ఎవరు చెప్పారు? ప్రశాంత్ చెప్పాడా?"

ప్రకాష్ దాన్ని పట్టించుకోలేదు

"ఆ అమ్మాయి వివరాలు నాకు తెలుసు కావాలంటే నువ్వే స్వయంగా దర్యాప్తు చేసుకో"

"ఆ అవసరం నాకు లేదు మిస్టర్ ప్రకాష్! ఓ నిర్ణయానికి వచ్చిన నా మనసులో అనవసరమైన సందేహాలు రేపకండి మేం సుఖంగాఉంటే సంతోషించండి అంతేకాని"

"స్వప్నా నువ్వు అలా అనుకుంటే నేనేం చెయ్యలేను క్షమించు' ప్రకాష్ వెళ్ళిపోయాడు

స్వప్న సోఫాలో కూర్చుండిపోయింది

* * * * *

ప్రకాష్ మాటలువిన్న పరబ్రహ్మం గతుక్కుమన్నాడు అతని మాటలు తేలిగ్గా తీసుకోవాలనిపించలేదు. ఆనందరావుకి చెప్పాడు. ఆ మాట వినడంతో ఆనందరావు తలపట్టుకున్నాడు

"పరబ్రహ్మం నీ కంప్యూటర్ని నమ్మి అనవసరంగా రొంపిలో దిగాను హాయిగా నాకు తెలిసిన సంబంధాలు చూసుంటే ఈ టెన్షన్ తగ్గుండేది."

"తొందరపడకు. నేను ఏదో ఒకటి ఆలోచిస్తాను. నిజా నిజాలు తెలుసు కుందాం"

* * * * *

అనుకోకుండా తనగదికి వచ్చిన ఇద్దరు పెద్దమనుషుల్ని చూసి ఆశ్చర్య పోయింది విజయ.

"నీతో చిన్న పనుందమ్మా" అన్నాడు పరబ్రహ్మం.

"కూర్చోండి. కూర్చోమనడానికి నా గదిలో కుర్చీలు కూడా లేవు" అంది విజయ నొచ్చుకుంటూ.

"ఫర్వాలేదమ్మా" చాపమీద కూర్చున్నారు ఆనందరావు, పరబ్రహ్మం విజయ గోడవారకి నిలబడి వుంది.

"నీకు ప్రవీణ్ అనే కుర్రాడు తెలుసా?" అడిగాడు పరబ్రహ్మం.

ఏం సమాధానం వస్తుందోనని ఆనందరావు గుండె బితుకుబితుకుమంటోంది ఆమె ముఖంలోకి చూసిన పరబ్రహ్మం ఆ ముఖంలోని క్వశ్చన్‌మార్క్‌ని గమ నించాడు. తనగురించి చెప్పుతుందే తప్ప ఆమె నిజం చెప్పకపోవచ్చు.

"నేను ప్రవీణ్ బాబాయిని. ప్రవీణ్ మూలంగా ఓ అమ్మాయికి అన్యాయం జరిగిందని తెలిసింది. విచారించగా నీ ఎడ్రస్ దొరికింది. ఇలాంటివి జరగడం మా ఇంటా వంటా లేదు నిజం చెప్పు నేను విన్నదే నిజమైతే ప్రవీణ్‌ని నిందీసి ఒప్పించి మీ ఇద్దరికి పెళ్ళిచేయిస్తాను" పరబ్రహ్మం బొంకిన తీరుచూసి ఆనంద రావు ఆశ్చర్యపోయాడు

"నిజంగా నీకు అన్యాయం జరిగితే దాన్ని సరిచెయ్యడానికి వచ్చాం కాబట్టి నిజం చెప్పు" ఆనందరావు వంతపాడాడు

విజయ ఆశ్చర్యపోయింది తనలాంటి నిర్భాగ్యులపట్ల జాలిచూపే మంచి వాళ్ళు ఈ ప్రపంచంలో ఇంకా మిగిలి ఉన్నారన్నమాట నిజంచెప్పి వాళ్ళనుంచి

సాయం పొందాలన్న ఆశ కలిగింది కాని క్షణంలో దాన్ని అణుచుకుంది ప్రవీణ్ మార్గానికి తను అడ్డువెళ్ళకూడదనుకున్న నిర్ణయాన్ని మార్చుకోదలుచుకోలేదు పైగా తనంటే లక్ష్యంలేనివాడు ఒకళ్ళ మాటవిని తనను చేసుకున్నా, తనతో ఆనందంగా ఉండగలడా? తనకు కావలసింది పెళ్ళికాదు, ప్రేమకూడా. అదిలేని పెళ్ళి పెళ్ళేకాదు.

"క్షమించండి. మీరు పొరపాటు పడుతున్నారు. నాకు ప్రవీణ్ ఎవరో తెలియదు" అంది.

పరబ్రహ్మం, ఆనందరావు 'అమ్మయ్య' అనుకున్నారు.

"అయితే మరి నీకు అన్యాయం చేసిన వ్యక్తి ఎవరు" అడిగాడు పరబ్రహ్మం.

"క్షమించండి. భగవంతుడి దయవల్ల నాకు ఏ అన్యాయం జరగలేదు."

వాళ్ళిద్దరూ లేచారు.

"మేం పొరపాటున నీదగ్గరకొచ్చి ఉంటాం. నిన్ను ఇలా ఇబ్బంది కలిగించే పరిస్థితిలో పెట్టినందుకు క్షమించు"

ఇద్దరూ క్షమాపణలు చెప్పుకుని బయటకి నడిచారు.

ఆమె బయటకి వచ్చి వాళ్ళని సాగనంపింది. ఆమె గుండె బరువెక్కింది. ఆకాశంలో చంద్రుడు దట్టమైన మబ్బులమాటుకి వెళ్ళిపోవడం కనిపించింది.

అయితే వాళ్ళిద్దరూ హాయిగా ఊపిరి పీల్చుకున్నారు.

29

తనగురించి వివరాల్ని స్వప్నకి, ఆనందరావుకి ఇవ్వడానికి ప్రకాష్, ప్రశాంత్‌లు ప్రయత్నించడం ప్రవీణ్‌కి తెలిసింది. అఫెన్స్ ఈజ్ ది బెస్ట్ ఫార్మ్ ఆఫ్ డిఫెన్స్, రక్షించుకోడానికి చేసే అన్ని ప్రయత్నాల్లోకి ఉత్తమమైంది ఎదురుదెబ్బ తీయడం.

ప్రశాంత్ సామాన్యమైన డ్రైవర్ అతని మూలంగా తనకేం ప్రమాదంలేదు. స్వప్న అతని గురించి కనీసం ఆలోచించదు. కాని ప్రకాష్ అలాకాదు. ఒకప్పుడు ఆనందరావు, స్వప్న ఇద్దరూ అతనంటే ఇష్టపడ్డారు. తను అజాగ్రత్తగా ఉంటే మళ్ళీ అతను వెనకటి స్థానాన్ని ఆక్రమించే అవకాశం ఉంది- అందువల్ల అతన్ని దెబ్బతియ్యడం అన్నింటికన్నా ముఖ్యం.

అతని వివరాలు ఆరాతీసాడు ప్రవీణ్.

అతని మామయ్య తన కూతుర్నిచ్చి పెళ్ళి చేయడానికి సంకల్పించడం, ప్రకాష్ అనుకోకుండా ఇక్కడ చేరడం, అతను తెలుసుకున్నాడు.

ప్రకాష్ మోహనయ్య సదాశివరావుని కలిసి జరిగిందంతా చెప్పాడు

అంతా విన్న ఆయనకి ఏం చెయ్యాలో తోచలేదు పార్వతిని సంప్రదించాడాయన

"ఆ అమ్మాయి ఇప్పుడు వీణ్ణి చేసుకోనంటోందిగా అలాంటప్పుడు వీణ్ని వదులుకోడం ఎందుకు కొంతకాలం ఆగుదాం-వాడంతట వాడు మనసు మార్చుకుని లక్ష్మిని చేసుకుంటానంటే, లక్ష్మి అందుకు ఇష్టపడితే చేద్దాం లేకపోతే లేదు" అంది పార్వతి

"ఒకసారి ఆనందరావుని కలుసుకుని ఆయనకి జరిగిన సంగతంతా చెపితే ఎలా ఉంటుంది" అనిపించింది సదాశివరావుకి అయితే పార్వతికి ఆ విషయం చెప్ప లేదు చెపితే తప్పక వద్దని ఉండేది

30

"దీన్ని పటేల్ రోడ్‌లో ఉన్న ఆడిటర్ సుబ్రహ్మణ్యంకి ఇవ్వాలి చాలా జాగ్రత్తగా ఇవ్వాలి" తనలో తను అనుకుంటున్నట్టుగా బిగ్గరగా అన్నాడు ఆనంద రావు, ఆయన ఎదురుగా ఓ టేబుల్ మీద బ్రీఫ్‌కేస్ ఉంది ఎదురుగా కుర్చీలో ప్రకాష్, ప్రవీణ్‌లు కూర్చున్నారు

"దాంట్లో ఏముంది" అడిగాడు ప్రకాష్

"కాష్"

"చెక్ ఇవ్వచ్చుగా"

బ్లాక్‌మనీ చెల్లింపు చెయ్యడానికి ఎవరూ చెక్ వాడరన్న నిజం ప్రకాష్‌కి తెలి యక పోదు అయినా స్ఫురించలేదు

"చెక్ ఇచ్చేది కాదు" అన్నాడు ఆయన

దాని గురించి అర్థమైంది ప్రకాష్‌కి

"మీరు అర్జంటుగా ఊరెడుతున్నారు కదా-వచ్చేవరకు ఆగుతారా లేక నన్ను ఇవ్వమంటారా" ప్రవీణ్ అడిగాడు

"ఊర్నుంచి వచ్చేవరకు ఆగాడానికి వీలు లేదు అసలు నేను ఈపని ఉద యమే ముగించుకోవలసింది ఆలస్యం చేసాను ప్రకాష్ మీరు తీసికెళ్ళి ఇస్తారా నేను ఫోన్‌చేసి సుబ్రహ్మణ్యంకి చెప్తాను" అన్నాడు ఆనందరావు

తన మీద ఆయనకి ఉన్న నమ్మకం చూసి ఆశ్చర్యపోయాడు ప్రకాష్ ప్రవీణ్‌కి కొంచెం ఆశాభంగం కలిగింది

"ఓయస్" అంటూ లేచాడు ప్రకాష్ దాన్ని తీసుకుని కారెక్కి బయల్దే రాడు

ఆ ఆడిటర్ ఆఫీసు మూసి వుంది

"ఇంకో అరగంట తర్వాత వస్తారు" అక్కడ ఓ అబ్బాయి చెప్పాడు, "కూచోండి" అన్నాడు

ఆ పక్కనే ఉన్న పార్కులో కాసేపు కూచుందాం అనుకున్నాడు ప్రకాష్

"అరగంట తర్వాత వస్తాను" అని లేచాడు

ప్రకాష్ పార్క్ చేరుకున్నాడు కారాపి డోర్ లాక్ చేసి పార్కులో చెట్టు కింద కూర్చుని ఆ తోట అందాన్ని చూస్తున్నాడు ఎదురుగా చెట్టు మీద రెండు కోతులు ఎగురుతూ ఆడుతున్నాయి ఓ చిలుక పండుని కొరుకుతోంది ఇద్దరు పిల్లలు నూతి దగ్గర స్నానం చేస్తున్నారు చెట్ల కింద ఒక అబ్బాయి చదువుకుంటున్నాడు కాస్తదూరంగా ఓ పొదమాటున అమ్మాయి అబ్బాయి కబుర్లు చెప్పుకుంటున్నారు

వాటిని చూడ్డంలో తల మునకలయ్యాడు ప్రకాష్

అరగంట గడిచింది లేచి వచ్చి కారెక్కాడు, ఆ ఆఫీసు దగ్గర ఆగి వెనక సీట్లోకి చూసాడు

బ్రీఫ్ కేసు లేదు

ప్రకాష్ గుండె వేగంగా కొట్టుకుంది ఒక్కసారిగా అతనికి భయంవేసింది కంగారుగా కారంతా వెతికాడు పార్కుకి వెళ్ళి అక్కడ అంతా వెతికాడు అసలు తను దాన్ని కారులోంచి బయటకు తియ్యలేదని ఖచ్చితంగా గుర్తున్నా కంగారు అలాంటిది

ముఖం వేలాడేసుకు వచ్చిన ప్రకాష్ ని చూసి ఏదో విశేషం ఉందనుకున్నాడు ప్రవీణ్

మర్నాడు సాయంత్రం వచ్చాడు ఆనందరావు జరిగింది తెలుసుకుని ప్రకాష్ మీద ఎగిరిపడ్డాడు

"అంత డబ్బు ఉందని తెలిసి అంత అజాగ్రత్తగా ఎందుకున్నారు దాంట్లో ఎంతుందో తెలుసా? రెండు లక్షలు తెండి ఎక్కణ్ణుంచి తెస్తారో తెచ్చి ఇవ్వండి మిమ్మల్ని ఉద్యోగంలోంచి సస్పెండ్ చేస్తున్నాను ఆ డబ్బు ఇస్తేనే ఉద్యోగం లేకపోతే "

అలా మాట్లాడుతున్న ఆనందరావు వంక ఆశ్చర్యంగా చూసాడు ప్రకాష్ ఆయన అలా మాట్లాడ్డం అదే మొదటిసారి

తనని ఈ పరిస్థితిలో ఆదుకోగలవారు ఇద్దరే—ఒకరు మామయ్య, ఆయన కుటుంబం, రెండోవ్యక్తి స్వప్న

మామయ్యదగరి కెళ్ళడానికి తనకి ముఖం చెల్లదు. స్వప్న దగ్గరికి తను వెళ్ళలేదు ఎలా?

* * * * * * *

"ఏమిటి ప్రకాష్ అజాగ్రత్తమూలంగా రెండు లక్షలు పోగొట్టాడట కదా!" పరబ్రహ్మం ఫోన్‌లో అడిగాడు.

"నీదగ్గర కొచ్చాడా?" ఆనందరావు అడిగాడు.

"అవును!"

"ఏం సలహా ఇచ్చావు?"

"మామయ్యదగ్గర కెళ్ళి అడగమని చెప్పాను!"

"గుడ్. వెదుతున్నాడా?"

"వెదుతున్నట్టే!"

ఆనందరావు బిగ్గరగా నవ్వాడు.

"అజాగ్రత్త మనిషి" అన్నాడు పరబ్రహ్మం.

"ఈ విషయంలో అతని తప్పులేదు. అతను జాగ్రత్తగా ఉన్నా పోయే ఏర్పాటు చేసాను. కారు డూప్లికేటు తాళాలున్న ఓ వ్యక్తి అతన్ని పొంచి వుండి బ్రీఫ్ కేస్ కాజేసాదని అతనికి తెలియదు."

"ఇది నీ పనా?"

"అవును!"

"ఎందుకు?"

"అతన్ని సదాశివరావు శరణు జొచ్చించడానికి. సదాశివరావు నన్ను కలిసి జరిగిందంతా చెప్పాడు. లక్ష్మిని గురించి వింటే నాకెందుకో మంచి అభిప్రాయం కలిగింది. స్వప్నలాంటిదే ఆమెకూడా. ఏదో మెరుగులుచూసి ప్రకాష్ స్వప్నవెంట పడాడు. స్వప్న అతన్ని చేసుకోదు. కాబట్టి అతని దృష్టిని లక్ష్మిమీదకి మరలిస్తే ఆమె మంచితనాన్ని మరోసారి దగ్గర్నుంచి చూసిన అతను ఆమెను తప్పక ఇష్ట పడతాడని నా నమ్మకం. అందువల్ల ఈ ఎత్తు వేసాను" ఆనందరావు బిగ్గరగా నవ్వుతున్నాడు. అవతల పరబ్రహ్మం ఆశ్చర్యపోయాడు. (సశేషం)

---

Ed ted & Published by V Leelavathy Raghavaiah at 1-8-519/11 Ch kkadapalli, Hyd-20 & Printed by P Ramakrishna at Raghava Printers 1 8 4/1/1 Chikkadapalli Hyderabad-20




మనోభావాలకు అందమైన భాషలు ఎన్నెన్నో.
ందులో విమల్ ఒకటి.

చీరలు
జార్జెట్ • షిఫాన్
వాయిల్ • టిష్యూ • కే